P. S. Madhavan Mooney

# హరిశ్చంద్రోపాఖ్యానము

శంకరకవివిరచితము





ప్రకాశకుఁడు.

కొండపల్లి వీరవెంకయ్య,

బుక్సెల్లరు, రాజమండ్రి.

CI

# పూర్వకవులపద్యకావ్యములు

| | | |
|---|---|---|
| సారంగధర | చ॥ వేం | 1—0—0 |
| విజయవిలాసం | ,, | 0-12—0 |
| వైజయంతీవిలాసము | సా॥ త | 0-12—0 |
| శశాంకవిజయం | శే॥ వేం | 1—0—0 |
| బిల్హణీయం | చి॥ సిం | 0—8—0 |
| శివానందలహరి | టీకాతోసహా | 0— |
| కాళహస్తీశ్వరశతకం | డిటో | 0—8— |
| సుమతీశతకం | డిటో | 0—3—0 |
| రుక్మిణీకళ్యాణం | టో | 0—8—0 |
| గజేంద్రమోక్షం | డిటో | 0—8—0 |
| మొల్లరామాయణం | ఆ॥ మొ | 0-12—0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | పిం॥ సూ | 1—0—0 |
| కళాపూర్ణోదయం | ,, | 1—0—0 |

కొండపల్లి వీరవెంకయ్య, బుక్సెల్లరు, రాజమండ్రి.

వైటిలు దే. వి. ప్రెస్సున ముద్రింపబడినది. రాజమండ్రి.

TPLA184B158
2136

శ్రీరస్తు.




శంకరకవిప్రణీతము



పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య

బుక్సెల్లరు, రాజమండ్రి.



దేశీయ విద్యాలయా ముద్రాలయమున ముద్రింపఁబడినది.

రాజమహేంద్రవరము.

1927

వెల 1 0 0

3

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము



## పీఠిక.

శ్రీ వాణీవరవాసవాదివిబుధశ్రేణీశిరోరత్నశో
భావిభ్రాజితపాదపంకజుఁ డుమాభామామనోభర్త కా
శీవిశ్వేశ్వరుఁ డిందుశేఖరుఁడు రక్షించు న్మహాపార వి
ద్యావర్ధిష్ణుని బాచయప్రభుని యెల్లామాత్యచూడామణిన్. 1

చ. జలనిధికన్య ప్రేమ్మెఱుఁగు సంతతకౌస్తుభవైజయంతికా
విలసితకాంతి వాసవునివిల్లు కృపారసధార వృష్టి గా
నెలమి వహించుచుం బొదలుకృష్ణపయోదము ప్రోదిసేయు స
త్ఫలితవిభూతులం బెసఁగ బాచయయెల్లనికీర్తిసస్యమున్. 2

శా. నీరేజప్రభవుండు వాక్పతి జగన్నిర్మాణదక్షుండు జం
భారాతిప్రముఖామరార్చితుఁడు వేదార్థప్రబోధక్రియా
పారీణుండు విరించి దానజితదేవక్ష్మారుహుం డైనయా
యూరెల్లక్షితిపాలమంత్రి జిరాయుష్మంతునిం జేయుతన్.

ఉ. అల్లదె మాతులుంగఫల మంచు నవోదయభానుమండలం
బల్లనఁ జూపుచుం బృథులహస్తముపం గబళింపఁ గోరువా
గ్వల్లభముఖ్యదేవగణవంద్యపదాబ్జుఁడు కుంజరాననుం
డెల్లనమంత్రిశేఖరున కీప్సితసిద్ధికరుండు గావుతన్. 4

మ. కగపద్మంబులఁ బుస్తకంబు శుకముం గంజాతము న్వీణయుం
గర మొప్పం బ్రమదంబుతో నుపనిషద్గుంటాపథశ్రేణి హం
సరథం బెక్కి చరించుచంద్రముఖి భాషాదేవి సర్వజ్ఞుఁ జే
యు రతీశప్రతిమానరూపనిధి నీడూరెల్లనామాత్యునిన్. 5

ఉ. నల్లనివేల్పుఁజోటి రహినాథుని కూరిమితల్లి యామినీ
వల్లభుతోఁ బుట్టువు శివాచతురాస్యవధూవయస్య యు

త్ఫుల్లసరోజహర్మ్యములఁ బోల్పెసఁగ న్విహరించులక్ష్మి మా
యెల్లనమంత్రిశేఖరునియింట వసించు మనోహరాకృతిన్.

ఉ. చేటిక లేవధూటికి శచీముఖసర్వసుపర్వభామినీ
కోటులు సద్మ మేఁకుటిలకుంతల కీశ్వరుమేను పుష్ప మే
పాటలగంధికిం జికురభారము పైనుదురాట్కిశోర మా
జోటి భవాని చాలఁ గృపఁజూచును బోచయయెల్లధీమణిన్. 7

తే. అర్క హిమధామ భౌమ సౌమ్య గురు శుక్ర తోయజాప్తజరాహుకేతుగ్రహంబు
లెలమి నేకాదశస్థానఫలము లిత్తు రెపుడు నీదూరియెల్లమంత్రీశ్వరునకు. 8

వ. అని యిష్టదేవతాప్రార్థనాపూర్వకంబుగాఁ గృతీశ్వరున కాశీర్వచనంబులొసంగి. 9

దే. సరవి దీపింప వామ్నాయసరణిఁ దఱిసి, పాలునీరును బోలె నేర్పఱిచినట్టి
యనఘతరమూర్తి గీర్వాణ వనచరిష్ణు, బాదరాయణహంసంబుఁ బ్రస్తుతింతు. 10

శా. తారానాథమరీచికాచయ యకృతోద్యన్నూత్నరంగత్పయః
పారావారవినిర్మలోర్మిపటలీపర్యాయవాఙ్నిర్మిత
శ్రీరామాయణకావ్యసృష్టికవితాసిద్ధాంతశుద్ధాంత వి
ద్యారాశి న్ఘను వామలూరుభవుఁ జేతఃప్రీతి వర్ణించెదన్.

క. ధీరుల బాణమయూరుల, భారవులై వెలయుమాఘభారవుల సుధా
ధారాపాణింధమకవి, తారచనావానుఁ గాళిదాసుఁ దలంతున్, 12

[illegible]పిత్రియనిర్మిత, సమధికరసత్ప్రబంధసాహిత్యకళా
సుమనస్తటినీకల్లో, లములం గ్రీడింతు నిష్కళంకప్రతిభన్. 13

ఉ. పైకొనుకాంతుచేఁ దగిలి పల్మరు భీకరలోభిగేహవ
ల్మీకములందుఁ బాయనియమేయమదోద్ధతదుష్కవీంద్రద
ర్వీకరరాజికి న్వివిధవిశ్రుతకావ్యకళావిశేషవి
జ్ఞాకుశలార్యతంత్రములు గారుడమంత్రము కుదు నారయన్, 14

చ. వడియును బ్రాసము న్వెదకువాఁడు ప్రబంధము పూని యేమి చె
ప్పెడి నగుఁబాటగు న్సుకవిబృందముముందట మాటలాడు వెం
బడి నవి తమ్ముఁ దామె సులభస్థితిలో నుచితస్థలంబులన్
బడిబడి వచ్చి నిల్చి బహుభంగులఁ దోవలఁ జూపకుండినన్. 15

వ. అని సకలసుకవిజననమస్కారంబును గుకవితిరస్కారంబును గావించి యేనొక్క
నవీనప్రబంధం బనుసంధింపం బూనుసమయంబున.

సీ. తనయశోమహిమ గంధర్వభామాహస్త, వల్లకీసంగీతవర్ణనంబు
తనవదాన్యత యర్థిజనమనోరథదాన, పాకీణగీర్వాణపాదపంబు

తనవిలాసంబు దంతావళగామినీ, దృక్చకోరకనిశాధిపసమకేళి
తనభుజావిక్రమం బనతారిదుర్గమంత్రి, దంతశూకాచ్యుతస్యందనంబు
గీ. గాఁగ వెలసినచంద్రశేఖరపదార, విందసేవాకళాలబ్ధవిభవశాలి
మాన్యుఁ డీదూరయెల్లయామాత్యమౌళి, యుల్లమానందమును బొంద నొక్కనాఁడు.
సీ. అలయుగంధరుసాటి యగునీతికార్యకర్త్రి, యౌగంధరు లైనయాప్తసచివు
లుపరాశరసూతిఁ దలఁపించు వేదశా, స్త్రార్థవిద్యాధురీణార్యవితతు
లలబాణు నొరయుకావ్యక్రియావైఖరీ, సారస్యనిధు లైనసత్కవీంద్రు
లలపు రవిసూతిఁ గెలువంగ నూహించు, విక్రమక్రమధుర్యవీరభటులు
గీ. అప్సరస్స్త్రీలఁ బోలెడుబ్జముఖులు, కలితసంగీతధౌరేయగాయకులును
మహిమఁ గొలువంగ నిజసభామందిరాంత, రమునఁ బేరోలగం బుండి ప్రమదలీల.
మ. ననుఁ గౌండిన్యమునీంద్రగోత్రజు సుధాంధస్సింధుకల్లోలతు
ల్యాశాఘాటవచోధురంధరుని దేచామాత్యసత్పుత్రుఁ బా
వనచంద్రు శశాంకధారిపదసేవాలబ్ధసాహిత్యస
ద్ధుని సద్బంధువిధేయు శంకరకవి దాక్షిణ్యపుణ్యాధిపున్. 19
తే. మమత రావించి యర్ఘ్యాసనమున నునిచి, తత్ప్రశస్తచీనాంబరగంధాక్షతంబు లాది
గాఁగఁ గర్పూరతాంబూలకనకభూష, ణాంబరంబులు దనియ నందంద యొసఁగి.
తే. సప్తసంతానములలో యశస్కరంబు, కృతియె కావున నీవొనరించునట్టి
నిరుపమానహరిశ్చంద్రనృపచరిత్ర, మంకితము సేయు నాపేర ననఘచరిత.
వ. అనుటయు నట్ల కాక యని యంగీకరించి, సరససంగీతసాహిత్యవిద్యావినోదగోష్ఠీవిహారుండును, వసుంధరాభారధరణదక్షదక్షిణభుజాచక్షుశ్శ్రవోధ్యక్షుండును, నవ్యాన్యతరచతురశౌర్యహర్యక్షుండును, మత్తమరాళగామినీవిశాలనయనచకోరనయనసంపూర్ణపూర్ణిమాచంద్రుండును, భోగదేవేంద్రుండును, గపటరిపుదుర్మంత్రిజనాఖర్వగర్వపర్వతకులిశాయమానకౌక్షేయకుండును, వనీపకమనోరథార్థదాయకుండును, శంభుసేవావిశేషలబ్ధవిజృంభమాణశాశ్వతైశ్వర్యుండును, శాండిల్యమునిచక్రవర్తిగోత్రప్రవర్ధనక్రియాధుర్యుండును నగునీమానెల్లయామాత్యువంశావతారంబభివర్ణించెద
శా. కల్యాణాత్మకమూర్తి జృంభితతపోగాంభీర్యధుర్యాత్ము సా
కల్యామ్నాయరహస్యవేది బుధలోకస్తుత్యు నంభోజభూ
తుల్యప్రాభవశాలిఁ బంకరుహబంధుస్వచ్ఛతేజస్వి శాం
డిల్యు న్సంయమిచక్రవర్తిఁ దగ వర్ణింపంగ నశ్రాంతమున్.
తే. ఆమునీశ్వరువంశదుగ్ధాంబునిధికిఁ, బూర్ణనీహారకిరణుఁడై వర్ణనీయ
మహిమ విలసిల్లె లింగనామాత్యవర్యుఁ, డనఘమతి బల్లికురువపురాంకుఁ డగుచు. 24

క. ధర లింగమంత్రితనయులు; పసనులు పెద్దిగడనయు గౌరవసచివుఁడును గుణా
భరణుం డమరయ్యయు ను, స్థిరకీర్తుల వెలసి రర్థిచింతామణులై.

చ. పెద్దిగడనమంత్రి బంధుజనబృందము పేర్కొన నుండి కాసనుం
డగుమతిశాలి వీరసచివాగ్రణిపుత్రికఁ దిప్పమాంబికం
దగుమహిమ న్వివాహ మయి ధన్యచరిత్రులఁ గాంచెఁ బుత్త్రులన్
జగదభివర్ణనీయుల విశాలయశోవిభవాభిరాములన్. 26

సీ. స్వర్ణదీలహరికాసుధోహవిమలయశస్కుఁ డ శ్రీశాలిభాస్కరయ్య
థాగాధరామోష్మాదరుహాబ్జారాతి, వితరణగుణహారివీరశౌరి
చేతోభవారాతిసేవాధురీణుండు, భూతలాధిపమంత్రి పోతవిభుఁడు
సంగీతసాహిత్యచతురవిద్యాకళా, లీలాప్రగల్భుండు లింగరాజు
గీ. పెద్దలౌ ననఁ దనరిన పెద్దవిభుఁడు, మహిమ వెలసిరి రాజన్యమాన్యు లగుచుఁ
గల్పతరుపంచకముఁ రీతిఁ గవిజనార్థి, యూథముల కిష్టఫలముల నొసఁగఁజాలి. 27

వ. వారిలోన.

సీ. యాచకదారిద్ర్యహరణకారణగుణ, శ్రేణి దెవ్వానికి శాశ్వతంబు
శాతోదరీజనచేతోముదాపాద, పత్రితిస్ఫూర్తి యెవ్వానిమూర్తి
కపటశాత్రవమంత్రిగర్వపాథోరాసి, బాడబ మెవ్వానిబాహుబలము
దిగ్దంతికాంతిప్రహాసిప్రభా, విలసనం బెవ్వానివిమలయశము
గీ. దండశూకాధినాథమందాక్షదాయి, సూక్తి యెవ్వానిచాటువాక్ప్రౌఢశయ్య
యతఁడు పెంపొందు లోకవిఖ్యాతి బల్లి, కురువపెద్దన యనుమంత్రికుంజరుండు. 29

ఉ. అద్దివిజాధినాయకునియంతటివాఁ డురువైభవంబునన్
గద్దరివైరులం దృణము గాఁగఁ గనుంగొను శౌర్యరేఖ నే
ప్రొద్దును బాంధవార్థిజనపోషణమేమఱఁ డెట్టిధన్యుఁడో
పెద్దన తద్దయుం బ్రబలె విద్వదనీకకనీకసంస్తుతిన్. 30

తే. ప్రాజ్ఞుఁడై కీర్తిగనినట్టిపట్టమెట్ట, పోతనార్యునిపుత్రి సంభోజనేత్రి
బరిణయం బయ్యెఁ జిక్కమాంబావధూటి, నింపుపొంపొంద పెద్దమంత్రీశ్వరుండు.

చ. వినుతచరిత్రి చిక్కమకుఁ బెద్దనమంత్రికిఁ బ్రాభవాధికుల్
తనయులు సంభవించిరి ముదంబున బాచయదండనాథుఁడున్
మనసిజవాసవాత్మజసమానవిలాసుఁడు పెద్దకయ్యయున్
వినుతవివేకభూషణుఁడు వీరనయుం జరితార్థులెంతయున్. 32

వ. అం దగ్రజుండు. 33

సీ. కాంతాజనస్వాంతసంతోషకరరూప, హసితలతాంతబాణాసనుండు

సుకవిసందోహసంస్తూయమానాశాంత, విశ్రాణనక్రియావిబుధశాఖి
నిఖిలవిద్యాకళానిరవద్యవైఖరీ, లీలావివేకనాళీకసూతి
భర్గకోటీరత్రిమార్గగానర్గళో, ర్మిచ్ఛటాసన్నిభ స్వచ్ఛకీర్తి
గీ. బంధుజాతపయోజాతభాస్కరుండు, భూరిగాంభీర్యవినయవిభూషణుండు
పరిబలె వాణీశవంశవారాశితుహిన, ధాముఁ డీమూరిబాచప్రధానమౌళి. 34
ఉ. యాచకలోకరక్షణసముంచితభూరిదయాగుణక్రియా
ఖేచరు వంశపావను మృగీనయనాజనపంచబాణు వి
ద్యాచతురాస్యు నీశ్వరపదాంబురుహద్వయచంచరీకముం
బాచయమంత్రిపుంగవుని బ్రస్తుతిఁ జేయుదు రార్యులెప్పుడున్. 35
క. ప్రగడనమంత్రియశోరుచి, నగుఁ దుహినాచలముఁ బక్షినాయకకులమున్
నఖిద్దంతావళమును, గగనధునీజలముఁ జంద్రకాంతోపలమున్. 36
చ. మకరపతాకు నాకృతి హిమద్యుతి నిర్మలగాంతి విష్ణునా
యకుని విభూతిఁ బాంధవతయాగ్రణి ధర్మగుణప్రశస్తి హా
టకగిరి ధైర్యవృత్తిఁ గపటప్రతిసత్కృతమోహితేంద్రుఁ బ
ల్లిసురువపెద్దమంత్రిను లీల నుతించెద వీరనార్యులన్. 37
వ. వీరిలోన.
చ. అనఘుఁడు మల్లెపూడికొమరాధ్యుసోమిపుత్త్రి పద్రవం
దన కెనయైనపద్మనయనం బెదలింగము బెండెకట్లశా
సనుఁ డగుపర్వతయ్యసుతఁ జంద్రముఖిం బినలింగమాంబ నిం
పెనయ వివాహ మయ్యె విభవేంద్రుఁడు బాచయమంత్రి యున్నతిన్. 39
సీ. అవనీసురశ్రేణి కమృతాన్న మొసగెడి, మెలఁతల కీయింతి మేలుబంతి
ధవునియానతి యొక్కరుసవము లంఘింపని, సకియల కీభామ జన్మసీమ
పరమపాతివ్రత్యగరిమంబు వొందెడు, తాటంకవతుల కీబోటి మేటి
ధన్యులఁ బుత్త్రరత్నములఁ గాంచినవధూ, తతుల కీకాంతామతల్లి తల్లి
గీ. పుణ్యములప్రోవు గాంభీర్యమునకు నెలవు, మహితసౌభాగ్యగుణములమందిరంబు
వినుతలావణ్యలక్ష్మికి నునికి యనగ, లీల విలసిల్లె బాచయలింగమాంబ. 40
చ. పతి తనపాలిదైవ మని భావనసేయుపురంధ్రి బంధుసం
తతులను సంతతంబును సుధాంధుధురాన్నము లన్నపూర్ణయా
కృతి బరితృప్తిగా నొసగు నిం పెసగం బినలింగమాంబ కీ
క్షితి బ్రతి సేయ లేరు సరసీరుహలోచన లెన్నిచూచినన్. 41
సీ. అనఘవర్తనుఁడు బాచయమంత్రివర్యుఁడు, హంసాక్షి పెదలింగమాంబవలన

నిద్ధతేజోనిధి నెల్లయామాత్యుని, హేమాద్రిసమధీరు సోమఘనుని
బినలింగమాంబికావనరుహాననయందు, రసికశేఖరు బెదరామవిభుని
బినరామధీమణి బ్రియవచోవైఖరి, బ్రతిభాసమగ్రుని బర్వతయ్య
గీ. గనియె వారలు వంశమాకందవాటి, కాశసంతులు హరిదంతకరటిదంత
గాంతినివహానుకారినితాంతకీర్తి, రుచివిభూషణు లర్థార్థిఖచరపతులు. 42
ఉ. రామభుజాబలాఢ్యుని బురందరవైభవధుర్యు బాంధవా
రామవసంతమూర్తి నమరద్రుమపుష్పగళన్మరందధా
రామధురోక్తివైభవధురంధరు నెన్నద వీరమంత్రి శ్రీ
రామనదండనాయకుని రాజసభాభవనాంతరంబునన్. 43
య. ఈదూరీకృతసాధురీతికలనాహృద్యానవద్యంబు లీ
యీడూ రెల్లనమంత్రిశేఖరవచోహేవాకము ల్తాండవ
క్రీడాకౌతుకజృంభమాణఫణిరాట్కేయూరకోటీరగం
గాడోలాయితనిర్మలోర్మిపటలీగాఢధ్వనిప్రౌఢికిన్. 44
సీ. గాంగేయవిస్ఫూర్తి గాంగేయవిస్ఫూర్తి, నమరె దేహప్రభావిమలమతుల
బంచాననాకృతి బంచాననాకృతి, బొలుపొందె శౌర్యవిభూతులందు
నాగేంద్రవైఖరి నాగేంద్రవైఖరి, విలసిల్లె బలవచోవిభవములను
హరిజృంభణంబున హరిజృంభణంబున, బొదలె లక్ష్మీయోగభోగమహిమ
గీ. నతడు కరహాట లాట కర్ణాట యవన, కుంతలావంతి నృపసభాభ్యంతరాళ
సుకవిగాయకలోకసంస్తుత్యకీర్తి, నిత్యుడీడూరిసోమనామాత్యమౌళి. 45
మ. పెదరామయ్యను బాచమంత్రినుతు గాంభీర్యాంబుధిం గామినీ
మదనుం బేర్కొన వచ్చు రాజసభల న్మందాకినీచంద్రన
త్రిదశక్ష్మారుహతారహారనిభకీర్తిస్ఫూర్తిసంపూర్ణస
ర్వదిశాభాగుని మేరుశైలధృతి గీర్వాణాధిపప్రాభవున్. 46
క. వనరాశిఘనగభీరుని, బినరామనమంత్రివర్యు బేర్కొనగ దగుం
దనరారు వేడ్క యాచక, జనరాధాతనయు బాచసచివాత్మజునిన్. 47
క. పర్వతమంత్రిని హిమవ, త్పర్వతఘనధైర్యధుర్యు భామాజనదృ
క్పర్వతనూసౌందర్యు ను, పర్వతరుత్యాగశీలు బ్రణుతి యొనర్తున్. 48
జుండు లోకా, నందకరుం డొప్ప నింద్రనందనధరా
దనలక్ష్మీనందన, సౌందర్యస్ఫూర్తి యెల్లసచివుడు ధాత్రిన్. 49
సీ. ఔర్యానుకూలకృత్యంబు శంభునియందు, దనయందు గలుగంగ దనరినాడు
భూరిసుదర్శనాస్ఫూర్తి కృష్ణునియందు, దనయందు గలుగంగ దనరినాడు

చతురాననప్రౌఢి జలజాసమునియందుఁ, దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
ప్రబలభోగోన్నతి ఫణివల్లభునియందుఁ, దనయందుఁ గలుగంగఁ దనరినాఁడు
గీ. మతి వితర్కింపఁ గేవలమంత్రిమాత్రుఁ, డే ధనంజయబాహుశౌర్యాధికుండు
సత్యవర్తనుఁ డీదూరిశాసనుండు, హితవచోహారి బాచయయెల్లశౌరి. 50
వ. అమ్మంత్రినిధానంబునకు నిజస్థానంబు, 51
మ. అరవిందాసనవాసవాద్యమరలోకారాధ్యకర్ణాటకే
శ్వరకారుణ్యపదాభిరక్షితము భాస్వద్దీప్తిమద్భానుగో
త్రకనిత్యశ్రితపాదనిస్వనముదాత్తశ్రీ నజస్రంబు ని
ద్ధరణిం జేర్కొన నొప్పుఁ గార్కొలను గోదావర్యుపాంతంబునన్. 52
సీ. ప్రాలేయశైలేంద్రప్రహృశృంగసంతతి స్ఫటికోపలప్రభాపటలములకుఁ
చంద్రోదయారంభసంతోషితామృతాం, భోనిధానతరంగఫేనములకు
వాసంతసమయగీర్వాణసర్వంసహా, జాతశాఖాసుమవ్రాతములకు
వారిజాసనవక్షోజపాటీర, జంబాలచర్చాయుచర్చికలకు
గీ. విందు లీడూరియెల్లపృథ్వీశమంత్రి, దండనాథయశఃకాంతిమండలములు
దిక్సరోజాతలోచనాదీర్ఘకర్ణ, కోణముక్తాఫలభ్రాజికుండలములు
శా. వేదార్థప్రతిపాదనప్రకటవిద్యావ్యాధురీణుఁడు సా
క్షాత్కేదుకళావతంసుఁడు సమగ్రప్రాభవాఢ్యుండు నై
కేదారేశగురుండు సత్కృపఁ గటాక్షింపంగ వర్ధిల్లు ని
త్యోదారప్రతిభాగుణాభరణుఁ డీదూకెల్లనార్యుం డిలన్. 64.
శా. చూడం దవ్యసుధాంశుబింబవదనాస్తోమంబు దా నెట్టిచో
నాడం జాలఁ దసత్యవాక్యములు గర్వాయత్తుల న్మత్తులం
గూడం డెన్నఁడుఁ బూర్ణచంద్ర సుమనఃకోదండరూపాధికుం
డీదూరెల్లనమంత్రి బోల గలరే యెవ్వారు నిద్ధారుణిన్. 55
చ. సరసజనాగ్రగణ్యుఁడుఁ సత్యవచోరచనాధురీణతా
భరణుఁడు నైనయట్టిఘను బాచయయెల్లనికీర్తికామినీ
కరతలమల్లికాప్రసవకందుక మంబురుహాభిమాతి త
త్పరిమళలోలషట్చరణపంక్తియె లాంఛన మెన్ని చూచినన్. 56
గీ. సగససారసదినరాజు సత్త్రరాజు, లింగనామాత్యపుత్త్రి నాళీకనేత్ర
రూపగుణశీల నుతిభవానిపురంధ్రి, నెలమి వరియించె నీదూరియెల్లమంత్రి. 57
సీ. పరమపాతివ్రత్యగరిమ నరుంధతీ, సంపూర్ణపూర్ణిమాచంద్రవదన
సదమలసత్యభాషావిశేషంబుల, రాజీవగర్భమరాళయాన

యపరిమితం బైనయట్టి తాలిమికల్మి, ధాత్రీసరోజాతపత్రనేత్ర
శాశ్వతైశ్వర్యవిస్తారవిస్ఫూర్తుల, నమృతపాథోరాశియాదుబిడ్డ
గీ. బాంధవాశ్రిత భూసురప్రకరసంత, తాన్నవిశ్రాణనంబున నన్నపూర్ణ
యనగ నీమూరియెల్లనార్యునిపురంధ్రి, వినుతిగాంచె భవాని పావనచరిత్ర. 58

ఉ. భావజరూపవిభ్రమవిభాసితు డెల్లనమంత్రికి న్భవా
నీవరవర్ణనీమణికి నిర్మలకీర్తులు గల్గి రాత్మజుల్
కోవిదవర్ణనీయు లతికోమలమూర్తులు బంధులోకసం
భావనదక్షు లెంతయును బోతనయుం గలకంఠమంత్రియున్. 59

## షష్ఠ్యంతములు.

క. ఈదృగ్విధమహిమాయతి, కాదిత్యాపత్య ఖేచరాదిత్యగనీ
సాదృశ్యవితరణ శ్రీ, మోదితవిబుధేంద్రతతికి ముఖ్యస్థితికిన్. 60

క. ఆరాధితశంభునకును, సారబలాన్వితభుజాస్తంభునకున్
దూరీకృతదంభునకు ద, యారచనాబంధురత్వగాంభునకున్, 61

క. సతతాన్నదానసంర, క్షితనానాధరణిలోకగీర్వాణునకున్
జతురవచోరచనాతి, ప్రీతభాసుకవిత్వతత్త్వపారీణునకున్. 62

క. గురుచరణయుగళసేవా, గురుతాత్పర్యునకు మంత్రికులవర్యునకున్
గురుతరమతికి న్సాకీ, గుణసన్నిభధృతికి వినుతకోవిదతతికిన్. 63

క. మానిజనవంద్యగౌరీ, జానిపదాంభోజయుగళసదమలసతత
ధ్యానవిలీనస్వచ్ఛమ, నోనాళీకునకు సతతమతలోకునకున్, 64

క. పాటీరహీరహిమకర, కోటీరతుషారహారగోక్షీరమరు
ద్ఘోటకహాటకగర్భవ, ధూటీసమవిమలకీర్తిధుర్యోన్నతికిన్. 65

క, నిరుపమనృపకార్యధురం, ధరునకు శాండిల్యగోత్రునకు బాచమహీ
వరమంత్రితనూభవునకు, హరిహయవిభవునకు నెల్లనామాత్యునకున్. 66

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం గడంగిన హరిశ్చంద్రచరిత్రం బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన,





శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము

## ప్రథమాశ్వాసము.

### కథాప్రారంభము.

శ్రీ తరుణీమనోహరవిరించిసమానమహాతపోధన
వ్రాతనివాసయోగ్య మమరద్రుమతుల్యసమస్తపుణ్యభూ
జాతలతానికేతనవసత్పికముఖ్యశకుంత మెంతయున్
ద్వైతవనంబు పొల్చు వసుధారమణీహరినీలభూషయై. 1

చ. మననవిరోధిఁ దాపససమాజము పూజ యొనర్చు దాఁక ష
ట్పదములు పుష్పగుచ్ఛములపై భ్రమరింపవు చంద్రశేఖరుక్
ముదమున మజ్జనంబు మునిముఖ్యులు సేయక మున్న హంసము
ల్పదియఁగఁ బోవు తామరకొలంకుల కవ్విపినాంతరంబులన్. 2

సీ. వికసితకుముదారవిందసౌగంధిక, విస్ఫురద్వ్యాసనావిలసితంబు
చంచరీకకులాళిచక్రవాకక్రౌంచ, బకసంచకూరావభాసురంబు
తీరద్రుమసుమగుచ్ఛవారనిర్యన్మక, రందసమేతాంబురాజితంబు
మత్స్యకచ్ఛపమహామకరాదిజలజంతు, సంతానసంచారసలలితంబు

గీ. సతతకేళీవనాసక్తసంయమీంద్ర, బాలికాకుచకాశ్మీరపంకసురభి
రంగదుల్లోలకల్లోలసంగతంబు, రుచిరమై పొల్చు నొక్కసరోవరంబు. 3

తే. ఆసరోవరతటమున నమరవిటపి, కిగణి నుడివోనిపల్లవోత్కరలతాంత
చయశలాటుఫలాళులఁ జాలి విల్లు, వీఁగు నొక్కరసాలపృథ్వీరుహంబు. 4

శా. ఆమాకందముక్రింద ధర్మజుఁ డరణ్యావాసశీలుఁడై
భీమాదుల్నిజసోదరుల్నలువురుం బ్రేమంబుతోఁ గొల్వఁగా
భామారత్నము చేరి ద్రౌపది మహాభక్తి న్భజింపంగ నా
నామౌనీంద్రకథాప్రసంగముల నానందంబుతో నుండఁగన్. 5

వ. అసమయంబున.

శా. గండూషీకృత వేదశాస్త్రనిఖిలగ్రంథార్థసారుండు మా
ర్తాండానూనతనుప్రభాంచితుండు సుత్రామాదినిర్వాణసే
వ్యుం డంహఃకరసింహపోతము ఋషివ్యూహాగ్రగణ్యుండు మా
ర్కండేయుండు ద్వితీయబాలశశిరేఖాశేఖరుం డిమ్ములన్. 1
సీ. భసితత్రిపుండ్రాంకఫాలభాగముతోడ, రుద్రాక్షమాలికారుచులతోడ
బల్లవారుణజటాపటలభారముతోడ, నవ్యపలాశదండంబుతోడ
నుత్తమవ్యాఘ్రాజినోత్తరీయముతోడ, రమణీయదర్భాంకురంబుతోడ
నతనిర్మలస్ఫటికాక్షసూత్రముతోడ, ధవళయజ్ఞోపవీతములతోడ,
గీ. బుణ్యకల్లోలవత్యంబుపూర్ణఘనక, మండలువుతోడ వినయసంపదలు పొడమఁ
గదిసి భజియించువరశిష్యగణముతోడ, గంమ నేతెంచెఁ బాండవాగ్రజునికడకు
సీ. అరుగుదెంచుటఁ గనుఁ దా నల్లంత దవ్వులఁ, బొడగాంచి యెదురుగాఁ బోయి భక్తి
ననుజసమేతుఁడై యందంద పెక్కువందనము లొనర్చి తోడ్కొనుచు వచ్చి
పావనసలిలార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి కుశాసనాసీనుఁ జేసి
హస్తాబ్జములు మోడ్చి యంతరంగంబునఁ, బ్రేమ ముప్పిరిగొన నేమ మడిగి
గీ. సమయసముచిత మృదువాక్యసరణి వెలయఁ, గోరి సుఖగోష్ఠి నడపుచుఁ గొంతప్రొద్దు
జరపి కుంతీసుతాగ్రణి సంయమీంద్రు, బలికె నిట్లని వినయసంపదలు పొదల. 9
శా. అర్కభ్రాజితతేజ కల్మషసమూహాంభోజహేమంతదు
స్తర్కాతీతమతిప్రభావ సుమనస్సందోహకోటీరసం
పర్కానేకమణిప్రభాళివిలసత్పాదాంబుజద్వంద్వ యో
మార్కండేయమునీంద్ర శక్యమె భవన్మాహాత్మ్యముల్ పేర్కొనన్. 1
క. విమలతపఃపరిపోషిత, కమలాసనకమలనాభకమలారికిరీ
ట మహానుభావ నిను బోలు మహాత్ములు ముజ్జగంబులను లేరరయన్. 10
మత్తకోకిల. ఆలపోతును జింకయున్ గరళాంకమున్ గజచర్మమున్
శూలముం జడలేఱుఁ దామరమాలి భూరికపాలమున్
ఫాలనేత్రము బాలచంద్రుఁడు బాపపేరును దాపుచున్
హేలమై జరియించుదేవుడ వీవు కేవలమౌనివే. 12
క. ఇత్తాపసపుంగవులకు, ముత్తాతవు నీవు గావె ముజ్జగముల మీ
చిత్తముల కెఱుకపడినన్, పోత్తమవృత్తములు గలవె యూహింపంగన్. 13
ఉ. కావున ద్రొల్లి మీ రరసి కాంచినయట్టినృపాలకోటిలో
నీవసుధాస్థలిం దొలుత నేమటి గాజ్యము కోలుపోయి మో
దావహలీల గ్రమ్మఱ బ్రజాక్షినుతి న్నగ నేలినట్టిధా 7

తీర్చి వరునాన తీవలయుఁ దేటపడం గృపతో మునీశ్వరా. 14

క. అని యివ్విధమున నడిగిన, విని మార్కండేయమౌనివృషభుఁడు కుంతీ
తనయాగ్రజునకు నిట్లను, ఘనకరుణాపాంగదృగ్వికాసము లదరన్. 15

క. మనుజేశ నీవు నను వేఁ, డినమాటకుఁ దేటపడఁగ డెందంబు ముదం
బును బొందఁ బదపడఁగ మగు, విను మొకపృథ్వీశుకథ వివేకస్ఫురణన్. 16

సీ. ఆకాశవాహినీనీకాశపర్యంత, భూసురమూర్వదీభానుగంబు
పవనభుగ్భామినీపాథోవిహారయో, గ్యానేకపరిభూషితార్ణవంబు
సౌధశృంగన్యస్తజలజరాగప్రభా, పాటలీకృతదిఙ్ముఖస్థలంబు
నికటకేళారామవికచనానావిధ, ప్రసవసౌగంధ్యవిభ్రాజితంబు

గీ. నగము కొనియాడఁదగు నహంకారవైరి, ధారుణీధరజలదసమీరణంబు
ప్రబలవిభవాకరము వీరభటనికాయ, కేసరిక్షోణిధరము సాకేతపురము. 17

తే. ముక్తిప్రదములైన పురములు మూఁడునాల్గు, వానిలోన గరిష్ఠమై వసుధమీఁదఁ
బరఁగు నగరునిమురికను పాలించు పురము, నఖిలసిద్ధజనారాధ్య మగునయోధ్య. 18

క. ఆపంకజసంభవునకు, నాపవనభుగీశ్వరునకు నాగుహునకు నా
భూపాల పొగడఁ దరమే, యాపట్టణమహిమ షోడశాంశం బైనన్. 19

శా. ఆకాశస్పృగనేకభూమిశిఖరవ్యాసక్తవైమానికా
నీకం బప్పురివప్రమొప్పెనఁగు వర్ణింపంగ నిర్మాణధీ
లాకేళీ తి: జకరివాళగిరిఁ బోల స్నేప్స సంధిల్ల భా
షాకాశుండు సృజించి నిల్పినమహాశైలంబుచందంబునన్. 20

శా. సాన్ద్రస్థూలమనోజ్ఞశృంగఘటితస్వర్ణాధనీలప్రభా
జాలంబు ల్పలయంబు నంబరమునన్ సాంద్రింబుగాఁ బర్వఁగం
గాళిందీనది పోలెఁ గన్పడెడి వేడ్క న్వచ్చినో కాక యం
చాలోకించుచు నంశయించురు సుధాహాశేందుబింబాననల్, 21

తే. నల్లకలువలు దొగలు కెందామరలును, నీలమణిశుక్తివిద్రుమశిలఁ దనర
శీకరంబులు మౌక్తికశ్రీ వహింపఁ, జగఁగు రత్నాకరముఁ బోలెఁ ఋసను పరిఘ

ఉ. శ్రీ విలసిల్లుస్ఫార విచిత్రపుహర్మ్యతలంబులందుఁ బుం
భావితపరిసంగములఁ బల్మఱుఁ జొక్క శ్రమంబుఁ జెందురా
జీవదళాయతేక్షణల చెక్కులఘుర్మపయఃకణావళు
ల్పోవఁగఁ జేయు నభ్రనదిలోపల మెల్లని చల్లఁదెమ్మెరల్. 23

క. సురశిఖరిశిఖరసమను, స్ఫురదున్నతశృంగఘటితశుభ్రమణిసుర
ధరుసపఃపూరితాఖిల, హరిదంతిరములు పురంబు హరిహరగృహముల్. 24

తే. గగనగంగాతరంగిణీకనకకమల, హరణగమనార్థజనకల్పితాతిహృద్య
విమలశశికాంతసోపానవితతు లనఁగఁ, బొలుచుఁ గలధౌతగోపురములు పురమున.

తే. దానవారిప్రశస్తి నెంతయును వెలసి, భూరిపద్మాభిరమ్యవిస్ఫురణ గలిగి
ధేనుకాహితమతి వసుదేవసుతుని, బోలునప్పురి భద్రకుండాలతతులు. 26

క. నాకస్వామితురంగము, శోకనదప్రియునిరథముగట్టంబులు నే
మోకాని యితరతురగము, లాకటకములోనఁ గలుగుహరులకు నెనయే. 27

తే. తత్పురస్యందనములయందములు హృదయ, వీథి నిడుకొని మఱి సుమీ విశ్వకర్మ
కమలవనబాంధవునిశతాంగముఁ గూర్చె, పుష్పకంబును సృజియించెఁబోలుపురిలోన

క, గుణులు శుభ్రశాస్త్రపారా, యణులు తనూదీప్తినైధవాధిపతంభో
మణులు వచశ్శేషమహా, ఫణు లప్పురములోని బ్రాహ్మణులు చెల్లన్. 29

క. చాపాద్యాయుధవిద్యా, నైపుణగాంగేయు లర్థి నవరాధేయు
ల్బాపట్టుదు రాపురమున, భూపకుమారులు భుజావిభూతిసమారులై. 30

క. భిక్షాటనుఁ డగుశివుతోఁ, బక్షంబై మైత్రి నెపుడు పాయం డని యా
యక్షేశ్వరుఁ బ్రహసింపుదు, రక్షీణైశ్వర్యధుర్య లప్పురివైశ్యుల్. 31

ఉ. భద్రవితీర్ణసంపదలఁ బ్రస్తుతిఁ గాంచినయట్టినూత్నక
ల్పద్రులు బాహుసత్త్వబలభద్రులు సంతతవిప్రభక్తిని
ర్నిద్రులు సద్గభీరగుణనిర్జితదుగ్ధసముద్రు లార్యతా
క్షుద్రులు తత్పురిం గలుగుశూద్రులు దైత్యసురాద్రు లెన్నఁగన్. 32

క. చటులరణరంగవీథీ, నటులు మదారాతివీరనవజయలక్ష్మీ
విటులు భయంకరశౌర్యో, ద్భటులు పురిం గలుగువీరభటులు దలంపన్. 33

ఉ. కీరకిశోరభాషలును గేసరిమధ్యములున్ బ్రవాళపం
కేరుహపత్రనేత్రములుఁ గెంపుల నీనెడుతియ్యమోవులున్
వారణరాజయానములు వన్నెలు గాని విభూషణావళుల్
పౌరవిలాసినీతతికి, బల్మరు వన్నెలు గావు చూడఁగన్. 35

ఉ. క్రొవ్విననిట్టనిబ్బరపుగుబ్బచనుంగవలున్ మృగంబులన్
నవ్వువిశాలలోలనయనంబులుఁ బున్నమచందమామపైఁ
జివ్వకుఁ గాలుద్రవ్వునునుఁజెల్వపుమోములుఁగల్గి మవ్వపుం
బువ్వులయెత్తు లమ్మదురు పొందుగ నప్పురిఁ బుష్పలావికల్.

సీ. దాడిమీఫలముల దద్బీజవితతుల, దట్టించుకుచములు దంతములును
ధారాధరంబులఁ దత్తటిద్వల్లుల, నదలించుకురులును నడుములును
దామరసంబుల దన్మృణాళంబుల, హసియించుమొగములు హస్తములును
నంబుప్రవీచికల దావర్తకంబుల, నగుచక్రియములు నాభికములుఁ

గీ. గలువపువ్వులఁ దత్పరాగములఁ గెల్చు, వాలుగన్నులు దనువులవాసనలును
గలిగి యొప్పును రప్పురాంగణములందు, లలితగతు లైనవారవిలాసవతులు. 36

ఉ. పౌరనితంబినీజనులపయ్యెద లొయ్యనదూఱి పీనవ
క్షోరుహలిప్తసంకుమదకుంకుమచందనపంకవిస్ఫుర
త్సౌరభము ల్మనోజ్ఞగతి సారెకు గ్రోలి పటీరభూమిభృ
న్మారుత మప్పురి న్మెలఁగ మాంద్యము జల్లదనంబు జూపుచున్.

క. ఏతాదృశమహిమంబుల, భూతలమున జనులచేత బొగడొందినసా
కేతమునకు విభునివహాని, కేతనమున కధిపు లమితకీర్తిస్ఫూర్తుల్. 38

ఉ. మాతుగ తేవునుం బగలు మాశ్రు బితామహమన్మథద్విష
ద్దానవవైరిమూర్తుల నుదారగతి న్విహరించు వేల్పు తే
జోనిధి వంశకర్త యయి సూర్యుడు మేలొసగంగ నిత్యల
క్ష్మీనుతవైభవస్ఫురణ జెందిన దానకళాధురంధరుల్. 39

సీ. వాసవప్రభుడు వైవస్వతుండును వికు, క్షియును నిక్ష్వాకునృపకేసరియును
బాణుండు ననరణ్యపార్థివుండును వైన్య, ధుంధుమారులు పరిపంథిజయులు
యువనాశ్వమాంధాతృకువలయేశులు పురు, కుత్సాహ్వయుండు కాకుత్స్థవిభుడు
నంబరీషుడు త్రిశంక్వాఖ్యనీరమణుండు, సారపుణ్యుడు హరిశ్చంద్రవిభుడు

గీ. ప్రణుతి జెందిరి జలజాతబంధువంశ, భూతవనచైత్రు లత్యంతశుభచరిత్రు
లహితజైత్రులు సకలలోకైకమిత్రు, లబ్ధివలయితసర్వసహాధిపతులు. 40

వ. వారిలోన. 41

సీ. నిత్యసత్యవ్రతస్తుత్యచారిత్రు డై, గౌరీమనోనాథుకరుణ వడసె
సమదశాత్రవలోకజయరమాకాంతు డై, రాజసూయమహాధ్వరం బొనర్చె
ధారాధరత్యాగధౌరేయు డై వశి, పసులదారిద్ర్యంబు బాయ జేసె
భుజగనాయకతుల్యసూరిదోర్దండు డై, వసుమతీభరము సర్వము వహించె

గీ. నవనిలో బదునాల్గుమహాయుగములు, పూజ్యసామ్రాజ్యపదవివిభూతి నెగడె
సకలకలబంతరాశిప్రశస్తకీర్తి, చంద్రమూర్తి హరిశ్చంద్రచక్రవర్తి.

ఉ. ఏనుగుల న్హయంబుల మృగేక్షణుల న్మణిభూషణంబులం
గానుక లిచ్చి కొల్తు రతికౌతుకలీల నిరంతరంబు నం
భోనిధివేష్టితక్షితిప్రభుత్వము జెందినరాజు లెల్ల నా
భానుకులాగ్రణిం గని నభస్తటినీనిభకీర్తిపుణ్యునిన్. 43

ఉ. తేలి దలిర్ప నాక్షితిప కేసరిబాహుపరాక్రమంబునం
గోలుమసంగి వైరిగజకుంభవిపాటన మాచరింపగా

వ్రాలినముత్యము లక్కడనరంగమునం గనుపట్టువీరల
క్ష్మీలలనాకరగ్రహణసీమ రచించిన ముగ్గులో యనన్. 44

క. ఆతనిబాహాదండము, వాతాశనరాజసప్తవసుధాధరది
గ్మాతంగకమఠకిటులకు, నాతతవిశ్రాంతి యొసఁగు నశ్రాంతంబున్. 45

సీ. సమధికబాహుపీఠమున సర్వంసహా, యౌవనంబున నమృతాకరుండు
భూరిప్రతాపవిస్ఫురణ హవ్యవహుఁడు, తేజోవిభూతి సంభోజహితుఁడు
నయనారవిందకోణంబుల నిందిర, వర్ణితసూనృతవాణి వాణి
పరిచరవైభవకళాప్రౌఢి జంభారాతి, సౌందర్యరేఖ మత్స్యధ్వజుండు
సతతమును నుండఁగాఁ దనసర్వదేవ, తామయత్వంబు దెలుపు నాధరణివిభుఁడు.

మ. కవిదారిద్ర్యమహాంధకార మడఁగెం గల్గె న్సుహృత్పద్మకై
రవకహ్లారవరప్రతానములకు న్రమ్యత్వ ముత్ఫుల్లతా
పవతీనేత్రచకోరకాళికి హరిశ్చంద్రుఁడు నస్వర్ణకీ
ర్తివికాసోజ్జ్వలకౌముదీపటలకాంతిం జాల దీపించుచున్. 47

తే. శశవిషాణంబు బ్రాహ్మణస్వాపతేయ, హరణబుద్ధి నభఃపుష్ప మనృతవాక్య
సరణి వివరించి చూడ నద్ధరణిపతికి, హాటకగ్రావసమనిరాఘాటధృతికి. 48

క. ఇంద్రనిభుం డైనహరి, శ్చంద్రమహీశమణిగృహిణి సాధ్వీమణి ని
త్యందరమతి చంద్రమతి యను, చంద్రానన చెప్ప నొప్పు శచికిం బ్రతియై. 49

క. ఆదంపతులకు నొక్కఁడు, నూజుఁడు శశిబింబనిభమనోహరతను వి
భ్రాజితుఁడు లోహితాశ్వుఁడు, భూజనసుతిభాజనైకపుణ్యుం డగయన్. 60

చ. గిరిసుతయుం బినాకనియును గేకిపవాహను చేత లక్ష్మియున్
సరసిజనాభుఁడుం గుసుమసాయకు చేత, బులోమజాపురం
దరులు జయంతుచేతఁ బ్రమదంబును జెందినరీతిని ధారుణీ
శ్వరుఁడును సాధ్వియుం గని రవారితసౌఖ్యము లోహితాశ్వునిచేన్. 51

క. పతిహితమతి గలసచివ, ప్రతతులలో మునుపు ధరణిఁ బ్రఖ్యాతింపఁగ ను
న్నతిఁ గన్న మంత్రిరత్నము, కృతపుణ్యుఁడు గలఁడు సత్యకీర్తి యనంగన్. 52

క. దేవేంద్రునకు బృహస్పతి, కైవడిఁ దగుమంత్రి యన్యోగమనీయయశ
శ్శ్రీవెలయ హరిశ్చంద్ర, క్ష్మావరునకు సత్యకీర్తి చాలఁగ హితుఁడై. 53

క. జననియు జనకుండును నై మనుజేంద్రుఁడు సూప్రజాసమాజంబుల
త్యనుకంపను బ్రోచుచు నిఁ, పెనయ మహీచక్ర మెల్ల నేలుచు నుండెన్. 54

వ. తత్కాలంబున.

ఉ. శ్రీకరవైభవాఢ్యుఁడు పురాత్పతిముఖ్యుఁడు సర్వదేవతా
నీకశిరఃకిరీటమణినిర్మలపాదసరోజుఁ డర్జునా
నేకపవాహనుండు పవినిర్దళితాద్రి శచీకళత్రుఁ డా
నాకమునందు వేడ్కఁ నొకనాఁడు మహోమహిమాభిరాముఁడై. 56

సీ. ప్రవిమలచంద్రికాధవళదుకూలాంబ, రము పొందుగాఁ గటి రమణఁ గట్టి
నవరత్నమయభూషణవ్రాతములు గళ, శ్రవణహస్తాదుల సరవిఁ దాల్చి
మంజులవాసనాపుంజరంజితమైన, చందనంబును దేహమం దలంది
తుమ్మెదగమికి విందులు సేయుమందార, కుసుమదామము మౌళిఁ గుదురుకొల్పి

గీ. పృథులచింతామణీభద్రపీఠికాగ్ర, మున హుతాశనసమవర్తిదనుజవరుణ
గంధవాహకుబేరశంకరులు గొలువ, గరిమ విలసిల్లెఁ బేరోలగమున నుండి. 58

వ. నితాంతసంతోషంబుఁ జెంది శతానందనందనుండు కరారవిందాంగుళీనఖశిఖాంకు
రంబులఁ గరంబు సంగీతప్రపంచపారంగతుండై విపంచి వాయించుచుంచుచుం గర్ణ
పుటంబులకు నుదీర్ణసౌఖ్యంబు సంపాదింప నత్యంతసంరంభంబున రంభాదినిలింప
వధూపరంపరలు నానావిధమృదంగడిండిమాదిధ్వానాను కాంతాళకాహళ వేణు
ప్రముఖనిస్వనంబులం గలసి చరణసరోజనూపురారావంబులు చెలంగ ననేకవిధ
నృత్యవిశేషంబులు చూపుచు నయనోత్సవక్రియాకలాపంబు లొనర్ప బృందారక
సందోహంబులు సేవాంజలిపుటంబులు ఫాలభాగంబులం గీలించి కైవారంబులు
సంఘటింపఁ బ్రియంబునం గదిసి సువర్ణాలితంబినీజనంబులు కరపంకజసంకలితకంకణ
ఝణఝణత్కారంబులు తోరంబులై విజృంభింపం బూనిచామరంబులిడఁ దదీయ
కోమలపవమానప్రేంఖితాలకసంబవినీలకుంతలుండై యామఖవంతుండు వసిష్ఠ వామ
దేవ వ్యాస వాల్మీకి పుల స్త్యాగస్త్య జైమిని జాబాలి జమదగ్ని కణ్వ కౌశిక కపిల
కశ్యప కౌండిన్య శాండిల్య గౌతమాదితపోధనవ్రాతంబులతోఁ గూడి వినోద
గోష్ఠిం దగిలియున్నయెడ నమ్మహామునులం జూచి యిం దిట్లనియె. 58

ఆ. మానులార స్వర్గమర్త్యపాతాళలోక, ములయందు మీరు గన్నొనని న్ర
పాలు రెందు లేరు పరికింపఁ గావున, వలయు నడుగ నొక్కపలుకు మిమ్ము. 59

క. త్రిభువనములయందును భూ, తభవిష్యద్వర్తమానధరణీశులలో
నభినుతసూనృతవాచా, విభవసమగ్రుండు గలఁడె వివరింపంగన్. 60

తే. అట్టిరాజన్య సకలలోకైకమాన్యుఁ, దియ్యపలుకుల నాకాన తియ్యవలయు
మీర లొండొరు లత్యంతసారమతుల, నరసి తలపోసి కృతనిశ్చయాత్ము లగుచు.

వ. అని యుత్తలంగునఁ బులోమజాభర్త పలికిన నవ్వాక్యంబు లాకర్ణించియు నాకర్ణిం
పని యట్ల యాశ్చర్యమనస్కులై నిశ్చయింప లేక. 62

ఉ. ఊరక మూగలై యనఁగ నుండి రగస్త్య పులస్త్య గౌతము
లారుణి వ్రాయుచుండె జమదగ్ని పరాశరమౌని యేమియు
న్నోరు మెదల్పదయ్యె జ్యకినుండు విచారము సిగ్గు బర్వఁగా
నేరకయుండె మార్కలంక వింగి గనుంగొనుచుండె నత్రియున్. 62

సీ. కశ్యపువదనంబు గన్గొనె జాబాలి, యతడు నారదునిదేహంబు గోకె
నతడు శాండిల్యుని నమశేంద్రమాటను, నుత్తరం బిమ్మని యొత్తి పలికె
నతడు భరద్వాజు నల్లన యంగుళీ, సంజ్ఞను బలుమాఱు సన్న జేసె
నతడు మాండవ్యమునిమహాప్రవరుని, గనుగీటె నీవెఱుంగవె యటంచు
గీ. నివ్విధంబున సకలఋషీశ్వరులును, నీవు నీవని ప్రతివాక్యనిర్ణయంబు
గాన కన్యోన్యవదనపంకజసమీక్ష, ణములు సేయుచునుండిరి బ్రమసినట్లు. 64

వ. అప్పు డనుపమానవిపులతపోగరిష్ఠుండును సకలమునిజనశ్రేష్ఠుండును భూతభవిష్య
ద్వర్తమానవిదుఁడు నగువసిష్ఠుండు సభాసములకలకలంబు వారించి సునాసీరుసిం
గనుంగొని మహాద్భుతంబుగా నిట్లనియె.

శా. ఆకర్ణింపుము పాకశాసన సుపర్వానీకసంసేవ్య భూ
లోకాధీశు డగణ్యపుణ్యుడు కృపాలోలాత్మకుం డర్థిర
క్షాకల్పద్రుమ మద్రిధీరుడు హరిశ్చంద్రాభిధానుండు ధా
త్రీకాంతుం డొక డొప్పు నూనృతవచశ్శ్రీవైభవోపేతు డై. 66

క. మధ్యమలోకాధీశు డ, యోధ్యాపురభర్త గర్వితోగ్రాంనృపా
సాధ్యుండు సకలనుజనా, రాధ్యుం డహిమాంశువంశరత్నం బరయన్. 67

క. శరణాగతరక్షామణి, కరుణాగుణసుధ్య డగ్రగణ్యుం డిరువు
వ్వురు సార్వభౌములకు న, ధ్వరకృత్యసమగ్రవిమలతరపుణ్యు డిలన్. 88

క. గంభీరదోఃప్రతాపవి, జృంభితు డైదివురంధు నేడేఁట జయ
స్తంభంబులు బహుయూప, స్తంభంబులు నిలిపె నతడు జంభవిరోధీ. 69

తే. అనృపాలాగ్రగణ్యుజిహ్వాగ్రరంగ; సీమ నటియించు వాణీసుకేశయాక్షి
యతడ యీరేడుజగముల నరసిచూడ, నాడి తప్పనినిత్యసత్యవ్రతుండు. 70

తే. అనిన నగ్గాధిసుతుడు క్రోధాత్ము డగుచు, ఘోరజీమూతపటలనిర్ఘోషమునకు
గనలి ప్రతిగవ మిచ్చుసింగంబుపగిది, నిష్ఠురోక్తుల బలికె వసిష్ఠుఁజూచి 71

క. దేవసభామధ్యంబున, నీవిధమున నీకు గల్ల లేటికి నాడన్
భూవల్లభులకు నెపుడు మృ, షావాక్యము లాడుటయె నిజం బరయంగన్. 72

ఉ. ఒత్తుగ మాంసము న్మధుగుటోగిరమున్ ఘృతశర్కరాదులున్
గుత్తుకబంటిగా మెసగి క్రొవ్వి వధూరతింగ్రీలలన్

మత్తిలి దేహము ల్మఱచి మ్మాటికి బొంకునృపాలకోటికిన్
సత్తు దలంప నెక్కడిది సంయమి నీ కిటు పల్కఁ బాడియే. 73

క. భూపతు లెక్కడ సత్యం, బాపము లెక్కడ వసిష్ఠ లజ్జింపక యీ
తాపసులు వినగ నుఱక శ, చీపతితో మించి యాడ జెల్లునె నీకున్. 74

తే. జగతిపై గల్గు భానువంశజుల కెల్ల, దఱచుగాఁ గులరోహితత్వంబు సేయు
కారణంబున బెక్కుమార్గముల నార, కిట్లు నుతియించెదవు నీవు నిచట నతని. 75

ఉ. అందఱు నిట్టివాడు గలడా యన నారక కల్లప్రజ్ఞలన్
ముందఱికేమొ తెల్లుంగక సమున్నతభంగి నహంకరించి సం
క్రందనులోద నాడితివి రమ్మని యిందుఁడు నిన్ను బిల్చి నీ
విందుల కుత్తరంబు దగ నిమ్మని పల్కెనె నీకు నేటికిన్. 76

క. నీనుడివెడు వాక్యంబులు, వీనులకు బురందరునకు విన నింపైనం
గానిమ్ము మాకు జూడ న్మహానింద్యము లనుచితంబు లాకర్ణింపన్. 77

క. నావుడు వసిష్ఠసంయమి, యావిశ్వామిత్రమౌని గలుక జనింపం
గా వీక్షించుచు నిట్లను, దేవేంద్రప్రముఖు లైన త్రిదశులు వినగన్. 78

సీ. ఓయి విశ్వామిత్ర యూహింప కీర్తికి, బ్రల్లదంబులు పల్కఁ బాడి యగునె
యబ్ధి లంఘించినహనుమంతుముందఱ, గణన కెక్కునె కుప్పిగంతు లెల్ల
నాదుసన్నిధి సాగి రాదు వేయైనను, నీదు ప్రౌఢతనంబు వాదు శీల
గుణులైన తేయుతో నిల బిచ్చుకల నెల్ల, సరిచేసి యెన్నికకరణి నీవు
గీ. సాంద్రకీర్తి హరిశ్చంద్రచక్రవర్తి, సమముగా నెన్నెదవు నృపాధముల నెల్ల
నతని సత్యంబులో సహస్రాంశ మైన, గలదె తక్కినధారుణీకాంతులకును. 79

ఉ. ధన్యుని భానువంశజలరాశిశశాంకుని వ్రజ
న్మాన్యుని సూనృతోక్తిమణిమండనుని న్గుణధాము రాజసా
మాన్యునిగా దలంచియె సమస్తసువర్వతతు ల్వినంగ బ
ర్జన్యసభాంతరంబునను పాగకు నింద యొనర్చెదంతయున్. 80

ఉ. కొంచక నీవు గర్వమున క్రూరతయుం బొదలంగ మించి నిం
దించినయంతమాత్రమున నే తదనూనయశోగుణప్రభా
వాంచితనిత్యసత్యమహిమాధిక ధైర్యగభీరశౌర్యముల్
కొంచెము లయ్యెనే యకట కోపమె కాని యెఱుంగ వేమియున్. 81

తే. ఆహరిచంద్రసార్వభౌమాగ్రగణ్యు, దొడరి చూపించెదవు విన దోష మనుచు
గర్ణపుటముల బాణిపంకరుహయుగము, జేర్చి శివశివ యనియె వసిష్ఠమౌని. 82

క. అప్పుడు విశ్వామిత్రుఁడు, ముప్పిరి గొనునట్టికోపమునఁ గన్నొసలన్
నిప్పులు రాలఁగ నమ్మునిఁ, దప్పక వీక్షించి పలికె దారుణభంగిన్. 83

ఉ. ఏటికి నోవసిష్ఠ తగ దీక్రియ సారెకు వట్టివాదముల్
మాటికి మాటికిం బెనఁచి మచ్చరికంబున నాడ నీకు నా
హాటకగర్భవిష్ణుసుమాయుధవైరులతోడ నైనఁ దా
నోటమిఁ బొందునే కలహ మొందినఁ గొంకుఁ డెట్టివేళలన్. 34

సీ. ఒకనృపాధముని మదోన్మత్తుఁ జంచలు, ననృతభాషాశీలు నధికజడునిఁ
బూనియెంతో మేటిఁబోలెఁ బేర్కొనియెదు, మాటికి నాతోడ మచ్చరమున
లవమాత్రమైన నాయవనిపాలునియందుఁ, బొంకమలినసూనృతస్ఫురణ మిగులఁ
బ్రకటించి పుచ్చకాయను జేవఁదెచ్చుచుఁ, గీర్తించెదవు వందిక్రియఁ జెలంగి

గీ. నీవ కాని హరిశ్చంద్రు నే నెఱుఁగనె, చూతఁ డేయూరు సత్యవాక్యప్రశస్త
గమ యేయూరు నీమాట గట్టిపెట్టు, వాక్ప్రభాప్రీతిఁ బొందఁగవలదు నీకు.

సీ. ఎవ్వాఁడు వింధ్యాచలేంద్రంబుగర్వంబు, నడఁచె నిర్జరులు మెచ్చ
నెవ్వాఁడు సక్రోధ హేతువీక్షణ నింద్రు, నొడ లెల్లఁ గన్నులై యుండఁజేసె
నెవ్వాఁడు వేదంబు లేర్పాటు గావించి, యన్నియుఁ గ్రమమొప్ప నచ్చుకట్టె
నెవ్వాఁడు హైమవతీశుతో నెదిరించి, గర్వించి యలుకాలఁ గన్నుఁజూపె

గీ. నట్టికుంభజ గౌతమ వ్యాస భృగువు, లుండ బ్రహ్మభవించి యఖండగరిమఁ
దనరు నే నుండ వెండియుఁ దక్కినట్టి, యమ్మునీశ్వరు లుండ నీ కీల పెనఁగ. 84

క. ఈమానులకంటెను నీ, వేమిట నధికుండ వరయ నెఱిఁగింపుము సు
త్రామునితోడను మునుకొని, యేమిటి కాడితివి గర్వనిటులుం దగునే. 87

తే. వేయు నేటికిఁ బాన్వీవిభుని యాన, గరుడగంధర్వయక్షరాక్షససుపర్వ
దందశూకావలులలోన మందునకును, సూనృతాలాపనియతు లెవ్వోటలేరు. 88

వ. అనుటయు నవ్వధ్యకోపాటోపంబున నరుంధతీమనోహరుం డిట్లనియె. 89

క. మతిఁ బరికింపగ నాత్మ, స్తుతియును బరనిందయును విశుద్ధాత్ములు దా
మతికలుష మండ్రు తగ గ, ద్భుత మొదవగ నన్ను నేనె పొగడుకొనంగన్. 90

తే. పంకరుహబాంధవుండును బాఁకశాసుఁడు, కలశజాతుండు నెఱుఁగంగ గమలసూతి
మంతపశ్శక్తితారతమ్యంబు నెల్ల, నిశ్చయింపఁడె యెంతయు నేర్పు మెఱసి. 91

తే. ఆర్యు డడిగినపలుకుల కాత్మ నెంబ, యుచితభంగుల నొసఁగు ప్రత్యుత్తరంబు
నెట్టుకొని నీవు నాతోడ వట్టిజగడ, మునుప నేటికి బూనెదు మూఢవృత్తి. 92

ఉ. చంద్రకళావతంసుఁడు భుజంగమభర్తయు నైననాహరి
శ్చంద్రనరేంద్రుపాత్రభవము సన్నుతి సేయఁగ శక్తులే శత

చ్చంద్రపురందరద్విరదచందనకుందమరాళమల్లికా
చంద్రసుగేంద్రులన్ గెలువఁ జాలుఁ దదీయయశోవిలాసముల్. 93

శా. సత్యశ్రీనిధి రాజమాత్రుఁడె హరిశ్చంద్రుం డహంకారవ
త్ప్రత్యర్థిక్షితిపాలసైన్యతిమిరప్రాభాతమిత్రాయమా
నాత్యంతోగ్రభుజాకృపాణజనితోద్యత్కీర్తిగంగానదీ
నిత్యక్షాళితసర్వలోకదురితానీకుండు వీక్షింపఁగన్, 94

క. పరిహాసమునకు నైనను, మరి కలలో నైనఁగాక మఱపున నైనన్
ధరణిపయి హరిశ్చంద్రుఁడు, హరహర పలికింప నన్నృతమాడఁడు వాఁడే. 95

మ. మదిరాపానసమంబుగాఁ దలఁచు నమ్మార్తాండవంశోత్తముం
దయాంభోనిధి పల్కు బొంకుటలు దుష్టుం గూడి వర్తించుటల్
తుదిఁ జండాలునితోడిసంగతిగ జేతోవీధి భావించు స
ర్వదిగంతస్ఫుటకీర్తి మూలధనమై వర్తించు సత్యవ్రతిన్. 96

క. పరకాంతలోదరులు సహో, దరులుం దల్లులును సూనదయ యెల్లపుడుం
గన ముల్లసిల్లు మితఁడు, పరధర్మము దలఁచి చూడ వర్జ్య మతనికిన్. 97

తే. అంతకంతకు నోపంబులలమఁ బ్రియము, దక్క నీ వొక్కటియును నేనొక్కటియును
కొట్టిమాటల నిటుఁ జాలి పెట్టనేల, వినుము కౌశిక యొకపలుకు విశదముగను. 98

సీ. అపరదిక్తటమునఁ దపనుండు పొడిచిన, గాంగేయశైలంబు గ్రుంగఁబడిన
సొరిది నంభోనిధు లుక్షిక్షభవించిన, దమ్మిచూలివరంబు దప్పి చనిన
జంభారిదంభోళిసరణి వమ్మైనను, ధరణీమండలము దిర్దిరఁ దిరిగిన
హవ్యవాహనుఁడు శైత్యంబు వహించిన, బ్రహ్మాండభాండంబు పగిలియున్న

గీ. నాహరిశ్చంద్రమనుజేంద్రుఁ డనృతమాడఁ, డనిన నమ్మునివరునిశ్చయార్థమునకు
గనలి వెండియు నిట్లనుఁ గౌశికుండు, ఘనతరాంగారములు కన్నుఁగవను వెడల. 99

తే. బాపురే నీకుపలుకుల కీపురంద, రాదిబృందారకులును సంయములు మెచ్చి
పలుకఁ జాలింపు మలపిత వెంతసేపు, వాక్ప్రశాంతి బొందంగ వచ్చు నీకు. 100

క. పలుమఱు నీరీతి వృథా, కలహంబుల కేమిఫలము గలిగెడు నీమా
టలు మేము విశ్వసింపము, తెలియంగా వలయు వానిదృఢసూనృతముల్. 101

ఉ. ఏవిధి నైనఁ జుట్టుకొని యీ జలపట్టి త్రిశంకుపట్టి నా
నావిధశీలలం గపటనాటకము ల్పచరించు ధూర్తల
శ్రీవిభవంబు మాపి చలచిత్తుని జేసి యసత్యవాక్యముల్
పలుకు దుర్మనీషఁ బలికింపఁ బన్నెద మేమి చెప్పుమా. 102

ఉ. ఎంతకుజాలినిశ్చల వహీనత నా కెదిరించి నీవు నీ
పంతము చూపుమా ధరణిపాలునిపాలికిఁ బోయి యీక్రియం
గంతయుఁ జెప్పి ధైర్యమహిమాన్వితుఁ జేయుము నాయరుంధతీ
కాంతుఁడు నవ్వి యిట్లనియె గాధితనూజునితోడఁ గ్రోధియై. 103

ఆ. ఇపుడు నాకుఁ జేయ నేటికి నామహీ, కాంతు నధికధైర్యవంతుఁగా నొ
నర్చునాఁడు మున్ను నాళీకగర్భుండు, మాలులేనిధృతి హిమాద్రి యతఁడు 104

క. కర్పూరము పుట్టుతోడనె, యొప్పగుపరిమళముఁగూడ నుదయించినగతిఁ
జొప్పన నతఁడు జనించిన, యప్పుడె సత్యవ్రతంబు నంకురమయ్యెన్. 105

తే. అనఁ గ్రోధనిత్యమే నరసి చూడ, కనిమిషాధిపుతోడ నే నాడ నింత
వెడఁగునే నీవు నిట్లు గర్వించి నన్నుఁ, జనునె యెకసక్కెములు మల్లసములుపలుక.

ఉ. నీవును నన్నుఁ బోలెడుమునిప్రవరుల్పదివేలు గూడి మా
యావశరాశి ముంచి హృదయంబు గలంచి మహోగ్రదుఃఖసం
భావితుఁగాఁగఁ జేసినను భావములో నణుమాత్రమైన నా
భూవరవంశవర్ధనుఁడు బొంకమి కింతటికైనఁ జాలెడన్. 167

మ. తనసామ్రాజ్యము వాసినం గులవధూత్వంబు వర్జించినం
తనయుం డీల్గిన హీనకృత్యములచేత న్మర్దశం బొందినన్
వనటం గుందిన నానరేంద్రుఁడు మనోవాక్కాయకర్మంబులం
దనృతం బాడిన నాప్రతిజ్ఞ వినుము విశ్వామిత్ర చిత్రంబుగన్. 168

సీ. పలుమాఱు నను నీవు పరిహాస మొనరింప. మేటివిప్రత్వంబు వీటఁబుచ్చి
తపమును జపమంత్రతంత్రము ల్విడనాడి, వేదశాస్త్రాభ్యాసవిధులు విడిచి
సంధ్యానుష్ఠానసత్క్రియ లొప్పకార్చి, కటిచారుచీరలు కట్టు టుడిగి
బోడినై జన్నిదంబులు త్రెంచి పారవైచి, యపవిత్రపుగుబూది నలఁదమేన

గీ. వారుణీపూర్ణమనుజకపాలపాణి, నగుచు ఖరవాహనుండనై యామ్యదిశకు
నభిముఖంబుగ గమనింతు నఖిలజనులు, రోసి తొలఁగంగ భీభత్సరూపమునను. 109

వ. అని యివ్విధంబున నవ్వసిష్ఠమునిశ్రేష్ఠుండు పలుకునిష్ఠురప్రతిజ్ఞావాక్యంబులు విని
కెండవనినుమకోదండవైరి యగునక్కౌశికుండు నాసికాపుటంబు లదర మహో
త్కట క్రోధమానసుండై యధరాలంభవర్జితంబగు మధర్మామధ్యంబున లేచి నిలు
చుండి పురందరాదిబృందారకబృందంబులు తాపసజనసందోహంబులు మదీయప్ర
తిజ్ఞ వినుండని ప్రచండరవంబున నిట్లనియె. 110

తే. చలము దళముగ నాహరిశ్చంద్రుఁ జేరి, భూరికోపాగ్ని కింధనంబుగ నొనర్చి

పెక్కుమాయలు బన్ని గాంభీర్యధైర్య, హీనుగావించి బొంకింతుఁబూనియేను. 111

సీ. బొంకంపలేవున్న భుజగాంకణు గూర్చి, యనిలజలాహారి నగుచు దొల్లి
హిమవన్నగంబున సమితహాయనములు, తపము చేసినసుకృతంబులోన
నర్థాంశ మొసగి లోకైకవిఖ్యాతిగా, దగ జతుర్దశమహాయుగము లవని
బూజ్యసామ్రాజ్యవిస్ఫూర్తుల బొందించి, తదనంతరంబ యాత్రిదివమునను
గీ. రమణ బదువాల్గు మన్వంతరములదాక, నముచిసూదను నర్థాసనంబునందు
నీరజారాతికోటీరనీరజాక్షు, నీరజాసను లెఱుఁగంగనిలుపువాడ. 112

వ. అని యిప్విధంబున నమ్మునికుంజరంబు లన్యోన్యభీకరక్రోధాతిరేకంబులం బ్రతి
జ్ఞలు పలుకుటయు. 113

ఉ. కుంభిని దిర్దిరం దిరిగె గుమ్మరిసారెవిధంబు న్దిశా
కుంభులు మ్రొగ్గె మేరుగిరి గ్రుంగె విరించి కులం జలించె వి
శ్వంభరు డెంతయు న్బెదరె సాగరము ల్గలగంగ బాఱె సం
స్తంభితతేజుఁడయ్యె రవితారలు రాలె మహాద్భుతంబుగన్. 114

తే. తలలు వేయును ముడిచె బృదాకువిభుడు, మాఱ కదరంగ జొచ్చె నంబరతలంబు
దిక్కులన్నియు నొక్కట వక్కలయ్యెఁ, బెల్లు బలితుందిరంబు ఘూర్ణిల్ల దొడఁగె.

వ. అప్పుడు సునాసీరుండు పరికంపితశరీరుండును విన్యస్తభయచేతసుండును విస్రస్తహస్త
శతకోటియునై పేరోలగంబు చాలించె. బృందారకబృందంబులు డెందంబుల నమం
దంబు లగుభయంబులం బొంది వికలతం బెగడు గుడుచుచు నొక్కరుండు చనిన తెరు
వునం గదిసి వేఱొక్కరుండు చనక నలుదిక్కులకుం బఱవం దొడంగిరి. మునిజనంబు
లన్యోన్యముఖావలోకనంబులు సేయుచు హాహాకారంబులు చెలంగ జటాభారంబులు
వీడి నేలదాఁకం దూలి యాడ నొండొరుల, గడవ నాలస్యంబు దక్కి కదంపడి
వసిష్ఠకౌశికులభాషణరోషపావకవిస్ఫులింగంబు లభంగంబులై చతుర్దశభువనంబులకు
దుర్దాంతతాపంబు వాపాదించు నని యుగ్గడించుచు దిగ్గన నిజాశ్రమంబులకుం జనిరి.
వసిష్ఠకౌశికులు నంతరంగంబులఁ గోపంబులు గాఁపురంబుండఁ దమతమనివాసంబు
లకుం బోయి రంత. 116

చ. ప్రసవితకింశుకప్రముఖపాదపజాలము పాంథలోకమా
నసపరితాపకారణము నందితకోకిలకీరశారికా
భసలము చందనాచలనభస్వదుదారము వచ్చెఁ జైత్రమ
య్యసమశరప్రతాపము మహాభ్యుదయంబును బొందుచుండఁగన్. 117

వ. ఇట్టిచైత్రారంభంబున. 118

తే. మహితబహుయజ్ఞదీక్షాసమర్థుఁ డైన, యాహరిశ్చంద్రనరపతి సాంగనియతి
వెలయ నొకయజ్ఞ మొనరించి విప్రతతికి, భూరిదానంబు పెట్టె నవారితముగ. 119

క్రతుతంత్రము సాంగంబుగ, హితమతి నీడేర్ప వలయు నినకులతిలకా. 134

క. జనుడు కరి నెక్కి దేహం, బనయము నిక్కించి రత్నమంబరమునకై
చన విడిచినంతపాఱివిడు, ధన మిచ్చిన నధ్వరము యథావిధి నడచున్. 135

వ. అనుటయు నారాజన్యుం డతిధన్యుండ నైతి నన్ను మీ రడిగినవిత్తంబు చిత్తంబు
రంజిల్లఁ ద్వాంతంబు యిచ్చెదఁ గొనుండనిన నగ్గాధినందనుండు శిరఃకంపంబుచేసి మహై
శ్వర్యంబును బొంది యాహా యిమ్మహానుభావుని యనూనదానప్రభావం బింతయొప్ప
నే యని వర్ణించుచు నమ్మహీవల్లభున కిట్లనియె. 136

తే. క్షోణినాయక నీమనశ్శుద్ధిఁ దెలియ, వలసి యడిగితిఁ గాక నీవంటిదాత
నిండువేడ్కఁ బ్రసన్నుఁడై యుండ మాకు, నిట్టిసతుయాంబులను ధనం బేమిఁ బ్రాతి.

తే. చాల నక్కఱ యొదవిన వేళ వచ్చి, పుచ్చుకొనియెద నుంచు నీ విచ్చువిత్త
మింకమాఱుత్తరంబు నీ వేమి పల్క, నను పదాశివునాన భూనాథతిలక. 138

వ. నీకుం జిరాయుర్నిరామయంబులు నభిరామక్షేమంబు లగుఁ బోయి వచ్చెద నని య
చ్చోట ముహూర్తమాత్రంబునుం దడయక నిజాశ్రమంబునకుం జనియె నంత
నమ్మహీవల్లభుండు నుల్లంబునఁ బెల్లు వితర్కించి. 139

తే. విత్త మిప్పుడు గొని చన్నఁ జిత్తమున వి, చారదూరుఁడనై కడు సమ్మదమున
నుండఁగాఁ గల్గు నప్పు పైఁ బనిచె నతఁడు, క్రోధమతి నెట్టిశఠి వేఁడు నోధనంబు.

క. వనరుహగర్భన కైనను, వనరుహలోచనున కైన వనరుహరిపుజూ
టున కైనఁ దరము గాదు, మ్మునివరుకోపాగ్ని కెదిరి మొన కట్టంగన్. 141

వ. అని మనంబునం దలంచుచు నిరంతరపరిపాలితమహీమండలుం డై యుండె నంత
నక్కడ నితాంతకపటక్రియాధారేయుం డగు నగ్గాధేయుండు వెండియు నొక్క
కపటమతంబు విచారించి యతిత్వరితంబున. 142

క. నూతనజవసత్వంబుల, నూతనతనువర్గములను నూతనగతులన్
నూతనభంగుల నొప్పెడి, కైతవమృగఖగచయంబుఁ గల్పించె నృపా. 143

వ. ఇట్లనల్పమహానాచాతుర్యంబునం గల్పించి పంచిన నమ్మృగఖగవ్రాతంబులు గణ
నాతీతంబులై యెక్కడఁ జూచినం దామయై యుక్కుమిగిలి యొక్కుమ్మడిం బిక్క
టిల్లి పెక్కుతెఱంగుల నత్యంతభయంకరకృత్యంబులం జెలంగి ఫలితంబు లగు కల
మాదిసస్యంబులు మేసి పడఁద్రోసి మట్టిమల్లాడియు నారామంబుల నిక్షుదండంబు
లు ఖండంబులు గావించియుఁ, గదళీతరుషండంబులు విదళించియు, మల్లికామాధవీ
ద్రాక్షాదిలతావితానంబులు ద్రెంచియుఁ, గొమ్ములఁ గోరాడి తటాకంబులు పటా
పంచలు గావించియుఁ గ్రమ్మియుండం గొందమ్మికొలంకులఁ గలంచి కాఱియ పెట్టియు,
గోష్ఠంబుల గోవత్సనికాయంబుల నపాయంబు నొందించుచు జనపదంబుల మను

ష్యాలం బొదవి చెవిపియు, బహువిధంబులఁ గోలాహలంబు సేయుటయు హాలహాల
విషజ్వాలంబులచేఁ దేవదానవానీకంబులంబోలె ననేకంబులు మహీప్రజాసంఘంబు
లహీనభయంబున మొఱలిడుచుం జని హరిశ్చంద్రనరేంద్రులఁ గనుఁగొని సర్వాంగ
సంగతోర్వీమండలంబు లగు దండప్రణామంబు లాచరించి మస్తకన్యస్తహస్తారవిం
దులై యిట్లనిరి. 144

సీ. సదయుండవై నేఁటిదనుక మము నీవు, పెంపుదీపింపఁ బాలింపుచుండ
నీతిబాధల నెన్నఁడు పొందక, నీచల్లఁదనమున నిండువేడ్కఁ
దల్లిదండ్రులయొద్ది తనయులగతి మాకు, మఱుఁగుపించెలకీతి నెఱి వహించి
భవనంబులను వెండి పైఁడియుఁ దడఁబడ, గుఱిలేనిపాఁడియుఁ గూడు గలిగి
గీ. క్రిందమై నెండకన్నును నీడకన్ను, నెఱుఁగ కన్నలఁ దమ్ముల హితుల సుతులఁ
గూడి సుఖమున్నవారము కోర్కు లొదవ, సత్యసల్లాప యోహరిశ్చంద్రభూప.

ఉ. జారులుఁ జోరులు న్విమలసత్యవిదూరులుఁ గ్రూరులు న్దురా
చారులు లేరు యాచకులు సాధులబోధ లొనర్చుభీకరా
కారులు లేరు లేరు మఱికల్త్రపచిత్తులు మత్తులు న్ధరి
త్రీరమణాగ్రగణ్య వివరింప భవత్పరిపాలితావనిన్. 146

క. క్షితి సకలసస్యవతియై, యతిసాంద్రంబుగ ఫలించు నపమృత్యువు లె
ట్టితఱి బ్రభవింపవు కడు, హితముగ నెల మూఁడువాన లెలమిం గురియున్. 147

చ. చిరతరదేవతాగృహవిశేషమహోత్సవకృత్యము ల్వగం
పగలుగ సాఁగు నెల్లపుడుఁ బల్లవపుష్పఫలాఢ్యసత్ఫలో
త్కరములఁ బొల్చుఁ బాదపనికాయము లింకవు నిర్మలాంబువుల్
పసుల నేఱులం బిడుకుఁ జాలఁగ గోవులు దుగ్ధపూరముల్.

సీ. ఇట్లు వర్తింపంగ నిప్పుడు కొన్నాళ్ళ, గోతె భరింపంగఁ గొలఁది కాక
బ్రహ్మకైనను గణింపఁగరాని పెద్ద, వన్నెలమెకంబులు బుద్ధియును నేల
యీనినయట్లు కోటానకోటులు గూడి, దారుణతరనినాదములు చెలఁగఁ
జెఱువులు తోఁటలు చేలు గాలువలును, నేపెల్లఁ దూలఁగ రూపు మాపి
గీ. యాలమందలఁ గొందలం బందఁ, జనపదంబుల మనుజులఁ జంపుచుండుఁ
గదల మెదలంగ శంకించి కాఁపుగములు, విడిచి వచ్చితి మోపృథివీకళత్ర. 149

క. ఈమృగబాధలు మాన్పి ద, యామతి మముఁ బ్రోవ వలయు హాలహలాగ్ని
స్తోమభయ ముడిపి యమరులఁ, బ్రేమ న్రక్షించినట్టిమృడునివిధమునన్. 150

చ. అనినఁ గృపారసంబు హృదయాంబురుహంబున సంజనింపఁగ
య్యవనిశరత్న మిట్లను మహీప్రజ నేఁ డనియుంగఁ జూడ మీ

కనయము నింతమాత్రమునకై భయ మందుచు నుండ నేల యీ
ఘనమృగభీతి గాన్చెద సుఖస్థితి మీ కొడఁగూడునట్లుగన్. 151

వ. అని యభయప్రదానం బొసంగి యమ్మహీపప్రజాసందోహంబుల వీడ్కొలిపె నంత.

ఉ. పంకజగర్భసీమ మధుపంబులు వృక్షములందుఁ బక్షులుం
బంకరుహాక్షులందు రతిభర్తయుఁ జేరి వసింప నొప్పె న
ప్పంకరుహాప్తుఁ డస్తగిరిపైఁ గడుమందము లైనరశ్ములన్
ముంకెనపువ్వుగత్తి క్రియ మందుఁమంతయుఁ గుంపు లీనఁగన్. 153

చ. తరుణవయస్కుఁ డైనహిమధాముని మీఁద మనంబు నిల్పి యం
బరసతి దన్ను వృద్ధుఁడు మానఁ దలంచిన జాల సిగ్గునం
ద్వరితగతి న్మునింగినవిధంబునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకె భా
స్కరుఁడు గుముద్వతీతతి వగింగ వికాసకళామిషంబునన్. 154

క. అనుపమతేజోనిధి యగు, దినహాథుని మహిమ రాశి దేరినచందం
బున సాంధ్యరాగదీధితి, గనుపట్టె నవీనకింశుకప్రసవరుచిన్. 155

క. హేలాగతి విరహులపై, నోలి న్రతివల్లభుఁడు ప్రయోగించుమహా
నీలోత్పలశరజాలము, పోలికఁ దిమిరంబు దిశల బొంబొరఁ బర్వెన్. 156

క. మృగనాభీపరిపూరిత, నగభిన్మణిపేటికరణి నలినభవాండం
బు గనుంగొన కనుపట్టెను, మిగుల దపస్సముదయంబు మెండుకొనంగన్. 157

తే. యామినీచంద్రవదన వియత్సరేంద్రి, నీలమణిపాత్రిలోఁ జల నించినట్టి
విమలఘనసారశకలసంఘము లనంగ, బ్రబలె నక్షత్రవితతు లంబరమునందు. 158

వ. అంత.

ఉ. శంకరమౌళిభూషణము సారసమిత్రునితోడఁ జోడు మీ
నాంకుని మేనమామ కలశాంబుధికూఁమిపట్టి యామినీ
పంకరుహాయతాక్షి ప్రియభర్త వియద్గృహమధ్యదీప మే
ణాంకుఁడు గాన నయ్యె నుదయాద్రిపయిం దిమిభేదసింహమై. 160

క. నిండారుకళల హిమకర, మండల మొప్పారె నయనమహ మొదవగ నా
ఖండలదిక్సతిమౌక్తిక, కుండల మన విమలకాంతి కొమరు దలిర్పన్. 161

శా. కాశాకాశధునీతరంగనిచయనీకాశద్యుతి న్దట్టమై
కాసెం గౌముది చక్కఁగా సకలదిగ్భాగంబుల న్మన్మథుం
డేసెం బాంధజనవ్రజంబులపయిన్ జృంభించి లీలాధను
ర్వైశారద్యము నివ్వటిల్లఁ బ్రసవాస్త్రశ్రేణులం జెల్లగన్. 16

ఉ. వారణ లేక యొక్కుమొగి వాంఛలు దీరగ సాంద్రచంద్రికా
పారణ సేయుచుం బొదలె బాయని వేడ్కఁ జకోరవారముల్

కైరవబాంధవోపలనికాయము లోలి స్రవించె నేలుఁగై
జారులు చోరులుం గడువిచారము నొందిరి పొంగె వారిధుల్. 163

వ. ఆసమయంబున హరిశ్చంద్రధరణీవల్లభుండు తత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించి నిద్రింపం దొడంగె నంత.

తే. కాముకేళిపరిశ్రాంతి గన్ను మోడ్చి, వేడ్కనిద్రించువిటవిటీవితతి బెదర
కుక్కుటంబులు కుక్కురొక్కో యటంచు, గూయజొచ్చె గఠోరనిర్ఘోషణముల.

సీ. చంద్రు దద్దపుదిశ్యచందానఁ బశ్చిమ, దిశ నిల్చెఁ గాంతి మందీభవించి
యొక్కటొక్కటి చిక్కె జుక్కలాకసమున, నాడకాడకు గడునల్వురుచుల
విటవిటీతతులపై విషమాయుధుడు గోప, మెడలి బాణాసన మెక్కుడించె
వనముల సింధుజీవనముల జెలరేగె, కలయంగ బహుపక్షికలకలములు

గీ. కాంతు లుడివోయె గృహదీపకలికలెల్ల, జక్రదంపతు లలరె నిర్వక్రలీల
నంబుజంబులు విరిసె రోలంబములకు, విందులొనరించె బ్రాభాతవేళయందు. 166

మ. ధరణీనిర్జరరాజి మ్రొక్క శతపత్రంబుల్ విజృంభించి ప
ట్వరణశ్రేణుల కెల్ల నామెతలు పెట్టం జక్రవాకావళుల్
పరమానందము బొంద డింబరుచి బింబశ్రీ విడంబింప నం
బరరత్నం బుదయించె జంభరిపుహర్మ్యస్వర్ణకుంభాకృతిన్. 167

వ. అని విని కౌంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 168

మ. అమరానోకహదానదానవవిపక్షాస్త్రాంఘ్రిసేవాకళా
కమనీయస్థిరభావభావభవరాకాచంద్రనీకాశకా
శమరాళప్రతిమాననిర్మలయశస్సౌభాగ్యభాగ్యప్రభా
వమురారాతిసమానమానవిభవవ్యాపారపాథోనిధీ. 169

క. మందారదానగుణ సం, క్రందనసమవర్తివరుణకౌబేరదిశా
సౌందర్యయువతివిలసిత, చందనచర్చాయమానసదమలకీర్తీ. 170

పంచచామరము. వసుంధరాధరేంద్రధైర్య వాగ్జాసనాభసో
జ సవ్యభూతిశేశయాన్యచారువర్తనా నటల్
ప్రసూనబాణవైరిమౌళిభాగవిస్ఫురత్స్వప
ర్వసింధువీచిజాలతుల్యవాగ్వినిర్భరార్భటీ. 171

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకలసుకవి
జనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలంకార శంకరకవి
నామధేయ ప్రణీతం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బనుమహాప్రబంధంబు
నందు బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# హ రి శ్చం ద్రో పా ఖ్యా న ము



## ద్వితీయాశ్వాసము.

—••✤••—

శ్రీ లలితలోచనాబ్జ వి
శాలయశోరుచిరకాయసదమలసుమనః
పాళీసంవాసిత ది
గ్జాలా ధమ్మిల్ల మంత్రిబాచయయెల్లా. 1

వ. ఆకర్ణింపుము. పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె. నట్లు భానుమం
తుండు ప్రథమసానుమంతంబునం గనుపట్టుటయు నటమున్న మేల్కని యవ్వసుం
ధరావల్లభుండు సంధ్యానుష్ఠానంబులు నిర్వర్తించి మృగయావిహారంబునం జను
వాఁడై పురంబునం జాటంబంచిన. 2

తే. వేఁటమాణిక్య ముపకారి వెండిగుండు, వాయువేగంబు వెటిపుచ్ఛకాయ గరుణఁ
డడవిపోతులరాజు చిత్రాంగి బొండు, మల్లె యన నొప్పు పెక్కునామములవాని.

మ. బలుకోఱ ల్తనుమధ్యము ల్మహదురోభాగంబులుం బెద్దమూ
తులునుం గల్గి మృగేంద్రడింభములకుం దుల్యంబు లైనట్టి జా
గిలపుంగుక్కల హేమశృంఖలముల న్గీలించి కోటానకో
టుల వేగం గొని వచ్చి రాటవికు లాటోపంబు వాటిల్లగన్. 4

చ. గొలుసులఁ బట్టి లుబ్ధకు లకుంఠితశక్తిఁ గుదించి నిల్పఁగా
బలువిడి వంఘ్రుల న్బయలు పల్మఱుఁ ద్రవ్వుచు వీఁకమై నభ
స్థలిఁ గబళింపఁ జా వెడువిధంబున మోగలు మీఁది కెత్తి కు
క్కలు ఘనభౌకృతియాధ్వనుల గాఢతరోద్ధతి నించె దిక్కులన్. 5

సీ. కఱకులై సట్టిజూంజాలు వెండ్రుకలు నిర్లి, గవియుమేనులు కెంపుఁగన్నుఁగవయుఁ
గుఱుచజేవులుబొట్లు కురువిందపూసపే, రులు నొంటియట్టచెప్పులును గలిగి
వలలును బెట్టుకోవులుఁ బెద్దయురులును, దెరలును బోనులు దీపములును
వసులు గనులు పోగువాలు వెండ్రుకత్రాళ్ళు, బలువిండ్లు నమ్ములు బల్లెములును
గీ. బందివాఘులు వీఁటెలు బట్టెసములుఁ, బంట్రకోలలు సాదిగా బహువిధముల

సాధనమ్ములు ధరియించి శబరపతులు, వచ్చి రాఖేటకక్రియావ్యసనరతులు. 36
సీ. వ్యాఘ్రంబు నైనను శీఘ్రంబ తఱిమిడి, పొడిచెద మీ కెల బూపు చెడక
శరభంబు నైనను శరభసంబున డాసి, పదము లెన్మిదియుఁ ద్రుంచెదము పొదివి
సింగంబు నైనను భంగంబు నొందించి, జీవంబుతోన తెచ్చెదము పట్టి
భేరుండమును నైన నూఱెండ నీయక, నలి చేసెదము చాల బలిమి వెలయ
కీ. సాహసంబున మత్తగజంబు నైనఁ, గెరలి తొండంబు తెగ నఱికెదము దేవ
నేఁడు చూడుము మా వేఁట నేర్పులెల్ల, ననుచుఁ బంతంబు లొకకొందఱాడిరపుడు
మ. తలచుట్టన్ జడచొళ్ళెయంబులును నీల్దట్టీలుఁ జేకట్టుదం
డలు వాకట్టులు ముప్పిదుల్మెకముల న్డాకొల్పువశ్యంపుమం
దులునుం జోఁపుడుఁగోలలుం గుఱుచచదడ్లు న్సమగ్రంబులై
చెలువార న్భటకోటి వచ్చె మృగయాశృంగార మేపారఁగన్. 8
వ. ఇవ్విధంబున నపహసితకిరాతవ్రాతంబులు సముద్భటభటానీకంబులుఁ జనుదేర న
మ్మానవాధీశ్వరుండు దానును మృగయావిహారసముచితశృంగారవేషం బంగీకరించి
పుత్త్రకళత్త్రామాత్యసమేతంబుగా. 9
చ. ధనదుని పుష్పకంబునకుఁ దా నెనవచ్చు నటంచు లోకముల్
వినుతి యొనర్ప బొల్పెసఁగి విద్రుమమౌక్తికవజ్రనీలకాం
చనమయము న్సవేగహయసంఘటితంబును నైన తేరు సొం
పెసరఁగ నెక్కి మిక్కిలిసముత్సుకతం బురబాహ్యసీమలన్. 10
క. మాతలి దలఁపింపం గల, సూతుఁడు తనరథము గడపుచో బహుగతులం
చాతుర్యంబులు చూపఁగ, నాతని నేర్పునకుఁ జాల హర్షము పొదలన్. 11
వ. కౌబేరదిశాముఖుం డై కొంతదవ్వు చని యంతట. 12
ఉ. కనియె న్భూతలనాథుఁ డాటవికరాకాచంద్రబింబాననా
జననిర్వ్యచితపుండరీకగవయస్తంబేరమాఖేటమున్
ఘనశృంగాటము నర్మదోర్మిపటలీగర్జద్దిశాపేటమున్
వినుతానేకనికుంజకూటము మహావింధ్యాటవీవాటమున్. 13
ఉ. మారుతపూర్ణకీచకసమాజరవంబులు నర్మదానది
నీరజభృంగగానమృదునిస్వనవైఖరితోడఁ గూడి యిం
పారఁగ నధ్వనీనివహంబులకున్ శ్రవణోత్సవక్రియా
గౌరవము ల్ఘటించు నొడికంబుగ వింధ్యవనాంతరంబులన్. 14
వ. వెండియుఁ బుండరీక శుండాల గవయ గండభేరుండ కంఠీరవ సారంగ భూదార
భల్లూక లులాయ ప్రముఖనిఖిలమృగనికాయభయంకరానూనధ్వానబధిరితకకుబ వి

దంతావళకర్ణకుహరాంతరాళంబును దింత్రిణీతమాలతాళవటకుటజకపిత్థాశ్వత్థకోవి
దారసిందువారమందారపిచుమందచందన మాకందమాతులుంగలవంగ జంబుజంబీర
వకుళ క్రముకపనసబదరీమధూకమాధవీకింశుకశింశుపాశోకాది నానావిధపాదప
శాఖాశిఖావిహరమాణశుకపికకోకిలకీరశారికా కలవింకకపోతఖంజరీటకాకఘూ
కాద్యనేకశకుంతసంతతిప్రబలనినాదమేదురంబును నైయరుణగభస్తికిరణపరంపరలకు
బ్రవేశింపదరంబుగాక కరంబు సాంద్రంబయి యిసుక చల్లినం గ్రిందరాలక యి
గులు గవియుచుం బసరుడాలు వింధ్యవసుంధరాధరపరిసరారణ్యంబు దఱిసి మృగం
బులు మెలంగుపట్లుగని ముల్లుతారువేయించి పోగ్రు వారించి వలలును దెరలు నె
తించి బోనులు దీమంబులు నొడ్డించి. 15

మ. ఘనబాణాసన మెక్కువెట్టి పటుదోర్గర్వం బఖర్వంబుగా
వనధిధ్వానముకంటె మించుగుణనిస్వానంబు గావించి యు
బ్బున నేసె న్ఘనభీకరాశుగతతు ల్పుంఖానుపుంఖంబుగా
వనజాతాప్తకులాగ్రగణ్యుఁడు మృగవ్రాతంబులం గూలఁగన్. 16

వ. ఇవ్విధంబున నత్యంతభయంకరము లగుశరంబులం బఱపినం గరంబు భీతిల్లి యెల్ల
మృగంబులు తల్లడిల్లి పెల్లాఱఁగ నట్టియెడ. 17

తే. మేదినీనాథశరహతమృగసమూహ, ఘనకళేబరజనితరక్తప్రవాహ
వితతి ప్రవహించె గైరికక్షితిధరేంద్ర, సానుసంభూతనిర్ఝరచయముఁబోలె. 18

క. అంతట మృగయాకేళి ని, రంతరబరతృప్తి నొంది యవనీశుఁ డతి
శ్రాంతుండై సెలవిచ్చినఁ, బంతమునఁ గిరాతపతులు భటసంతతులున్. 19

క. ఉరువడిఁ బెల్లార్చుచుఁ గే, సంశాబకసదృశరూపజవసత్వభయం
కరము లగు వేటకుక్కల, బరి విడిచిన నవి వధించె బహుమృగతతులన్. 20

ప. తదనంతరంబ వారును బదచిహ్నంబుల వెంబడిం జని నికుంజంబులు దూఱి పొంచి
యున్న మెకంబులం దుఱించియు విశాలంబు లగుజాలంబులం బడంజోపి తగుల్పఱిచి
కొనియు దీమంబుల నొడ్డి యేమఱుపాటునం బొదివియుఁ దనివి సనక మఱియును.

తే. సాళువము గిద్దు లగుడు వేసడము కురుజు, బాజు జలకట్టె జాలియ వైల యణుజు
నోరణంబును నాదిగాఁ జేరువడిన, వేటడేగల గఱికొన విడిచి కడిమి. 22

తే. గ్రద్దయును తాకి కొంజును గొక్కెరయును, గూబ పార్వంబు బెగ్గురు కొక్కెరయును
గొంగ లావుక యాడేలు గువ్వ వెలిచ, పొట్టపిట్టయు ననఁగల్గుపులుఁగుగముల. 23

క. తూలించి విపిన మెల్లను, గాలించి తదస్రివాతిఁ గ్రవ్యచయంబుల్
దేలించి తనిసి వేటలు, చాలించి నరేశ్వరునకు సమ్మద మొదవన్. 24

క. చమరీవాలములు కురిం, గమదము గజదంతములును గరికిటిపంజా

తను లగుముక్తాఫలములు, నమితంబుగఁ దెచ్చి యిచ్చె రతివినయమునన్. 25

వ. ఇచ్చిన నవి యన్నియుం గైకొని ప్రియంబునం జంద్రమతికి సమర్పించి యవ్వేఁట కాఱులకుఁ బసదనం బొసంగి యబ్జసరుహాప్తకులుండు సరసవివేకరతుండు నత్యంత హితుండును నగుసత్యకీర్తిం గనుంగొని. 26

తే. అనఘవర్తన వినుమృగయావిహార, కారణంబున దూర మేతేర వలసె
మనకు నీరాక సఫల మామార్గ మొకటి, తెలియఁ జెప్పెద సమ్మదస్థితిఘటిల్ల. 27

లయగ్రాహి. అల్లదె సదాగతినటల్లహరి దైత్యరిపుభల్లమకటప్రసవవల్లరి సముద్య
త్ఫుల్లకుముదాబ్జనవహల్లకవసద్భ్రమర ముల్లమునఁ గౌతుకము వెల్లగొనఁ గన్నుల్
చల్లఁగ బయోధిప్రియవల్లభఁ గనుంగొనుము కొల్లలుగ ముక్తిరమ నెల్లపుడు మజ్జ
త్సల్లలితచిత్తులకు బెల్లొసగె జహ్నుమునితల్లజసుతోరుతటి నల్లచదలేటిన్. 28

శా. తత్తీరంబున నిష్ఠమై దప ముదాత్తప్రీతి గావించుభా
స్వత్తేజోరమణీయు నంబురుహభూసంకాశు నంహఃపయో
భృత్తీవ్రశ్వసనుం బ్రసన్నగుణగంభీరు న్వసిష్ఠు న్దయా
యత్తస్వాంతు నరుంధతీవిభు సపర్యాకాంక్షఁ జూడందగున్. 29

క. అని నృపతి దండనాథుని, యనుమతమున నరిగి కాంచె ననురాగము నె
మ్మనమున బెనగొనుచుండగ, ననుపమము వసిష్ఠమౌనియాశ్రమ మెదురన్. 30

వ. కని తత్ప్రదేశంబున. 31

మహాస్రగ్ధర. వరరుద్రాక్షప్రభూషావ్రజరుచిరతను న్వ్యాఘ్రచర్మోత్తరీయుం
బరమధ్యానాంతరంగప్రణిహితశివున్ బద్ధపద్మాసనస్థున్
గరవిన్యస్తాక్షదాముం గనదరుణజటాకల్పు భస్మాంగరాగున్
జిరకాలోపార్జితాతస్థిరవిపులతపశ్శ్రీగరిష్ఠు న్వసిష్ఠున్. 32

వ. కనుంగొని ప్రముదితస్వాంతుండై యమ్మహీకాంతుండు నిజకిరీటకోటిసంఘటితహరి నీలరోలంబంబు తదీయచరణారవిందంబుల జుంబింప సర్వాంగాలింగితమహీమండలుండై దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చినం గనుంగొని యమ్మునివల్లభుం డిట్లనియె. 33

చ. అపగతబుద్ధి నింత మృగయావ్యసనంబున గేళి సల్పఁగా
నృపులకు నీతి గాదు ధరణీశ్వరభార్యయు నీవు భీకరా
తపసమయంబున న్బహువిధంబులదుష్టమృగంబు లున్న యి
వ్విపినములం జరించుట వివేకమె యాత్మ దలంచి చూచినన్. 34

క. సప్తోపాయధురీణత, సప్తవ్యసనములు వదలి సదమలబుద్ధిన్
సప్తాంగలక్షణంబుఁ దలి, సప్తాశ్వకులేంద్ర మెలఁగ జను నరపతికిన్. 35

క. మునిజనవినుతం బగున, మ్మనువంశంబున జనించి మఱవం దగునే
మనుజేశ నీతిమార్గము, విను నీయాజ్ఞాపక రాజ్యవిభవము పొదలున్. 36

తే. ఇచట నాలస్య ముడుగ నీ వప్పుడు పురికిఁ, బొమ్ము వేగంబ యింకొక్క బుద్ధివినుము
మఱచి తప్పియుఁ గౌశికమౌని యాశ్ర, మంబుప్రాంతికిఁ బోవకు మనుజనాథ. 37

క. పుణ్యమునం గీర్తుల కాంతి, వడి బెట్టినవాఁ డతండు వంకింపంగాఁ
గడుఁ గుటిలవర్తనుం డే, న్నఁడు నాతని పేరుకూర నంజకుమీ నృపా. 38

క. పంథాశ్రిస్వేషియు ని, ష్ఠురచరితుఁ డనఁగ గాధిసుతుఁ డతనివనం
బరుణాంశువంశమణి పై, తెరువైనను వేఁదు చేరఁగ దీవిచారా. 39

వ. అని యుపదేశించి వీడ్కొల్పుటయు నావృత్తాంతం బంతయుం దెలిసి విశ్వామిత్రుండు హరిశ్చంద్రమహీకాంతుని తదాశ్రమంబునకు రప్పించు నుపాయం బంతరంగంబునం జింతించి యనల్పకపటకౌశలంబున నొక్కమాయామృగంబును గల్పించిన నదియును. 40

సీ. ఘనఫేనరుచి నవ్వుధవళాననంబును, నల్లఁగల్వల గెల్చునయనములును
బద్మరాగప్రభఁ బరగుకర్ణంబులు, కాంచనదీధితి మించుతనువు
మౌక్తికకాంతుల మఱపించుచాఱలు, తుహినంబుతో దుత దొరయుకడుపు
మరకతచ్ఛవిఁ బురుడించుఖురములు, పవనంబుఁ దలఁకించుపటుజవంబు

గీ. గలిగి లీలావిహారంబు కారణముగ, నవనిఁ జరియించుపంకరుహారియంక
మృగము నెనుడుటయు సంయమీశ్వరుండు, దాని గన్గొని కడుసమ్మదంబుఁబొంది.

వ. హరిశ్చంద్రధరిత్రీవల్లభు నల్లన నెలయించి మదాశ్రమంబునకుం దెమ్మని పంచిన.

క. తనతనుకాంతులు దిక్కుల, ముసుకొని యెల్లెడలఁ బర్వ మురియుచుఁ జని యా
ఘనచిత్రమృగము చయ్యనఁ, బనివడి భూవరునిదృష్టిపథమున నిల్చెన్. 43

ఉ. నిల్చిన భానువంశజుఁడు నివ్వెఱ గంది తదీయవిభ్రమం
బుల్ పలుమాఱు చూచుచు నపూర్వమృగం బిది దీని మేను బి
ట్టలయ రయంబునం దఱిమి యల్లనఁ బ్రాణముతోనఁ బట్టి ని
ర్మలమతి యైనరోహితకుమారున కిచ్చెదఁ గేలి సల్పఁగన్. 44

వ. అని సారథిం గనుంగొని. 45

ఉ. అల్లదె పైఁడియిఱ్ఱి ముద్దుమారఁగఁ జూడుము దానిఁగూడ నీ
వెల్లవిధంబులన్ రథ మహీనజవంబునఁ దోలుమన్న భూ
వల్లభునాజ్ఞ సూతుఁ డనివార్యగతిం దగఁదోలె వాయువే
గోల్లసితాశ్వయుక్తమయి యొప్పగునయ్యరదంబుఁ జయ్యనన్. 46

ఉ. పంకజమిత్రకైశిక దళంపం గదు! సద్భుత మావహిల్ల నే
శాంకరమంత్రగణ్య విను మాగమశాస్త్రపురాణము ల్విశా
లాంకమునం బఠించు నెడఁ దాపసపుత్త్రిలకుం గవుళ్ళొగిన్
శంకలు దీర్చి చెప్పు గౌరవంబులుఁ జిల్కలు నవ్వనంబునన్. 53

సీ. కడుఁ బ్రీతి జన్నిమ్ముబడిదప్పి తిరిగెడు, లేడిపిల్లలకు బాలెంతపులులు
కంఠీరవంబులు గంధసింధురముల, తోడ మాటికి జెలులాడుచుండు
జిట్టెల్కగములతో జెలువులు వాటించు, బ్రియమున బావురు పిల్లిగములు
నీలకంఠంబులు లాలనం బొదవ బా, టించుఁ గుంభీనసడింభకముల
గీ. గొండగొఱ్ఱియపిండును గోఁతిగమియు, మంతనము లుండు బోరపొచ్చె మింతలేక
పాళువంబులుఁ బక్షులు గలిసిమెల్గు, గాధిపుత్త్రతపోవనవీథియందు. 54

వ. ఇట్టి విచిత్రంబులకు బాత్రం బగు నవ్విశ్వామిత్రతపోవనక్షేత్రంబు నిరీక్షించి తద
భ్యంతరంబున. 55

సీ. ఫుల్లహల్లకజలజాతమకరంద, పానలోలాళినీగానరవము
వీచిడోలాకేళివిశ్రాంతవిలసిత, చక్రవాకమరాళసముదయంబు
సతతకేళీసక్తసంయమిబాలికా, స్తనకుంభమారుణస్వచ్ఛజలము
పరివిమలశశికాంతపాషాణకల్పిత, సోపానమార్గసంశోభితంబు
గీ. పవనకంపితతీరభూభాగవిటపి, పుష్పగుచ్ఛపరాగవిభూషితంబు
మకరకచ్ఛపజలజంతునికరయుతము, నావిభుండు గాంచె నొక్కసరోవరంబు. 56

తే. కాంచి మానవనాథుఁ డంగనయును సుతుడు, దాను దత్తీరభూమి రథంబు డిగ్గ
దండనాథుండు కాము కైదండ యొసగ, సరసి సతిసి వినిర్మలజలము గ్రోలి. 57

వ. కృతావగాహనుం డై తత్సమీపప్రదేశంబునఁ బ్రిదిష్ట చుపుష్పితమాధవీలతామండ
పాంతరంబునఁ గిసలయతల్పంబున జంత్రిమతీసతీలలామంబు మృదూరుపీఠం బుపధా
నంబుగా శయనించి బాలరసాలపల్లవపరికల్పితతాళవృంతంబున శీతలమందవాతూ
లంబు సోఁక గదిసి విసర దండనాయకు వదనారవిందం బవలోకించి. 58

క. సదమల బహుపుష్పలతా, సదనవషట్పదసలగానఝంకారములన్
మదన మొదవించుచున్నది, యిది యేమొకొ యీయాశ్రమంబు రోయుఁగవలయున్. 59

తే. అనుచు బలుకుచు నుండంగ నచటి కపుడు, కుశసమిత్పర్ణఫలముల గోయ నొక్క
ఋషికుమారుండు వచ్చి మహీశుతోడ, జెప్పెనిది కౌశికునివనక్షేత్రమనుచు. 60

ఉ. చెప్పిన మేదినీరమణశేఖరు డుల్లమునందు నెంతయున్
ముప్పిరిగొన్నభీతి మునిముఖ్యుడు కౌశికుఁ డేమి సేయునో

యప్పగమేఘుఁడే చెలుఁగు నంతయు నెక్కడఁ బాసి వేగ నే
చొప్పునఁ బోద మింక మనసుద్ది యెఱుంగక యుండ నాతఁడున్. 61

క. ఎక్కడి హేమకురంగం, బెక్కడిమృగయావిహార మెక్కడివిపినం
బెక్కడి కేటికి వచ్చితి, మక్కట మిక్కిలి ప్రమాద మయ్యె న్మనకున్. 62

తే. నవవిరించి యరుంధతీనాయకుండు, మఱచి తప్పియు గాధిసమారువనము
చొరకు మీ వని చెప్పె విశుద్ధబుద్ధిఁ, గోరి నామీఁదివాత్సల్యగుణముపాదల. 63

క. ఇచ్చోట దడయ వలవదు, చెచ్చెరఁ బురి కేఁగుమనుచుఁ జెప్పిన నేలా
వచ్చితిని మృగము వెంబడి, వచ్చునె విధి గడవ నెంతవారలకైనన్. 64

తే. ఏమిచేయుదు నిక్కడి కేగుద, మేది కార్యచింత యింక మనకు
మిగుల మోస మయ్యె మృగయావిహారైక, కారణమున నేమి గాఁగఁ గలదొ. 65

ఉ. ఆమునిసార్వభౌమునిదృగంతము లించుక జేవురించినన్
హేమగిరీంద్రమైన ధృతి నేపఱి బిట్టు చలించు మ్రొగ్గు ది
క్సామజయూథమైన నడుసంఘము లైనను రాలు నాసుధా
ధామది నేశులైన గడు దల్లడ మందుదు రేమి చెప్పఁగన్. 66

తే. శర్వరీశకళామాళి గర్వమైన, నడచు కౌశికమౌని కే ననగ నెంత
యబ్ధి లంఘింప నోపిన యలఘుబాహు, బలున గతిదుష్కరమె చౌటిపడియదాట.

చ. మలయజశైత్యయుక్తములు మానసము ల్ప్రలయోష్ణభానుమం
డలకిరణాతితీక్ష్ణములు నాలుక లప్పుడు మౌనికోటికిం
దలప ననుగ్రహించు బితామహు జేయుదు రల్పు నైన బే
రలుక వహించు రేని కడు నల్పుని జేయుదు రప్పితామహున్. 78

ఉ. ఇప్పుడు పోయి యమ్మునికులేశ్వరు దలక మున్నె చేరి వా
తప్పక సన్నుతించుచు బదంబులఁ బ్రణమిల్లి యుండమో
చప్పుడు సేయ కీక్షణము సత్వరవృత్తి బొలంగ పోదమో
యిప్పటి కేది కార్య మది యుద్ధమతిం దగు నాచరింపగన్. 60

వ. అని విచారడోలాందోళితమానసుండై యున్న యమ్మానవేంద్రునిం గనుంగొని యమా
త్యశేఖరుం డగుసత్యకీర్తి విశుద్ధబుద్ధికి ప్రయోపాటవంబు దేట పడ వినయాలాపం
బు లని ట్లనియె. 70

క. ఓకమలాప్తకులాగ్రణి, మీ కేటికి నింతచింత మిన్నక వినుడ
స్తోకమతిని వివరంబుగ, నాకుం దెలిసిన తెఱంగున న్వినిపింతున్. 71

శా. భూపగ్రామణి వర్ధికల్పక మహాంభోరాశిగాంభీర్యరే
ఖాపారీణుడ వద్రిధీరుడవు లోకస్తుత్యసత్యవ్రతా

లావశ్రీవిభవోజ్జ్వలుండ విధి యేలా చింత తర్కించినన్
నీపై నల్లెదువారలుం గలరె యోనిత్యప్రతాపోదయా. 72

వ. అదియునుం గాక. 73

తే. శత్రుమిత్రత్వములు రెండు సమము గాఁగఁ, జూచి నిందాప్రశంసలను ద్రొక్కఁబడక
యుబ్బు నొందక యడవుల నొంటిఁ దిరుగు, మానులకు నేల నృపులతో మచ్చరంబు.

చ. జవర నీకుఁ గౌశికుదెసన్ భయ మేటికి నింత యాత్మలో
నునుపఁగ నామునిప్రవరుఁ డుల్లమునం గృప పిక్కటిల్లమీ
జనకుఁ ద్రిశంకభూవరు విశంకటశౌర్యుని బొందితోడనే
యనుపఁడె దేవతాపురికి నారసి చూడ మహాద్భుతంబుగన్. 75

క. విశ్వామిత్రుమీఁద న, విశ్వాసం బేల నీకు వివరింపగా
విశ్వార్థదాయకుండవు, విశ్వంభరఁ గలుగుమానవితతుల కెల్లన్. 76

తే. సాంవర్తన యీదుర్వ్యాచారతమము, వరవివేకకళాదివాకరుని చేత
నడఁచి యొక్కింత సేపు సౌఖ్యాన్వితముగ, విదఁ బొందుము నిరపాయముద్రఁ జెంది.

వ. అని పఙ్క్తిప్రధానాగ్రగణ్యు సముగ్రమనీషావిశేషభాషణంబు లాకర్ణించి యమ్మ
హీకాంతుండు చింతావర్జితస్వాంతుం డై సంతాపం బుడిగి నేత్రకమలంబులు ముకు
ళించి ముహూర్తమాత్రంబు నిద్రించి వాఙ్మాత్ర నాకర్ణింపఁ దరంబుగాని భయంకరం
బగుదుస్స్వప్నంబుం గాంచి బిట్టు మిట్టిపడి కలవరించుచు ధైర్యం బవలంబింపలేక
నలుదిక్కులు చూచుచు బాష్పజలపూరితనేత్రుండును బ్రకంపితగాత్రుండును నై
యొం డెఱుంగక యున్నయన్నరేంద్రుం గనుంగొని చంద్రమతి యతిత్వరితంబున

క. కెంజాయల నీ వెడుకర, కంకణంబునఁ గంకణములు ఘలుఘలు మన భూ
మింజయుని వెన్ను ఁజఱచుచు, నంజక భ్రమ యెల్లఁ దెలిపె నతిశయధృతియై. 79

తే. ఘటితనిర్మలభూరిముక్తాఫలప్ర, కాండసౌభాగ్యనిర్జితగగనసింధు
కంకణం బైననిజహస్తకంకణంబు, కరఁక నూడిచి రక్షగా బడిసివైచి. 80

సీ. ప్రాణేశ యేమరుపాటుఁ బూర్వంబిట్లు, బిట్టు మేల్కని యేల మిట్టిపడెదు
శరణాగతారాతిజనపాలభయహర, శాతదత్తుండవు సమగ్రమతివి
దుర్వారమదభూరికర్వాంధపరిపంథి, బాహుబలారణ్యపావకుఁడవు
సప్తపారావారసంవేష్టితక్షమా, చక్రసంరక్షావిచక్షణుఁడవు
గీ. నిత్యసత్యవ్రతస్తుత్యనిరుపమాన, సారగంభీరవాచావిశారదుఁడవు
ప్రబలధైర్యసుపర్వపర్వతుఁడ వీవు, భ్రాంతిఁ బొందంగఁదగునె నీకింతలోన. 81

క. అని తనభ్రమఁ దెలిపెడుసతిఁ, గని దుస్స్వప్నంబు గంటిఁ గమలానన నే
వినిపింతుఁ దత్ప్రకారము, విను మీవని తెలియ ధరణివిభుఁ డిట్లనియెన్. 82

సీ. మణిమయం బగుసభామంటపంబున వైభ, వోన్నతి నేఁ గొలు వున్న వేళ
గోపారుణాక్షుఁడై రుచిరార్కతేజుండు, ధరణీసురుం డొక్క డరుగుదెంచి
యదలించి ధరణిపై నస్మత్కిరీటంబు, పడఁ దన్ని మఱి బట్టి తిగిచి
కరము నిర్దయవృత్తిఁ బగము వెల్వడఁదోల, బహువిధాపత్పరంపరలఁ జెంది
గీ. యీశ్వరానుగ్రహంబున లేచి పిదపఁ, బూజ్యసామ్రాజ్యవైభవస్ఫురణ గంటి
ననుచు దుస్స్వప్నపద్ధతి మనుజవిభుఁడు, సర్వమును జంద్రమతితోడ సరవిఁ జెప్పె.
ఉ. చెప్పిన నంతయు న్విని కుశేశయలోచన కౌతుకంబు పె
ల్లొప్పమి నెంతయు న్భయము నొందియు నొందనియట్లు లాత్మలోఁ
గుప్పలు గొన్నధైర్యమున గొంకక భూమివివేకశక్తి వా
తప్పక పల్కె జేర వసుధావరుతోడ బ్రియోక్తివైఖరిన్. 84

క. ఏతన్మాత్రంబున కో, భూతలపురుహూత యింత పోలుపటిమ మదిలోఁ
భీతిల్ల నేల చెప్పెద, గౌతుక మొదవంగ వినుఁడు కలతెఱఁ గెల్లన్. 85
చ. అలుక జనించి వచ్చినధరామరవర్యుఁడు గాధిపుత్రుఁడు
జ్వలితమకుటంబు దన్నుటలు చయ్యన రాజ్యవిభూతి బాయుటల్
పలుమఱు దన్నిమిత్తమున బ్రాప్తము గాను బహుప్రయాసముల్
గలుగుట శాంభవమౌళికృప ప్రమత్తి రాజ్యరమావిశేషముల్. 86
వ. అని చంద్రమతి హరిశ్చంద్రుని దుస్స్వప్నంబు మాన్పి యూఱడించుచుం డెనంతనచ్చట
క. కోపంబున వెండియు గప, టోపాయం బొకటి యాత్మ నూహించుచు మా
యాపారీణత మీఱఁగ, దాపసవర్యుండు గాధితనయుఁడు వేగన్. 88

క. మాతంగకుంభకుచములు, మాతంగకరోపమానమహితోరువులున్
మాతంగయానములు గల, మాతంగవధూయుగంబు మహిమ సృజించెన్. 89
క. అన్నలినాక్షులు వాలుఁ, గన్నుల కెదిరింప లేనికతమున గాదే
పన్నగ భయమున బెడిస, చెన్నడు జలదుర్గభూమి శేమఱి వెదుకున్. 90
చ. శివశివ యావిలాసినులచిక్కనిచక్కనిగుబ్బచన్నులున్
ధవళమణీమణిబము నడల్చు మొగంబులు గెంపుమోవులుం
గువలయకాంతిసంపదలకుం గుదురైన నెడందకన్నులున్
యువజనధైర్యమూలముల నొక్కటఁ జెల్లగిలంగ జేయవే. 91
సీ. కొదమతేటుల దెచ్చి విదియచందురు దెచ్చి, విమలమన్మథసింగిణీపిండ్ల దెచ్చి
కలువపూవుల దెచ్చి ఘనచంపకము దెచ్చి, దాడిమీబీజసంతతుల దెచ్చి
జలజరాగము దెచ్చి బిసంబుల దెచ్చి ని, గ్భరశాతకుంభకుంభముల దెచ్చి

గీ. పుష్కరోర్మిల నావర్తపులినములను, గదళికాస్తంభముల శాలిగర్భములను
జిగురులను దెచ్చి కాని సృజింపరాదు, కమలజున కైనసాహంసగామినులను. 92

క. ఆనీలవేణులకు గల, గానకళానైపుణంబు గంధర్వసరో
జానలకు లే దింతయు, వీనులపండువులు సేయు విశదస్వరముల్. 93

క. చండాలత్వము దక్కగ, నొం డేమియు వెలితి లేనియొప్పులకుప్పల్
గుండలపతియును జాలఁడ, ఖండమతిం దద్విలాసగరిమ నుతింపన్. 94

వ. ఇవ్విధంబునం గనుపట్టు చండాలబాలికాయుగళంబు సృజియించి మానికుండాలుం
డానీలవేణుల కిట్లనియె. 95

సీ. పాటలి వినుఁడు నాపలుకులు దెలియంగ, గంధసింధురరాజగమనలార
చిత్తరివన్నెలు చెట్టి మీ రెంతయు, నొసపరిబాగులఁ బొసగ నేగి
జలజాప్తకులవార్ధిచంద్రు శ్రీహరిశ్చంద్రు, సద్భక్తి దర్శించి సంస్తుతించి
సంగీతవిద్యాప్రసంగము ల్ప్రచరించి, మృదుమధురోక్తి సంపదలు నెఱపి
గీ. వివిధలాస్యక్రియాకలాపములు చూపి, చేరి సంతోషితస్వాంతు జేసి యతని
నడుగరానిపదార్థంబు లడిగి ధైర్య, హీను గావించి బొంకించి యేగుదెండు. 96

వ. అనుటయు వల్లె యని యప్పల్లవాధరలు అమ్మునివల్లభునకుం బ్రణమిల్లి వీడ్కొని
సముల్లాసంబున. 97

సీ. చైతన్య మొందినశాతమన్యవశిలా, నిబిరుంబసాలభంజిక లనంగ
సంపూర్ణపూర్ణిమాచంద్రాస్యలై సంచ, రించునీలోత్పలశ్రీ లనంగ
జంగమత్వము గాంచి సౌభాగ్యవిస్ఫూర్తి, నుతిగన్న తాపింఛలతిక లనగ
బొలుపు దీపింపంగ బొమ్మ గావించిన, మకరకేతనుని ధేనుక లనంగ
గీ. బడతులకోటినినదసంపదల గదిసి, గిలుకుమట్టెలచప్పుళ్ళు గులుకరింప
గలికిరాయంచకోదమలగతులసొబగు, జేయునొసపరినడకల నేగుదెంచి. 98

క. చండాలిక లసమాయుధ, కుండాలిక లూరువిజితసురుచిరకదలీ
కాండాలిక లమృతాకర, ఖండాలిక లాస్యపాలు గనుగొని వేడ్కన్, 99

వ. అనుపమానవినయపూర్వకంబుగా బ్రణామంబు లొనర్చి కరకమలంబులు మొగిడ్చి.

మ. జయ మార్తాండకులావతంస విమతక్ష్మానాథనానాచమూ
చయపాథోనిధికుంభసంభవ సమస్తద్వీపవిశ్వస్తభూ
రియశస్సాంద్రవిజృంభమాణమతి వర్ణింపన్ సమర్థుండె యు
ర్వ్యయమై యొప్పు భవన్మహామహిమ సర్వాతాశనాధీశుఁడున్. 101

ఉ. నీరమణీయవైభవము నిర్జరవల్లభు గెల్చు నీమహో
దారత పారిజాతవసుధారుహముం బరిహాసించు నీశుభా

కారము చంద్రమండలముఁ గైకొన కుందు నటంచు మాటికిన్
నూరిజను లున్నతింప నినుఁ జూడఁగ వచ్చితి మయ్య వేడుకన్. 102

గీ. విపులధవళాతపత్రితవిమలకీర్తి, మండలుండవు మహితలాఖండలుఁడవు
నిన్నుఁ గనుఁగొనఁగంటిమి నృపవరేణ్య, మత్పురాకృతపుణ్యకర్మములకతన. 103

క. వీణెలు వాయింపంగఁ బ్రవీణత్వము గలదు మాకు వినిపించెద మ
క్షీణతరగానవిద్యలఁ జాణలు గాణలును మెచ్చి సంస్తుతి సేయన్. 104

వ. అని తదీయహృదయానుకూలభావం బెఱింగి యాలీలావతులు గంధర్వనితంబవతుల
కుం బ్రతిబింబంబు లై యత్యంతవిడంబంబున. 105

సీ. వీణెలగవుసెన లూడలించి చెఱఁగుల, మెఱుఁగురాఁ గాయలమీఁదుఁ దుడిచి
కుచకుంభముల మోపికొని తానములకును, జక్కఁగా బవడ పుసారె లొత్తి
శ్రుతి గూడఁ దంత్రులు నుడిగోళ్ల మీటుచు, జీవాళి బుట్టించి చెలఁగుగన్న
కంకణధ్వనులతోఁ గరపల్లవాంగుళు, లల్లాడ్చుచును నేర్పు లెల్ల మెఱసి
తే. మొనసి శ్రుతి లేదు మయ్యేదు మూర్ఛనలును, గలుగుముప్పదిగాగములవాని
మిత్రముల శుద్ధసారంగమేళనముల, మంద్రమధ్యమతారకమానసరణి. 106

శా. గాణ లెచ్చఁగ బాడి రంపు దొలకంగాఁ దాళమానంబులన్
క్షోణీనాథజయాంకసంకలితము ల్పూళాదిగీతావళుల్
వాణీపాణిసరోరుహాంగుళినఖవ్యాపారలీలారణ
ద్వీణాసంచితపంచమక్వణకళావిఖ్యాతకంఠధ్వనిన్. 107

తే. ఆ నవీనవిశేషగానామృతమునఁ, బొదలి యెంతయు నాశ్చర్య మొదవ నపుడు
వల్లకీదండములఁ బుట్టెఁ బల్లవములు, హారమణిపంక్తి కరఁగి నీరయి స్రవించె. 108

వ. ఇవ్విధంబునఁ బాడిన నవ్వెలివాడ చేడియలనిరుపమాన గానవిశేషంబులకుఁ బరితో
షంబు నొంది హరిశ్చంద్రధరిత్రీవల్లభుండుల్లంబున సంతసిల్లి వారల కనేకమణిమయా
భరణంబులుం గురంగమదఘనసారకాశ్మీరగంధసారతుషారనీరాదిసారభద్రవ్యంబులు
బ్రియం బెసంగ నొసంగి వీడ్కొల్పుటయుఁ జూచి మందహాసంబు చేసి యగ్గోసంగి
పడంతు లమ్మహీకాంతున కిట్లనిరి. 109

తే. ఈపదార్థంబు లేల ధాత్రీశ మాకు, వివిధభావజ్ఞమతకళావేది వీవు
బడలితిమి చాల నిబిడాతపంబుచేత, నీసితచ్ఛత్రి మొసఁగి మన్నింప వలయు. 110

చ. ధరణితలేశ నీ గొడుగు దక్కఁగఁ దక్కినవస్తువు ల్వరం
పరలుగ నెవ్వి యిచ్చినను బర్వినతాపము పాయ నేర్చునే
పొరిఁబొరిఁ గాయునెండఁ గడుఁ బొక్కె శరీరము వేడ్కె మా మొదం
గరుణ వహింపఁగాఁ దగు నఖండితదానకళాధురీణతన్. 111

క. అనుటయు నామాటలం, గనుఁగొని యుత్సాహ ముడిగి ఘనకోపముతో
మనుజాధీశ్వరుఁ డిట్లనుఁ, గనుఁగ్రేవలయందుఁ గెంపు గడలుకొనంగన్. 112

క. వృషమిపయిఁ దొల్లి యీగతి, నడిరినయాచకులు గలరె యనుచితమతి మీ
యెడఁదల నిబ్బరింపక, గొడు గడుగుట యెట్లు కండ క్రొవ్వున నన్నున్. 113

క. ప్రేమంబున యాచకులకుఁ, గామితవస్తువుల నొసఁగు కాలమునందున్
భూమీశుల కిది రానివి, చామరయుగళంబు గొడుగుఁ జెప్పింపంగన్. 114

చ. కడు నభిలాష మీర లడుగంగఁ దలంచినచామరంబులున్
గొడుగును దక్కఁ దక్కినవి గోరుఁడు వస్తువు లెవ్వి యైన నే
నెడపక యిత్తు నావుడు నహీనకుతూహల ముప్పతిల్ల న
ప్పడఁతులు పల్కి రిట్లనుచు భానుకులోద్భవుతోడఁ జయ్యనన్. 115

ఉ. శీతలవస్తుసంతతులచేత నడంపఁగ వచ్చుఁ గొంత యీ
యాతపతాపఖేదము ధరాధిప మన్మథబాణఘాతసం
జాతవియోగతాపమునఁ జాలఁ గృశత్వము నొందుమమ్ము స
త్కౌతుకలీల నీబిగువుఁగౌఁగిటఁ జేర్పు రతిప్రసంగతిన్ 116

వ. అనుటయుం గర్ణపుటంబులం గరంబులం జేర్చి యవ్విమలచంద్రుఁడు శివస్మరణంబు చేసి ప్రచండకోపంబునం జండాలబాలికలం జూచి మీర లర్థిముఖారిధారలు అని తిరస్కారంబు సేయ నేరక యూరకున్న నింగితం బెఱుంగక మదిరాపానవికారంబున శరీరవిస్మృతిం బొంది విప్రలాపంబులు పల్కెద రని వెండియు నిట్లనియె. 117

తే. దర్శనస్పర్శనములకుఁ దగరు మీరు, మీకుఁ గౌఁగిలి యిమ్మని మేలతలార
పలుక నాలుక లెట్లాడె భయములేక, తెలియ మీజాతి యెంత బుద్ధియును నంత.

క. మాచిన మీయం దిప్పుడు, యాచకముద్రావిశేష మణుమాత్రంబున్
దోఁచదు మీ రెక్కడిమా, యాచండాలాంగనలా మహోద్భుత మరయన్. 119

క. ఆయతకారుణ్యంబున, నీయపరాధంబులను సహించితి నికఁ బ
న్యాయోక్తు లేమి పల్కినఁ, గోయుదు నాలుకలు మిమ్ముఁ గొంకక నలుకన్. 120

చ. అనుటయు నాసరోరుహదళాక్షు లాకించియు శంక లేక య
బ్బిన మదగర్వము ల్వదల భూపతి దగ్గఱి పెక్కుభంగులం
గనుఁగవ లార్చుచు న్వివిధకామవికారవిధానకృత్యము
ల్గొనకొని చూపుచు న్మఱియుఁ గోర యకారణహాస్యలీలలన్. 121

సీ. పాలిండ్లపైఁ గింజలక్కపుంజంబు లెగయఁ, గేశపాశజాతము ల్దిప్పికొనుచుఁ
గడకంటిచూపుల జెడఁగొందువీనుల, తొడవు లొయ్యనఁ జక్కఁదోర్చికొనుచు
దోర్మూలగోచులు దుర్లలింతలు వెట్టఁ, జివుటమైఁదుఱుములు దిద్దుకొనుచు
నొసపరి బాగుగా నొసలఁ గస్తూరికా, తిలకంబు లొయ్యనఁ దీర్చికొనుచు

గీ. వలుదనుగుబ్బచనుదోయి వెలికిఁ దోఁప, జిలుగుపలిపంపుఁబయ్యెద జెఱఁగు జాఱ
పాపఁట లేఁజెమట లూరఁగ విసరికొనుచు, మసలుచుండిరి శృంగారరసపు మహిమ చెలఁగ.

క. ముద్దులు గురియుచు మురియుచు, నిద్దపుటద్దములలోన నీడలయొప్పుల్
పెద్దయుఁ జూచుచుఁ బైకొని, గద్దఱితనమున విలాసకళలు గొలంకన్. 123

ఉ. విందులుగాఁగఁ గర్ణపుటవీథులకుం బికనాదలక్ష్మికిం
బొందులుగాఁగఁ బల్లవికపుంగవమోదకళాభివృద్ధికిన్
మందులుగాఁగఁ జొక్కుచును మందమనోహరవిభ్రమంబులం
జిందులువాఱుచుం జిగురుచేతులఁ దాళము లొత్తి పాడుచున్. 124

తే. ధరణిపతి డాసి నరపాల తిమిరఁ దాను, తివిరి మోహించి వచ్చినయువతిజనుల
రతులఁ దేల్పక పూని తిరస్కరించు, టరసి చూచినఁ గాదె పురుషులకును. 125

ఉ. కావున మముఁ బ్రేమమునఁ గౌఁగిటఁ జేర్చి రతిప్రసంగలీ
లావిధంబున న్బహుకళానిపుణత్వము మీఱ నన్యథా
భావము లుజ్జగించి నిరపాయసుఖస్థితిఁ బొందు మూపరే
ఖావిధుబింబ మన్మథునిగర్వము సర్వముఁ బాయునట్లుగన్. 126

క. అంభోజముఖులు సమకుచ, కుంభంబులు రాయిడింపఁ గోరిక లఱగన్
బుంభావరతుల నినుఁ గడు, సంభావించెదము మాకుఁ జనవీవలయున్. 127

తే. మానవాధీశ యీలతామందిరంబు, రమ్యమై యున్న దిచ్చోటు రతివిహార
యోగ్య మీరీతిఁ దదయంగ నుచిత మగునె, యమ్మ విరహానలమున నోర్వఁగ లేము.

వ. అని యివ్విధంబున బ్రేలుచు వాలుఁగంటులు మహీపాలుఁ గేలంగీలింప నుద్యోగించుటయు నాలీలావతులతలం బెఱింగి నిలింపపతిప్రతిమానుం డగునబ్భానుకులాభరణుండు తాలిమి దూలఁగి యమ్మాత్రలెతలమదం బుడిపెదనని దర్వీకరభీకరతరకశాఘాతంబులం గాయంబులు జజ్జరీభూతంబులు సేయం దొడంగినం గనుంగొని యమాత్యపుంగవుం డగుసత్యకీర్తి కదియం జనుదెంచి కరసరోజంబు పట్టి సమ్మోటం దొలగం దిగిచి పోవైచి మనంబునం గారుణ్యంబు పూరించి నిలిచి. 129

మ. జననాథోత్తమ యేఁడువాఁడ్రపయి నీచందంబుగా నుగ్రతం
గినియం బాడియె శిక్ష కర్హులె వితర్కింపక స్మరోజేక్షణల్
విను మీ వల్గిన దుర్మదోద్ధతమహావిద్వేషిరాజన్యసై
న్యనికాయంబులమీఁదఁ గాక దగునే యన్యప్రదేశంబులన్. 130

క. త్రిదశేంద్రసదృశ నీ వీ, సుదతుల వారింప బూనుచొప్పు దలంపన్
ముదనాగ మరటికోదమల, విదళింపగ బూనినట్టి విధమై యుండున్. 131

సీ. ఈ వెలఁదుకలపయ్యెద లభిరాతిభూ, మీతలాధీశుల కేతనములె
యీపంకజాక్షుల యెలవంకబొమలహం, కారవద్వైరుల కార్ముకములె
యీకీరవాణుల కోకస్తనంబులు, మత్తారిగిరిదుర్గమండలములె
యీరాజముఖులమృదూరుదండంబులు, కపటవిద్వేషులకరికరములె
గీ. యీపడంతులకడకంటిచూపు లహిత, మనుజనాయకసునిశితమార్గణములె
వీఁగోపింప దగునె యుర్వీకళత్ర, కృప దలిర్పంగ జూచి రక్షింపవలయు. 132
మ. వల దీరోషము మానుఁడీ తగదు నావాక్యంబు లాలింపుఁడ
ర్థుల ప్రత్యర్థులకైన జూచిన మహాదోషంబు ప్రాపించు న
జ్వలకీర్తిశ్రీ యాచకప్రకటరక్షాదక్ష యీవేళకున్
వలయు న్నామకశేముషీపథమున న్వర్తింప శాంతస్థితిన్. 133
తే. అనుచు హితబుద్ధి నుడివి ప్రియంబు మీఱ, శాంతు గావించి మరలించె నచివుఁడధిపు
నంకుశంబున నూదినయంత భద్ర, దంతి మరలించునట్టిచందము దలిర్ప. 134
క. తదనంతరంబ ప్రియము, న్పరమలావణ్యవృత్తి వెలయఁ జంద్రమతియు శై
ల్లావ వెడుమతి నైపుణమున, హృదయేశ్వరు మోము జూచి యిట్లని పలికెన్. 135
సీ. ఎన్నఁడైనను వింటిమే మహీతలమున, గనకసారంగంబు గల దనంగ
నాయిట్టినెఁబడి నడిమూస నిచ్చోటి, కేగుదెంచితిమి విహీనబుద్ధి
నెక్కడిమాలెత లేతెంచి రీతాప, సాశ్రమభూముల కనుచితంబు
చండాలబాలికాజనముల కిటువంటి, చక్కదనం బెట్లు సంభవించె
గీ. విశ్వసింపంగ దగునె వివేకులకును, భూమిపాలక యిది గాధిపుత్రకపట
కృత్య మింతయు గానున్న నిట్టియున్కి, తమకు గలుగంగ నేర్చునే తలచి చూడ.
క. అపుడు వసిష్ఠమహాముని, విపులకృపాగరిమ బుద్ధి విలసిల్లంగా
నుపదేశించినపలుకులు, నృపవర తార్కాణ మయ్యె నిపు డిచ్చోటన్. 137
వ. అని పలుకుచుండ నమ్మాతంగతురంగలోచన లక్కడ దలంగి చని. 138
సీ. మురువేది వాఁడినమోము దామరలును, గడునొప్పిపొందినకాయములును
కొప్పులు వీడి చిక్కులుపడ్డకురులును, పీతరాగము లైనవాతెఱలును
జఘనమండలమున జాఱినచీరలు, ఘనరక్తసంసిక్తకంచుకములు
కెంగన యంగరాగములును మిగులఖిం, దము లైనకర్ణతాటంకములును
గీ. బాష్పధారలఁ దోఁగినపయ్యెదలును, ప్రీలి ముక్తాఫలంబులు రాలుసరులు
కలసి నాదంబు లెడలినకంఠములును, గలిగి యత్యంతదైన్యంబు క్రిందుకోరగ.
క. త్రిజగత్పవిత్రు నవపం, కజనేత్రు దపోవిశిష్టగాత్రు సముద్య
న్నిజతమ తేజోవైభవు, విజితప్రాభాతమిత్రు విశ్వామిత్రున్. 140

చ. కని మునిచంద్రి యీధరణికాంతుఁడు సుమ్ము మహోగ్రకోపియై
కినుక మనంబులో మిగులఁ గీల్కొనఁ దొత్తుల మొత్తుకై వడిం
గొనకొని మొత్తె సమ్మెటలఁ గొంకక నిర్దయవృత్తిఁ జేసి మొ
త్తినఁ గడు నొచ్చి వచ్చితిమి దిక్కు దలంపగ నీవు నావుడున్. 141

శా. ఏమేమీ మిము భూవరాధముఁడు దా నెంతే సహంకారియై
భీమస్ఫూర్తిఁ గశాభిఘాతములచే నిట్లుక్క నొప్పించె నే
యేమాడ్కి న్దయయించువాఁడొ యిఁక నూహింపంగఁ గల్పాంతవే
ళామృత్యుంజయఫాలనేత్రశిఖిలీలం బర్వుమత్కోపమున్. 142

వ. అని త్రిపురాసురవీరులపయిం గవియుఫాలలోచనుండునుబోలె నాభీలరోషావేశంబునం గరకమలాక్షమాలిక నేలం బడవైచి కనత్కపోలాంగరశంక నంకురింపంజేయు దృగంతంబు లంతకంతకుం గెంపు లీనుచుండ సమీపవాసు లగుతాపసజనంబులమనంబులు తల్లడిల్లఁ బ్రచండదండంబు చేతం బూని జటాభారంబు దూలి యాడఁ గటిమండలంబున వల్కలాంబరంబులు వీడం బడ్డు గొరుసుచుఁ బదంబులు దాటించుచుఁ జనుదెంచు నవ్విశ్వామిత్రుం గనుంగొని హరిశ్చంద్రుండు మృగేంద్రుంబుఁ గనుంగొనిన కరికలభంబు చందంబున నత్యంతభయంబును బొంది, 143

ఉ. మునిసామ్రాజ్యవిభూతు లెల్ల నిఁక నిమ్మౌనీంద్రుచేఁ జాల నా
శనముం బొందెదయుందునే యని మనస్తాపంబు దీపింప నొ
య్యన భార్యాయుతుఁడై యెదుర్కొనుచు సాష్టాంగంబు దండంబు పె
ట్టెఁ గోపంబునఁ దన్నె భూరిమణికోటీరంబు చిరంబునన్.

ఉ. తన్ని సమానసాబ్జమున ధైర్య మొకింతయు జాఱ నీక యు
త్పన్నతభక్తితో వినయ ముబ్బఁగ రెండియు మ్రొక్కె తీవ్రమై
సన్నరనాథపుంగవుఁడు హస్తసరోజయుగంబు మోడ్చి యు
ద్యన్నవభానుతేజుఁ డగుతాపసకుంజరుఁ జూచి యిట్లనున్. 145

చ. అనఘచరిత్ర మీమృదుపదాబ్జము మామకరత్నయుక్తకాం
చనమకుటంబుతో నొరసి చాలఁగ నొప్పి వహించె నే నొక
ర్చనయపరాధ మేది యిటు సేయఁగ నానతి యిండు నావుడున్
మునికులముఖ్యుఁ డట్టనియె మోమరుణాంబుజకాంతి నీనఁగన్. 146

శా. ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట రారో మద
క్రూరాభీలమృగాదులం దునుమరో ఘోరాటవు ల్చేవో మా
యారామంబుఁ గలంచి జంతుతతి మాయం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేఁడ వచ్చినను వారి న్మోఁదినా వేమిరా. 147

క. ఒకపొద మనంగ నేటికి, సకలాంగంబులును నొచ్చె సాహసవృత్తిన్
ముకమోడక నీచేసిన, సకుటిలకృత్యములు మాకు జర్చింపంగన్. 148

క. ధరణీశ చెంకదుడ్డుము, శరణార్థియునపెడుమాట సరివచ్చె మునీ
శ్వరబాధక మగునిను, శ్చంతము పరికింప మిగులసాహసి వరయన్. 149

ఉ. ఇలగలరాజు లెల్ల భజియింప మహోన్నతి జక్రివర్తివై
యలరుట యెల్ల దాపసజనాశ్రమభూముల కెగ్గుసేతకే
తలువ భవత్స్వభావ మతిదుర్నయ మారయ నివ్విధంబునన్
మెలగగ నీకు నెవ్వడు సమిద్ధమతిన్ సెలవిచ్చె జెప్పుమా. 150

ఆ. అసిమిగోస దొకటి యమ్మోడి నొక్కటి, నీచరిత్ర మెల్ల నేడు తెలియ
వచ్చె మాకు గపటవర్తనుడవు నీవు, చేర నిన్ను విశ్వసింప జనునె. 161

చ. నృపతులు తొంటివారలు విజృంభణలీల జమూసమేతులై
విపినముల న్వినోదగతి వేటమెయిం జరియించుచుండరె
తపసులయాశ్రమంబులకు దద్దయు నీవలె నిష్ఠురక్రియం
గృప హృదయంబులో విడిచి కీడు దలంపరు గాక యెన్నడున్. 152

క. మాయాశ్రమసారంగము, బాయక వెనువెంట దగిలి బడలించుదు గ
ర్వాయత్తచిత్తమడమున, న్యాయంబా నీకు మద్వనంబు చొరంగన్. 153

చ. అతిగులు గాల్చుచుం దలిరుటాకులు దుంచుచు పక్వమైనస
త్ఫలములు గోయుచు న్వివిధపాదపశాఖలు పట్టి యూచి ప
క్షుల బెదరంగ దోలుచు విశుద్ధసరోవరవారిపూరముల్
గలచుచు గాసి సేయుపలుగాకుల మాన్పవు నీదుభృత్యులన్. 154

వ. అదియునుం గాక.

మ. మరి నా పెంపుడుమూకలై వెలయు నీమాతంగవామాక్షులం
గరిణీయానలం బల్లవాధరల రాకాచంద్రబింబాస్యలన్
సరసాలాపకళావిలాసవిధుల న్సంగీతచాతుర్యలం
గరుణాహీనతం బట్టి కమ్మటుల వల్కం గొట్టంగాం బాడియే. 156

తే. ఆశ నర్థింప వచ్చినయట్టివార, కీప్సితార్థంబు లిచ్చుట యెల్ల మాని
నెట్టుకొని బిట్టు వాపోవం గొట్టు బెట్టు, రాజ్యమదమున నన్నుం దిరస్కరించి. 157

క. వికసితశిరీషకోరక, సుకుమారశరీరసారశోభాన్వితలన్
మొకమోడ మింత గలుగక, యకటా మోదంగం జేతు లాడెనె నీకున్. 158

ఉ. మామకగోపవహ్ని తలుమాఱును నుబ్బం దొడంగెం జేర్పు నీ
వేమెయి నింక నాయెదుర నెక్కడి కేగెదు దుర్మదాంధ యా

హైమవతీమనోరమణుఁ డడ్డము నిల్చిన నిల్చు సందియం
బేమియు లేదు పూని నిను నిప్పుడె ప్రాభవహీనుఁ జేసెదన్. 159

వ. అనిన నమ్మహీపతి సంవర్తసమయవర్తియుం బోలె మహోగ్రమూర్తి యైయున్న నమ్మునిచక్రవర్తిం గనుంగొని తదీయతనుప్రభాపటలంబు మిఱుమిట్లు గొలుప భయభ్రాంతుం డై యేమియుం బలుక నేరక నివ్వెఱపడి యూరక యున్న నాభూమింజయుం జేర మనస్తాపంబు మాన్పి హితోపదేశంబు చేయం దలంచి నిత్యసత్యవివేకవర్తి యగుసత్యకీర్తి యి ట్లనియె.

సీ. మనుజేశ నీవు మూఢునిరీతి నిట్లేల, మిన్నక భ్రమఁ బొంది యున్నవాఁడ
ఆపద ప్రాప్తించునప్పుడు ధైర్యంబు, విడువక మిగుల వివేకబుద్ధిఁ
దెలివిమై మెలఁగంగవలయు మానుషమున, దైవిక మటమీఁదఁ దప్ప దెపుడుఁ
గావున నిమ్మౌనికంఠీరవముఁ జేరి, ప్రార్థింపు మే నపరాధి ననుచుఁ

గీ. కాలకూటవిషాగ్నులఁ గడచు నితని, భీషణం బైనదుర్వారరోషవహ్ని
యితనిపై ద్రెవ్వఁ దలఁకుదు రేమి చెప్ప, హరివిరించిపురందరాద్యమరు లైన. 161

క. త్రాసుపయి దూఁచి చూచిన, వాసుకికంకణుని కెత్తువచ్చు నితం డో
వాసవవల్లభవంశజ, యీసంయమిఁ బోలఁ గలరె యెచ్చో దపసుల్. 162

మ. కరుణాపాంగనిరీక్షణస్ఫురణ నీగాధేయుఁ డొక్కింత యా
దరవృత్తిం గనుఁగొన్నయంతటన మోదం బార గల్యాణముల్
దొరకుం గా మానవలోకసంతతికి నస్తోకప్రభావుండు భూ
వర యీపుణ్యుడ యగ్రగణ్యు డరయ న్వాచంయమశ్రేణికిన్. 162

ఉ. నావుడు దెల్విబొంది నరనాథశిఖామణి ప్రేమ హస్తరా
జీవయుగంబు మోడ్చి మునిశేఖరు గన్గొని యోమహాత్మ నన్
గావ గదయ్య నావలన గల్గిన నేరము లెల్ల మాటికిన్
భావములో దలంపక యపారకృపారసమానసుండ వై. 164

క. మీకినుక కెదిరి నిల్వగ, నాకు దరం బగునె త్రిభువనస్తుత్య శశిశే
ఖరకల్ప శేషతల్పులు, నాకంపము నొంది భయము నందుదు రనిన్. 165

తే. తనయు డజ్ఞానియై చేయుతప్పు లెల్ల, గన్నతండ్రికి లోగొని కరుణ గావ
జనదె యిటు తూటికూరకు జంద్రహాస, మెత్తుదురె యేల నామీద నింతకినుక.

తే. మూఢమతి జెంది యపరాధములు గడంగి, నే నొనర్చితి జాల నజ్ఞాని నగుచు
వాని నన్నిటి లోగొని వత్సలత న, నుగ్రహింపుము మౌనిజనాగ్రగణ్య. 167

శా. మీరోషం బను శేషపన్నగము నామీద న్వడి న్రాగ నో
కారుణ్యాత్మక నే మహాభయముచేఁ గంపించుచున్నాడ నన్

జేరఁ గమ్మని నమ్మఁ బల్కి తనపైఁ జే చేర్చి యూరార్చి నా
నేరంబుల్ హృదయంబులో నిడక మన్నింపంగదే మ్రొక్కెదన్. 168

తే. పూని శరణంబు వేఁడెడువాని నెట్టి, దుష్టశాత్రవు నైన నాశిష్టవర్య
యెగ్గు లెన్నక మతిభయం బెల్ల నుడిపి, ప్రోచుటయు నుత్తమంబు కారుణ్యమతిని.

తే. తాపసోత్తమ నీదుచిత్తంబు రాదు, భాగ్య మిందాఁక దేవతాప్రణుతి గన్న
నిన్ను శరణంబు వేఁడెద నీళ్ళముంపు, పాలముంపుము వేయును బల్క నేల. 170

వ. అని హరిశ్చంద్రుండు సుతసతీసమేతుండై మహీతలంబున జాగిలిదండప్రణామంబు లతిప్రేమం గావించి లేవక దీనభాషణంబుల 'నన్యథా శరణంనాస్తి త్వమేవశరణం మమ' యనుచు బ్రార్థింప గొంతసేపునకు నమ్మునిదంతావళం బొక్కింతదయ నిజ స్వాంతంబునం గీలుకొల్పి శాంతభావంబు వహించుచు నారాజశేఖరు మహానుభావంబు మదిలో మెచ్చుచు నతనిశిరంబు కరంబున నెత్తి లే లెమ్మని యిట్లనియె.

తే. నీవు చేసినదోషంబు నీకయుండె, దీర్ఘరోషంబు మాకు సాధింప నేల
మొగమునం దున్న నీదైన్యముద్ర జూచి, కరుణ జనియించె గాంచితి ధరణినాథ.

క. ఘనుఁడవగు కతన నీచే, సినదుండగములు సహించి చేపట్టితి నే
మనుజేశ యింక నాచె, ప్పినవాక్యం బొకటి సేయు బ్రియము దలిర్పన్. 173

ఉ. క్షోణితలేశ నాయనుగుగూతుల వర్ణన సేయ నొప్పున
ప్రాణసిపువ్వుబోడులను బల్లవపాణుల జారుసైకత
శ్రోణుల గీరవాణుల మరున్మణివేణుల సర్వలోకక
ల్యాణుల నీకు నిచ్చెద బ్రియంబున వారి బరిగ్రహింపుమా. 174

క. నాపలు కుల్లంఘింపక, భూపాలక వారి బ్రీతి భోగనులుగా
జేపట్టి మమత నేలిన, గాపట్యము లేక నిన్ను గాచెద నెపుడున్. 175

తే. సూర్యకులవర్య నీమనస్థైర్య మెఱుఁగ, వలని యూరక బలికిన పలుకు గాదు
మాకు నానంద మొదవ నమ్మానవతుల, నాదరక్రియ దగ బెండ్లియాడవలయు.

వ. అని యివ్విధంబునం బలుకు నమ్మునీంద్రువాక్యంబు లమ్ములై కర్ణపుటంబులకు నసహ్యంబు లగుటయు నమ్మహీవల్లభుం డుల్లంబున దల్లడిల్లి డిల్లపడి యెల్లవిధంబుల గపటకృత్యంబులు గల్పించి యక్కల్లరితపసి చేయునుపద్రవంబు లాపాదింపక యిన్నెలవు దొలంగి పోవనీయం డే గాంచిన దుస్స్వప్నఫలంబు మిన్నకదొలంగునే యని కౌశికునిం గనుంగొని. 177

తే. క్షత్రియత్వంబు వర్జించి సంయమీంద్ర, తగునె నాకిప్పు డీమాటలెతల వరింప
నంటగా రానియన్వయం బకట యెట్లు, తెలియ కీమాట మీ రానతిచ్చితి రట.

సీ. అనినవిశ్వామిత్రు డవనీకళత్రుని, గినుక జనింప వీక్షించి పలికె
వివరించి చూడ భూవిభులకు దప్పణి, ఘనతరనిరయదుఃఖములు ధరణి

నాథ 'రాజ్యాంతాని నరకాణి' యని పల్కు, సలలితస్మృతివాక్యసంఘ మనదె
కావున నాకూర్జ్ఞ నీవెలవాడ లేఁ, జిగురాకుఁబోడులఁ దగ వరించు
గీ. పూజ్యసామ్రాజ్యసౌఖ్యసంభోగమహిమ, చెంగుటయె బుద్ధి దీనికిఁ జింత యేల
నెమ్మిఁ బరలోకసౌఖ్యంబు నమ్మి నేఁడు, దొరకులాభంబు విడుచు వేఁడలుఁడు గలఁడె
ఉ. సారవు సౌఖ్య ముంద ధరణీశ యజీర్ణముఁ బొందునంచు నా
హారము మాని పెల్లొదవుశాకటిచేఁ గృశమై చరించుటల్
సారవివేకమే తెలుపఁ జయ్యన నీయెలదీఁగెఁబోఁడులన్
గోరవలీలఁ గైకొనుము కాదు సుమీ మతి సంశయింపగన్. 180
తే. పసిఁడిమేడలలోనఁ బూఁబాన్పులందుఁ, బొసఁగ నీయిందువదనలఁ బొంది తేని
బొందితో డనె జంభారిపురికి నసుతు, వనఘ వర్త్మనుఁ దగుభవజ్జనకునట్లు.
తే. అనిన మనుజేంద్రుఁ డిట్లను మునివరేణ్య, మత్కులాచార మెడలి యామానవతుల
గూడియుండుట వివంప నోడ విడిచి, పదరు పట్టినయట్లపో త్రిదశవంద్య. 182
తే. కులము దిగఁద్రోఁచి మీమాటలెతల పరించి, కాంచు గీర్వాణలోకసౌఖ్యంబు లొల్ల
బంతమున రాజ్యమైన వర్జింతుఁ గాని, చలముకొని యెన్ని చెప్పినఁ గులము విడువ.
సీ. అనిన భూవర యట్ల యగుఁగాక నీ కింకఁ, దిరుగ నాడిన మహాదేవు నాన
నీస్వరాజ్యంబు నేఁటితో వర్జించి, తడయక మా కిమ్ము ధార వోసి
సామ్రాజ్యసంభోగసౌఖ్యంబె మాకొక్క, నీకారణంబున నేఁడు దొరకె
గరిమఁ దోరణములఁ గట్ట నంతేవాసి, జనులఁ బంప వలయు సంతసమున
తే. వసుధ ప్రజలుపుఁ దగ నాదవాలు గాఁగ, నెలమి నీయంగుళీయక మిచ్చి పసుపు
మాయుమైశ్వర్యపుత్రపౌత్రాభివృద్ధిఁ, బొందు మాచంద్రతారకస్ఫురణ వెలయ.
వ. అనుటయు నవ్విశ్వామిత్రునకు విశ్వంభరాకళత్రుం డిట్లనియె. 185
మ. తగ మీమానతి సేయుకంటెను బ్రశస్తం బైనపుణ్యంబు లీ
జగతిం గల్గునె నాకు బంధురతపస్సామ్రాజ్యసింహాసనం
బు గురుప్రాభవలీల నెక్కి మిగులం బొల్పొంద బ్రహ్మర్షివై
దిగధీశస్తుతకీర్తిఁ గాంచిన మహాతేజస్వి నీ వారయన్. 186
క. మీకోర్కె సలుపఁ గలుగుట, శ్రీకరబహుపుణ్యగణ్యచిరతరలక్ష్మిన్
జేకొనుట గాదె మునివర, యాకల్పము నాస నేఁ గృతార్థుఁడ నైతిన్. 187
ఉ. శ్రీలు తలిర్చుచుండ మునిశేఖర యొక్కటి దాఁక మున్న సా
శేలినభూమి గాదె యిది యిమ్ముల వన్ననసేల క్రిమ్మరం
బాలన మాచరింప మతిఁ బాయక వాంఛ జనించెనేని భా
మాలలనామనోరమణసన్నిభ గైకొనుఁ డెల్లరాజ్యమున్. 188

తే. తెల్లముగ మన్మనశ్శుద్ధిఁ దెలియఁగోరి, పలికెదరు గాక మీ కేమి భ్రాంతి యస్థి
రంబు లైనట్టియీ మహారాజ్యసుఖము, లనిన ధరణీశుఁ జూచి యమ్మునివరుండు.

మ. పెలవిం బాఱఁగ నవ్వుచుం బలికె నాక్షేపించి యీ నేర్పు మా
టలు మా ముందఱ సాఁగిరావు పెఱచోటం గాని భూపాల రా
జులలోన న్నిను సత్యవాఙ్నియతుఁ డండ్రుం జెప్పఁగా ముజ్జగం
బులయందు న్వినుచుందు మప్పలుకు దాఁ బొంకయ్యె నీపట్టునన్. 190

సీ. ఇనవంశ ముఖ్య నీ విచ్చెద నని పల్కి, జాఱ నాడఁగ నీకుఁ జను నె యిపుడు
మిన్నకఁ జన వియ్య నిమ్ము మిథ్యాలాప, శీలతారతుఁ గాఁగఁ జేసి కాని
'ఋషులు పల్కుతి నాస్తి మీ రేగుఁ' దనినను, బోయెద మాటలు వేయు నేల
యని పల్కుచుండంగ నావేళఁ జంద్రిమ, తీకాంత భూకాంతు దిక్కుచూచి

గీ. తపసి గావించు కపటకృత్యంబు లనెడి, యురులఁ దగిలితి మింక నేల యొండుతలఁపు
లేమి పలుకంగఁ జూచిన భూమిరమణ, బొంకు దొరయనిధైర్యంబు పూనవలయు.

క. మూఁడె నేమి యుఁ బలుకక, ధారుణి యంతయును గాధితనయున కిచటన్
ధారాపూర్వకముగ నని, వారితమతి దాన మిందు వసుధాధీశా. 192

క. మితభాషణుఁడు సంభృత, వితతార్థచయుండు నగుట వివరింపఁగ సూ
నృతసంపదయును వితరణ, చతురతయును గోరి కాదె సజ్జనుఁ డెందున్. 193

చ. మును ధర యేలి చన్న నృపముఖ్యు లనేకులు చర్చ చేసినన్
జనవర వారిలోన విలసన్మతి పొరగు లెవ్వ రైన సొం
పునఁ దమవింట మట్టిమొన మోపఁగఁ జాలినయంత మేరయుం
గనిచని రే ధరాతలము గొంకకు మీ యిల దాన మిచ్చుచోన్. 194

క. భూమితల మెల్ల మాయా, వామనవటుమూర్తి యైనవనజాక్షునకుం
బ్రేమంబున బలి యొసఁగఁడె, యామరతరువితరణక్రియాదీపితుఁడై. 195

ఉ. ధీనిధి యైనవిప్రున కతిప్రియలీల ధరిత్రి యొక్కడన్
జేనెడుమేర యిచ్చినఁ బ్రసిద్ధయశస్స్థితి వాఁడు పూని యం
భోనిధివేష్టితక్షితివిభుత్వము, మీఱఁగఁ దాన యేలు భూ
దానముఁ బోల లేవు మఱిదానము లెవ్వియు మానవేశ్వరా. 196

క. దశదానంబులలోపల, విశదాధికమహిమ నొప్ప వేల్పులలోనం
బశుపతిగతి భూదానము, వశమే తత్ఫలము తెలిసి వర్ణింపంగన్. 197

క. వసుధేశ పాత్రదానం, బొసఁగంగాఁ గలిగె మీకు నుర్వీచక్రం
బసదృశవితరణమహిమం, బెసగంగా ధారఁబోయఁ డెలమి దలిర్పన్. 198

వ. అనినిజహృదయానుకూలంబునునఖిలభువనభరితయశోమూలంబునునిత్యసత్యాలవాలం

బునుగా బడసిన నీలవేణివాక్యంబు లాకర్ణించి యమ్మహీకాంతుండు సంతోషిత స్వాంతుం డై, 199

క. ఆహా యీసతివిహిత, వ్యాహారము లెంత యొప్పె ననుకూలవరా
రోహలు గలిగిన పతులకు, నూహింప నలభ్యవస్తు వొకటియు గలదె. 200

క. తనచేయుధర్మమునకును, మనమున వెఱగొందుతలపు మాని ప్రమోదం
బొనగూడ మెలగ నేర్చిన, తనుమధ్యయె వానిపాలి దైవం బరయన్. 201

వ. అని పలికి తూర్ణంబుగ సువర్ణకలశంబుల పావనజలంబులు దెప్పించి దేవబ్రాహ్మణ క్షేత్రంబులు దక్క దక్కినధాత్రీతలంబు సర్వంబును సుమాము హైశ్వర్యప్రీతిగా మీకు సమర్పించితి నని యేర్పడం బ్రియపూర్వకంబుగా గౌశికునకు ధారవోసె నయ్యవసరంబున, 202

సీ. సారసౌరభముల సకలదిక్కులయందు, గురిసెను మందారకుసుమవృష్టి
దివి నాదితేయవాదిత్రనిర్ఘోషము, లక్షసౌఖ్యంబులు గాగ, బ్రబలె
గంధర్వగానముఖ్యక్రియాసహితంబు, లప్సరోనృత్యంబు లతిశయిల్లె
నింక వరుంధతిహృదయేశుడె జయించు, నని నభోవాణివాక్యములు చెలగె

గీ. నపుడు గాధిసుతుండు ధరాధినాథు, జిత్తసమ్మద మొదవ నాశీర్వదించి
వినుతి గావించె దుగ్ధాబ్ధివీచికాస, మానవాచాపగంపరామహిమ వెలయ. 203

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డట మీ దవృత్తాంతం బెఱింగింపుమనుటయు. 204

మ. కరహాటాంధ్రకళింగవంగరమణీకందర్ప పాంచాలబ
ర్బరహంసీగుణనాలతాంతశర సౌరాష్ట్రాంగకాంభోజగూ
ర్జరసౌవీరవిదర్భకోసలవయోజాతానవాదర్పకా
కురుకాశ్మీరమరాటలాటవిలసత్కోకప్రసీమన్మథా. 205

క. సుందరపర్వతధీర పు, రందరవిభవాభిరామ రతిరమణకన
త్సుందర కైలాసశర, త్కంధరసంకాశ విమలకమనీయయశా. 206

స్రగ్విణి. లింగమాంబాసుతా లేలిహానైకపా
దాంగ ధ్యానలీనాత్మ గాంగేయగ
ర్భాంగనానర్తకీహృజ్జిహ్వాస్థలీ
రంగ సారంగదృగ్రాజిమీనధ్వజా. 207

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్రకౌండిన్యమునిచక్రవర్తిగోత్రసకలసుకవిజనానీకమిత్రదేచనామాత్యకుమారవినయవివేకవిద్యాలంకారశంకరకవి నామధేయప్రణీతంబయిన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

[illegible library stamp]

శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.

---

శ్రీ మహనీయపార్థివ
హేమాచలరాజధైర్య హితబంధుజన
స్తోమామరధాత్రీరుహ
భామాజనపుష్పభల్ల బాచయయెల్లా.

వ. అవధరింపు మప్పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె.

క. ఆపగిదిం గొనియాడి మ, హీపతి వీడ్కొనుచు మునికులేశ్వరు డరిగెన్
భూపాలకమణియు నయో, ధ్యాపురమున కేగి సముచితస్థితి నుండెన్. 3

ఉ. ఆమఱునాడు కౌశికమహామునియుం గృతకాల్యకృత్యుడై
ప్రేమ దలిర్ప శిష్యజనబృందము గొల్వ వసుంధరాధిప
గ్రామణి పూని బొంక సమకట్టు నుపాయము నాత్మ గోపలన్
వేమఱు నుగ్గడించుచును వేడ్క నయోధ్యకు వచ్చె జెచ్చెరన్. 4

సీ. వచ్చిన సర్వంసహావరు గాంచి దీవింప, నత్యంతభయకంపితాంగు డగుచు
గద్దియ డిగ్గి భూకాంతుండు సాష్టాంగ, దండప్రణామంబు దగ నొనర్చి
మణికుంభపూర్ణనిర్మలజలంబుల నర్ఘ్య, పాద్యాదు లిడి మధుపర్క మొసగి
సకలవైభవముల సామ్రాజ్యసింహాస, నాసీను గావించి తత్క్షణంబ

గీ. సచివసామంతకింకరజనుల బ్రజల, వేగ రావించి వారితో విశదవాక్య
సరణి గౌశికునకు మహీచక్ర మెల్ల, ధారవోసినమార్గ మంతయును జెప్పె. 5

క. లోకముల కెల్ల నేలిక, యీకౌశికమౌనివర్యు డీతనిపదనా
ళీకములు గొల్చి యుండుడు, ప్రాకటతాత్పర్యవినయభక్తులు సాదలన్. 6

తే. మహనీయుక్తముగ నేను ధృతి దలిర్ప, విపినభూముల కేగెద వేడ్క ననిన
నధికశోకార్తులై వార లవనిభర్త, నడుగుదమ్ముల కెరగి యి ట్లనిరి బెదరి. 7

ఉ. పల్లలితప్రతాప ఘనసత్యవచోరచనాకలాప మీ
చల్లదనంబునం బ్రదికి సమ్మద మొందగ నేటిదాక నే

మెల్లమనోరథంబులు నహీనతఁ గల్గఁగ సౌఖ్యవృత్తిమైఁ
దల్లియుఁ బుంగుబిడ్డలవిధంబున నుంటిమి యేపు చూపుచున్. 8

క. దారుణశార్దూలమునకు, సారంగములట్లు మము విచారింపక యీ
క్రూరునకు నప్పగింపఁగ, నేరూపున బుద్ధి పుట్టెఁ గృప వదలి నృపా, 9

సీ. రుచిరామ్రపల్లవారుణజటాపటలంబొ, పాలుపొందు ధసితత్రిపుండ్రకంబొ
లాలితరుద్రాక్షమాలికాజాలంబొ, హరిసారంగచర్మాంబరంబొ
మరుచిరస్ఫటికాక్షసూత్రవితానంబొ, మండితదండకమండలువులొ
మహనీయజపహోమమంత్రతంత్రంబులొ, తరుణదర్భాంకురస్తబకచయమొ

గీ. తపమొ సంతతమానమౌదాత్రవ్రతంబొ, కందమూలంబులొ వ్రతోపకరణచయమొ
యడవులనె పాయకుండుసంయములకేల, వసుమతీనాథసామ్రాజ్యవైభవములు.

ఆ. ఇతని చిత్తవృత్తి నెఱిఁగి మే మేరీతిఁ, గొలుచువార మధికకోపి యితఁడు
మిహిరకులవరేణ్య మీ వెంటఁ దోడ్కొని, యరుగవలయు మమ్ముఁ గరుణ ననిన.

ఉ. తోయజగర్భతోడఁ దులఁదూఁగఁగ నొప్పెడు పుణ్యమూర్తి గా
ధేయుఁడు మీర లీతనియుదీర్ణమహత్వ మెఱుంగ లేరు గాం
గేయ వసుంధరాధరము గెంటిన గెంటు నమర్త్యసన్నుతా
మేయతపఃప్రభావమున మిక్కిలి మేటి మునీంద్రకోటిలోన్. 12

తే. ప్రియకవలసినఁ బ్రియభాష లుడిగి, నాఁడునుడివినమదువున నడపుఁ డనుచు
నుచితభంగుల వారల నూఱడించి, మనుజనాథుండు మునిశిఖామణికి మ్రొక్కె.

చ. వినయములొప్ప భూప్రజలు వేయివిధంబుల సేవ సేయఁగా
మునికులముఖ్య వైభవసమున్నతి రాజ్యము సేయుచుండి నేఁ
జనియెద నన్న లేనగవు సారెకు నాననపంకజంబునన్
జననము నొంద నిట్లనియె సంయమివర్యుఁ డవార్యవైఖరిన్. 14

చ. ఇలకు నధీశ్వరత్వము వహించిననాఁడు ధరించు టొప్పుఁ గా
నలబడి నేగుమీ కివి యనర్హము లేటికిఁ దాల్ప నిందు ని
ర్మలమతి నంచు నాత్మ ననుమానము లేక తదీయరత్నభూ
షలు నిఖిలంబు గైకొనియెఁ జయ్యన నిర్దయచిత్తవృత్తియై. 15

తే. కైకొనినఁ దాల్మి చెలఁగ భూకాంతుఁ డపుడు, సుతసతీయుక్తుఁడై గాధిసూనుపాద
పద్మయుగళికి మఱియును భక్తి మ్రొక్కె, పురము వెల్వడియల్లన నరుగు నెడను. 16

సీ. త్వరితంబ నృపుఁ గూడఁ బఱతెంచి యల్లన, నలుక జనింప సంయమివరేణ్యుఁ
డలనాఁడు నిను మేము యజ్ఞార్థ మడిగిన, ధనము నీయొద్దనే యునిచినార
మావిత్త మీయక పోవంగఁ జూచెద, విది వివేకములోనిదే తలంప

ధరణీశ మఱచితిఁ దలపింప వలదె య, న్యద్రవ్యమునకు దురాశ యేల
గీ. ఋణము దీర్పక యుండుట గుణము కాదు, మంచివారికి మది వివేకించి చూడ
నందులోపల మిగుల బ్రాహ్మణులసొమ్ము, నపహరించినఁ బ్రాపించు నత్యఘంబు.
క. భూవల్లభ మును ధరణీ, దేవుని కొడఁబడిన స్వాపతేయము పిదపన్
వేవేగ నీకయుంకిలి, గావించినఁ దలఁపరాని కలుషము లొదవున్. 18
తే. ఎఱుఁగ కొఱవించె నేనియు నినకులేశ, విప్రదత్తాపహరణ మూర్వీశ్వరునకుఁ
బాఱఁ గల్మష మొదవు సంశయము లేదు, మఱచి సర్వంబుఁ బట్టినఁ గఱవు కన్నె. 19
చ. అనిన నృపాలుఁ డమ్మునికులాగ్రణి పల్కెడు క్రూరవాక్యముల్
విని కర ముల్కి యాత్మఁ గడువేదన నొందుచు నోమహాత్మ మ
ద్ఘనతరరాజ్యసంపదలు దాఁచక సర్వము నీకు నిచ్చితిన్
దనివి వహింప కిట్టుఁ దగునా యపరాధము లెన్న మాటికిన్. 20
చ. ఉడుపతిమౌళిమూర్తి యని యొండుదలంపులు మాని భక్తి నీ
యడుగులు గొల్చి కీర్తిమహిమాధ్యుఁడ నయ్యెద నంచు నున్న నా
యెడ హృదయంబులోఁ గృప వహించి తపోధనవర్య సారెకుం
బెడదలు పుట్టి యిప్పుఁ బయిఁ బెట్టక యింతటఁ దృప్తిఁ బొందుమీ. 21
వ. అనిన బాలపరంగంబు నాలోకించు నాఖిలశార్దూలంబునుంబోలె నమ్మునిశార్దూలంబు
రోషాకారంబు వహించి హామ్మని యదలించి యిట్లనియె. 22
తే. నెయ్యమునఁ దొల్లి నీవు మాకియ్యకొనిన, ధనము వేఁడిన నిట్లాడదగునె నీకు
సత్యవాచాధురీణత జూపె దేని, విత్తమంతయు దెచ్చి వేవేగ నిమ్ము. 23
క. ఇలఁ బూర్వద్రవ్యమునకు, సెలవుగ నిచ్చితివె నిజము చెప్పుము నీమా
టలు నేటిదాఁక నసృతం, బులు పొరయవు నేఁడిదేల బొంకఁగ నీకున్. 24
చ. అనుటయు మేదినీరమణుఁ డామునివర్యుతలం పెఱింగి నె
మ్మనమున ధైర్యసంపదలు మాటికిఁ బాడుకొనంగఁ జేసి వం
దన మొనరించి యోమునిజనస్తుత యిప్పుడు శోకఁజేసి మీ
ధన మొసఁగంగ లేనిపకి తాపమునన్ మిము నిట్లు పల్కితిన్. 25
క. సంశయ మేటికి నోముని, వంశాగ్రణి యిచ్చెదన్ భవద్విత్తము నేఁ
ద్రింశద్వాసరముల కహి, మాంశుఁడు చంద్రుండు సాక్షి యిట్లీసున్నన్. 26
సీ. కొంచక మము విక్రయించి యైనను మీధ, నంబుఁ గైకొనుఁడు సర్వంబు నరిన
నట్లకా కని మానవాధీశు వీడ్కొలి, యరిగి సత్యగతి మరలి వచ్చి
యుర్వీశ పాదమె నా కొకవిచారము సమ, పార్జితం బగువిత్తమునుదినంబు
నన్న పానమ్ములకు నీవు వెచ్చంబుఁ, జేసిన నెంతయు మోసమరయ

గీ. ననుచుఁ దనశిష్యవితతిలో నధికకోపి, వివిధమాయాప్రకారప్రవీణబుద్ధిఁ
బరుషభాషణు నిర్దయు భయదచరితుఁ, గఠినచిత్తుని శఠుని నక్షత్రకుని. 27

వ. కనుంగొని కదియం బిలిచి తదీయకర్ణంబునఁ గొన్నికపటక్రియావిశేషంబులుపదేశించి నీ వీనృపకుంజరు వెనువెంటం జని యాయాయెడలవులం గూడంబడినధనంబు సర్వం బును వ్యయంబు సేయ నీయక ప్రియంబు దక్కి రయంబునం గైకొనుచు రేలుసుం బగళ్ళునుం బాయక నిరంతరపథపరిశ్రాంతులం గుందించియు క్షుత్పిపాసా పరవశత్వంబు నొందించియుఁ దాల్మి దూలించియు దైన్యంబు గీలించియుఁ గాంభీర్యంబు వదలించియు ఘనతరక్రోధంబున నదలించియుఁ ద్వింశద్వాసరంబులకు నిరవశేషంబుగ నితం డొడంబడినధనంబుఁ దెమ్మనినియమించియమ్మహీపాలునాలోకించి

డే. ఇతని మీవెంట దోడ్కొని యేగి భక్తి, గొలలు సాగంగ నను గనుంగొనినయట్లు
కనుగొనఁదగు నాయాసమునకునోర్వ, లేడు సౌఖ్యంబు జరపుఁడీ నేడు మొదలు.

మ. అని నక్షత్రకు నప్పగించి నృపముఖ్యా నిన్ను మద్భూమిలోఁ
ఘనదైన్యంబున నూళ్ళవెంట నడుగంగా నీను నీ వేవిధం
బున మావిత్తము జోకజేసెదవు నేర్పు ల్మీఱ దద్భంగి య
ల్లన నొక్కింత యెఱుంగ జెప్ప దగు నీలాగు ల్నిరీక్షించెదన్. 30

ఉ. ఊరక దీనతం బొరయ కో ధరణీశ్వర యింక నైన నా
కూరిమికూతులం గమఠకోలకవిస్ఫురణాపహాసి వ
క్షోరుహభారసంచలితసూక్ష్మతిమోదరల న్వరించి వి
స్తారవిశేషరాజ్యరమ సర్వము నిచ్చెద బూను నావుడున్. 31

మ. వనజాతాసన దీనిధీ వినుడు దేవబ్రాహ్మణక్షేత్రముల్
పనిలే వేమియు మాను మున్నె పివంపం తత్ప్రదేశంబులన్
ధనమార్జించి రయంబ మీఋణము సత్యస్ఫూర్తిమై దీర్చెదన్
ననుఁ బల్మాఱును మిన్న యేమిటికి సంతాపంబు బొందింపగన్. 32

తే. దయ మనంబున దలపక తలఁచితలచి, పట్టియిచ్చితిమును పన్ని వలదు మమ్ము
వెతల బెట్టఁగ దెగి సాగి వెడలనిండు, కినుక చాలింప్రదేవ మీకింకరుండ. 33

క. అని కౌశికు నొడబడ జెప్పి నరేశ్వరు డరిగె నాత్మ జెనగొనఁ ధైర్యం
బున నింకి యేమియు బలుకక, వనిత సుతసహితు డగుచు వనభూములకున్. 34

చ. మునివరుడుం దినేశకులముఖ్యునినిర్మలచిత్తశుద్ధికిన్
మనమున బాపురే యనుచు మస్తక మూచుచు దానయోధ్యకుం
జని నయమార్గశీలత బ్రజాపరిపాలన మాచరింప న
జ్జనినుతు సత్యకీర్తి బ్రియసంగతతో నియమించె చయ్యనన్. 35

వ. పురంబు వెడలి యదృశ్యాకారుండై ధారుణీశ్వరు వెనువెంటఁదగిలి చనుచు నతం డరుగు తెరువున నతిదుర్గమంబుగా భీషణపాషాణకంటకానేకవల్మీకతరుపుంజంబులు నిర్మించియు నెట్టుకొని తీవ్రాతపంబు గాయునట్లుగా నుష్ణకిరణునిఁ గట్టడచేసియు వాపీకూపతటాకపద్మాకరతరంగిణీహ్రదవారితంబులు శుష్కీభూతంబులు గావించి యా దుస్తరక్షుధాతురత్వంబును జెంది వన్యంబు లగుఫలంబులు గొని భక్షింపంబో యిన నత్యంతతిక్తంబులుగాఁ జేసియు నిరంతరభయంకరంబులుగా దుష్టమృగసము త్కరంబులఁ గల్పించియు నిర్దయస్వాంతుండై బహువిధంబు లగునంతరాయంబు లొనర్చుచుండె నయ్యవసరంబున. 38

సీ. వదలి క్రొమ్ముడి వీడి మాల్యంబులు. వేమాఱు మూపుపై వ్రేలియాడ
నీరము ల్దూఱుచో నెడలేమి నుత్తరీ, యాంచలములు కంటకావృతములుగ
ఘనతరాతపముచే గందినమైదీఁగ, నవిరళఘర్మబిందువులు వొడము
సోనలై సాంజనాశ్రుజలపూరంబులు, పాలిండ్లపై దిగి పాఱుచుండ
గీ. నందనునిఁ జంక నిడుకొని నడచి నడచి, యలసి యడుగొకయామమై యరుగుదెంచు
చంద్రమతిఁ జూచి యాహరిశ్చంద్రనృపతి, యుల్లమునఁ జింతయెంతయు నుప్పతిల్ల

సీ. భాసురమణిమయప్రాసాదనిశ్రేణు, లెక్కంగ నోప దీయిందువదన
కోమలశశికాంతకుట్టిమస్థలములు, మెట్టఁగ నోప దీమెఱుఁగుఁబోఁడి
మందిరారామసీమాసమీపంబుల, విహరింప నోప దీవిద్రుమోష్ఠి
పోషితనవకీరపోతంబుఁ గెంగేల, ధరియింప నోప దీహరిణనయన
గీ. నగము నెక్కుట నారోహణంబుఁ జేసి, మొనసి యేమాడ్కి గమనించి మొరపనేల
భయదకాంతారభూము లెబ్భంగి దటిసి, కొడుకు నేచందమున నెత్తుకొనియు వచ్చె.

సీ. సుమ్మెదగమి గొబ్బుధమ్మిల్లబంధంబు, చెదరె కుంతలములు చిక్కువడియె
శశిబింబకాంతికి సదనమై కనుపట్టు, వదనపద్మము వసివాళ్ళువాడె
క్రొక్కారుమెఱుఁగుఁ గైకొననితనూవల్లి, నిబిడాతపంబుచే సొబగు దూలెఁ
గెందమ్మిపూవుల గెలువంగ నూహించు, మృదుపాదతలములు మిగులఁ బొక్కె
గీ. పచ్చపగడంపుఁ గెంజాయ పగటుమోవి, పగిలి బీటలు వాఱె విభ్రమము దఱిఁగె
తాళనేర్చునె నానిమిత్తమున నకట, యవిరళంబైన యాయాస మావహిల్లె. 39

వ. అని చింతాక్రాంతుండై కాంతారత్నంబు నూరడించుచుఁ గరాంబుజంబు నవలం బంబుగా నొసంగ నిజభుజాపీఠంబునఁ గుమారుని నిడుకొని ధైర్యం బణుమాత్రం బను జెడగనీకఁజనుచుండె నంత. 40

తే. క్రీనగవు లేనిబడలికఁ దెచ్చుకొనుచు, గపటవర్త్మునిఁ దైవనక్షత్రకుండు
బెట్టునిట్టూర్పు లెచ్చుచు మిట్టలిట్టు, నేలఁగూర్చుండఁబడి మహీపాలుఁజూచి 41

చ. అలసితి నింక నొక్కయడుగైనను నే నడువంగ నోపమిం
గలయఁగ ఘర్మబిందువులు గ్రమ్మెఁ బదంబులఁ బొక్కలుబ్బె శీ
తలసవిధక్షమారుహవితానము నీడకు నన్ను జేర్పు భూ
తలపతిముఖ్య దేహమున దాహభరంబు జనించె నెంతయున్. 42

తే. నీవు మత్ప్రాణరక్షావివేక మాత్మ, సంభవించినయేని విశ్వంభరేశ
మేటిజవమున నరిగి యెచ్చోటనైన, విమలజలములు దప్పికి వెదకి తెమ్ము. 43

సీ. అనిన మహీకాంతుఁ డత్యంతదుర్వార, చింతాపరంపరాక్రాంతు డగుచు
జనపదం బైన గోష్ఠం బైన నొక్కటి, వెదకి చేరక యుండ విఘ్న మయ్యె
మునికుమారుఁ డింక మూఁడుమేరయు, నడవలే ననుచు నట్టడవిలోనఁ
గదలకయున్నాఁడు గడు ప్రమాదము పుట్టె, పథపరిశ్రాంతి యెబ్భంగి నణఁగుఁ

గీ. బై తరువుకానిఁగాఁగ నీలబ్రహ్మచారి, నేలఁ దోడనె పంపె మునీంద్రుఁ డకట
యేమి ప్రాపించునో యింక నీశ్వరాజ్ఞఁ, గడవ వచ్చునె యెంతటి ఘనున కైన.

కం. అని తల్లడించుచుండఁగ, నినకులవల్లభునిఁ జూచి యిట్లను హృదయం
బున దాల్మికలిమి వొడమగ, వినయోక్తులఁ జంద్రమతి వివేకస్ఫురణన్. 45

మ. నిరవద్యస్థిరసూనృతోక్తిరచనానిర్నిద్రధాత్రీతలే
శ్వర నక్షత్రుఁ డెంతయుం బడలెఁ దీవ్రం బైనయెండం గనూ
స్ఫురణం బెల్ల నడంగె నింక నడవం బ్రొద్దేమియున్ లేదు భా
స్కరబింబం బపరాబ్ధికిం జనియెఁ గెంజాయ ల్విడంబింపగన్. 46

తే. మునికుమారుండు డస్సిన మోస మరయఁ, బెంపు దూలంగ నిఁక నడిపింప రాదు
పుత్రుని నైన విడిచి నక్షత్రునిని, యెలమి రక్షింపవలయు నేఁ డిచట నిలిచి. 47

ఉ. శీతలనిర్మలాంబుకణసేచనకృత్యము లాచరించి ధా
త్రీతలనాథయాఁకటికిఁ దియ్యనిపండ్లును బెట్టి పల్లవ
వ్రాతవినిర్మితవ్యజనవాయువు లల్లన సోఁక ధీరతా
న్వీతమతి న్భజించి తగ వీతపరిశ్రముఁ జేయుఁ జేతనిన్. 48

చ. అనవుడు నట్లకాక యని యమ్మనుజేంద్రుఁడు నెమ్మనంబునన్
మునిసుతరక్షణప్రవణముఖ్యకృపావిభవంబు మాటికిం
బెనఁగొన నీటికందువ యభీష్టమతి న్వెదకం దలంచి కా
వనతరువీథులం గలయ నాలుగుదిక్కులు చూచుచున్నెడన్. 49

వ. వెనువెంటం దగిలి యదృశ్యాకారుండై చనుదెంచువిశ్వామిత్రుండత్యంతకోపాటోపం
బున నమ్మహీపతికి నంతరాయంబు లాపాదించు నుపాయంబు నిజస్వాంతంబున జింతించి

దంతఘాతసంఘము నొక్కనిశాటుఁ డవమాయాపాటవంబునం గల్పించి యానక్తం
చరున కిట్లనియె. 50

తే. తపనుఁ డపరాబ్ధిఁ గ్రుంకునంతనుఁ ద్రిశంకు, సుతుని మాయలఁ బెట్టి యిచ్చోటనిల్వ
దారుణం బైనయల్లబేతాళవటము, క్రింద నసియింపఁ బనుపు మీ రేయి నతని. 51

ఉ. హాలహలానలప్రతిమఁ దవ్వటభూజమునందు నున్న బే
తాళుఁ డఖర్వగర్వమున దైవతకోటుల నైనఁ బట్టి యా
ఖీలగతి న్వధించు నని పేర్కొన మర్త్యుల నేమి చెప్ప శా
ర్దూలము జింకలం బొదివిత్రుంచువిధంబునఁ ద్రుంచు నుగ్రతన్. 62

వ. కావున నీప్రయోజనంబు సమకూర్పు మనుటయు మహాప్రసాదం బని యాక్షణంబ

సీ. రమ్యభూతిత్రిపుండ్రము లలాటంబున, మహితరుద్రాక్షదామంబు లఱుత
విమలసారంగచర్మము కటీరంబునఁ, బాలఘనజటాపటలి మౌళి
సురుచిరస్ఫటికాక్షసూత్రంబు కరమునఁ, దరుణదర్భాంకురతతులు వ్రేళ్ల
నవకంపుఁ దామ్రకుండలములు వీనులఁ, బొందుగా నుదరబంధంబు నడుమఁ (?)

గీ. జెలువుదీపింప భానుమండలముతోడఁ, దనతనూదీప్తివితతి మంతనము వాడఁ
గపటవృద్ధతపోధనాకారుఁ డగుచుఁ, మానవాధీశుఁ డరుదెంచుమార్గమునను. 54

వ. మనోహరతపోవేదికాగ్రంబున వ్యాఘ్రచర్మాసనాసీనుండును సమీపవిన్యస్తదండ
కమండలుండును ముకుళీకృతనేత్రకమలుండును మిథ్యానియమజపధ్యానతత్పరుండును నై
యుండుటయు మార్గవశంబున వచ్చికనుంగొని యమ్మహీవరపుంగవుండు నతనినిక్కం
పుమౌనిగాఁ దలంచి వినయపూర్వకంబుగా నమస్కారం బొనర్చి కోరకితకరసరో
రుహుండై యిట్లనియె. 55

చ. విలయకృశానుతుల్య మగు వేఁడిమి నీనిబిడాతపంబు మి
క్కిలి తపియింపఁ జేయ నతిఖేదము నొందె శరీర మెల్లమీ
లలితకృపావలోకనములు న్నను గన్గొని సామనంబు శీ
తలముగఁ జేసి వత్సలత, దద్దయుఁ బ్రీతి ననుగ్రహింపరే.

ఉ. ఓఋషివర్య దుష్టమృగయూథసమన్వితనిర్మనుష్యకాం
తారములందు దుర్గమపథంబుల ద్రిమ్మరి మత్పురాకృతో
డాని విశేషపుణ్యముకతంబున దావకపాదపద్మముల్
చేరఁగఁ గంటి నొక్కఁడర జేరితి ధన్యుఁడ నై నావుడున్. 57

తే. పెద్దయును బొద్దువకు నేత్రబిసరుహములు, విచ్చి భూరిసంజ్ఞఁ జేసి భూవిభుని దిక్కుఁ
జూచి మాయాపరిజ్ఞానసురుచిరోక్తి, మహిమ నిట్లను బ్రత్యక్షమౌనికరణి. 58

క. ఎంతయు బడలితివి పథ, శ్రాంతి మహీకాంత పెంపు సడలి భవద్వ్య

త్తాంతం బంతయుఁ దెలిసితి, మంతర్వీక్షణకళామహత్త్వమువలనన్. 59
సీ. సాంద్రకీర్తిప్రథఁ జక్రవర్తిత్వంబు, గనిన యాహరిశ్చంద్ర మనుజపతివి
నీవు ప్రదాతవై నిఖిలరాజ్యము నొక్క, తాపసవరునకు ధారవోసి
యతనికి మున్న మఖార్థ మిచ్చెద నని, పలికిన విత్తంబు పడయఁగోరి
పురము వెల్వడి సతీపుత్రియుక్తుండవై, వారణాశీపురి కరుగుచుండ
గీ. ధనమునకుఁ గాఁగ నీమీఁదఁ దపసియాజ్ఞ, నైతరువు వచ్చి మునితనూభవుడు నొచ్చ
ఘనపిపాసాతురుండైన గాంచి బెగడి, వచ్చితివి నీరు వెదక భూవరలలామ. 60
వ. అనటయు నత్యాశ్చర్యంబును బొంది హరిశ్చంద్రుం డతనికిఁ బునఃపునఃప్రణామంబు లాచరించి మహాత్మా నీచరణారవిందంబులు సేవించి నక్షత్రకరక్షణార్థంబు భవదాశ్రమంబున నేఁడు విశ్రమించెద నని మఱియు ని ట్లనియె. 61
ఉ. ఈ వనవీథుల న్వెదకి యేను జలంబులఁ దెచ్చునంతకున్
జీవము నిల్వ నోపఁ డలసెన్ మునిపుత్రుడు దప్పి జెంది తే
జో విజితార్కనా కపయశోదంతంబులు రాకయుండ మీ
పావనకుండికాజల మపారకృపారతిఁ బోయఁగాఁ దగున్. 62
చ. అనవుడు మందహాసముఖ నక్కపటాత్ముడు భూమిపాలుతో
ననియె దినేంద్రవంశజ రహస్యమున న్మునివృత్తి పూని కా
ననముల నున్నమా నెలవున న్వసియింపగరాదు మీకు నె
మ్మనమున మా కపాయమగు మానినులం గనుఁగొన్న డాసినన్
మ. సలిలం బల్పము మత్కమండలువులో సర్వంసహాధీశ త
జ్జలపానంబున మానినందనున కేచందంబునం దీఱెడిన్
దలమై పర్వినదప్పి యప్పలుకు దాఁ దర్కించినం బుద్ధి యే
తెలియం జెప్పెద నీటికందువ మనోదేశంబు మోదింపగన్. 64
సీ. వినుమిచ్చటికి గూతవేటుదూరంబున, గల దొక్కహ్రదము నిర్మలజలంబు
తత్తీరభూమి విస్తారశాఖలచేత, విలసిల్లు నొకవటోర్వీరుహంబు
పుత్రకళత్రనక్షత్రకసహితుఁడ, వై యల్లనల్లన నచటి కరిగి
మార్గపంశ్రాంతి మానునట్లుగ బయఃపానం బొనర్చి యాపాదపంబు
గీ. క్రింద వసియింపు మీరాత్రి నృపవరేణ్య, యచటు దక్కఁగ నీకు నన్యప్రదేశ
మిరవు గాదని చెప్పి యదృశ్యు డయ్యె, గవటసంయమి యైనన క్షత్రచరుండు. 65
క. ఆయెడ నానాపక్షిని, కాయములు కిశోరయుతముగా మేఁతలకుం
బోయినవి మరలి వచ్చి తు, లాయంబులు చేర గలకలధ్వను లెసగన్ 66
క. మనుజపతి పొందుదుఃఖము, గనుగొనగా లేక చనిన కైవడిఁ జనియెం

తనకిరణనికర మెఱయ్యొ, య్యాన మణువుచుఁ దపనబింబ మపరాంబుధికిన్. 67

సీ. కంధరపటలసంకాశంబు లగునంధ, కారము ల్తోరణగట్టె దిశల
వ్యోమసీమం బెల్లఁ దామె రైయె తారక, స్తోమము ల్నిండి తోడ్తోనఁ బొదలె
విరహాగ్నిశిఖలచే వేఁగి రథాంగపరంపర, ల్మిగుల దుఃఖింపఁ దొడఁగె
భీకరానేకవల్మీకరంధ్రింబులు, వెడలి చరించె దర్వీకరములు

గీ. వెల్లఝిల్లీనియవము ల్పిక్కటిల్లె, మిగుల దఱుముగ ఘూకము ల్మెలఁగె యాడె
నిబిడముగ శాకినీఢాకినీపిశాచ, భూతబేతాళసంచారములు చెలంగె. 68

వ. ఇట్టిభియంకరనిశాసమయంబున నమ్మహీరమణుం దక్కపటతపోధనుండు చెప్పిన వటవిటపిచక్కటికిం జన నమశట్టి పట్టిం దనభుజంబునం బెట్టుకొని నక్షత్రపుని వీఁపున గదియించి చంద్రిమతిం జెట్ట బట్టుకొని నిజభుజాదండమహోగ్రమండలాగ్రప్రభాపటలవిరళీకృతదుర్గమమార్గాంధకారుండై చనిచని. 69

తే. మత్స్యకచ్ఛపభీకరమకరనికర, సంకులంబును వన్యైభసలిలపాన
గళగళధ్వానపూర్ణదిక్పథము నైన, హ్రదముఁ గన్గొనెఁ దనదుకట్టెదుర నృపతి. 70

మాలిని. తోరములై వికసించినకైరవతోయరుహంబులు షట్పదఝుం
కారములుం బహుళంబుగఁ బర్విడుక్రొంచరథాంగబకప్రిజసం
చారములు న్వటసాలరసాలకుచందనభూజవితానలస
త్తీరములుం గడు సొంపు దలిర్ప నుతింపఁదగున్ హ్రద ముజ్జ్వలమై. 71

వ. ఇవ్విధంబున నున్న హ్రదంబుం గనుంగొని. 72

సీ. తత్తీరభూమి నందఱ నిల్పి వారికి, సలిలపానక్రియాసౌఖ్య మొసఁగి
తానును బ్రిక్షాళితశరీరు డగుచునా, యంకాలవిధులు చయ్యనొనర్చి
మధురంబు లైననిర్మలజలంబులు గ్రోలి, యధ్వపరిశ్రాంతి దపనయించి
ధైర్యవివేకగాంభీర్యముల్ హృదయాన, విందంబులోపల పందడింప

గీ. మానినందనునకుఁ జంద్రిమతికి లోహి, తాస్యునకు నిద్రపోవ నర్హస్థలంబు
వెదక దగు నని యొయ్యన వదన మెత్తి, కోరి నలుదిక్కులను గనుంగొనెడితఱిని. 73

ఉ. ఓలి ననేకఘూకనివహోగ్రరవంబులు గోటరాంతరా
ళీంభఙంగసూత్కృతులు బెల్లుగ నొక్కట బిక్కటిల్ల భూ
తాళి నాలయం బగు పురారికి నైన భయంబు జేయు బే
తాళవటంబు గాంచి వసుధానిలనాథుడు నిర్భీతచిత్తుఁడై. 74

క. బహువిధశాఖాపటలీ, పిహితాఖిలదిక్తటంబు బేతాళవటం
బహిమకరకిరణసముదయ, విహారదుర్గమజటంబు వీక్షించె దగన్. 75

వ. ఇట్టి ఘోరమహాపాదపంబు నిరీక్షించి యవ్వసుంధరాధ్యక్షుండు. 76

తే. కడగి సాహస మొదవ శంకావిహీన, మానసుండయి చేరి యామ్రానిక్రింద
శీతకసవున శయ్య గల్పించుటయును, సారది నక్షత్రకుండందు సుప్తుఁ డయ్యె.

చ. ధరణీతలేశుదేవియును దత్పరపద్మసమీపభూస్థలిం
బొరిబొరి గ్రిమ్మదుఃఖమునఁ బుత్రుఁడు దానును నంశుకాంచలా
స్తరణమునంగు హస్తముపధానముగా నొనరించి వెండి దు
స్తరమగునాకటం బడలి దైవము దూఱుచు సుప్తిఁ బొందినన్. 78

మ. అపు డాచందనగంధి గంధకరిణీయానం గురంగాక్షి వం
శపవిత్రిన్నవపల్లవాధరపుట న్సంపూర్ణచంద్రాననం
జపలావల్ల్యుపమానదేహలతికన్ జాయన్విలోకించి యా
నృపవంశాభరణంబు మానసములో నెంతేవిచారంబునన్. 79

తే. అధిక మైనపథశ్రాంతి నాదమఱచి, సుప్తి నొందెదువీరి కిచ్చోట దుష్ట
మృగపిశాచభయం బంకురింపకుండ, గావదగు నాకు జాగరూకత్వమునను. 80

చ. అని తలపోసి భాస్కరకులాగ్రణి యుగ్రకృపాణపాణియై
యనిమిషవంద్యు జంద్రధరు నార్తజనావనదక్షు శంకరున్
మనమున నిల్పి నీవగతి మా కని పల్కుచు నాల్గుదిక్కులుం
గనుగొనుచుండె నెచ్చరిక గల్గి తలంకక వీతనిద్రుఁడై. 81

ఆ. అంత నర్ధరాత్రమగుటయు నవ్వటో, ర్వీరుహంబు నందు విడువకుండు
భయదవికృతభూతచయము లూడల వెంట, నవనిభాగమునకు నవతరించి. 82

వ. ఇంతకాలంబునకు నిచ్చోట మనుష్యసంచారంబు కలిగెననిపరస్పరాహ్వానసంభ్రమంబులు భయంకరహుంకృతిధ్వానంబులు ననూనంబులై దిశల జెలంగ నమ్మానవేంద్రుని గదిసి పొదివిన.

తే. శంక యొక్కింతయును లేక పంకజాప్త, కులవరేణ్యుం డుతద్భూతకోటి నెల్ల
డగ్గఱకయుండఁ దఱిమె గాఢప్రతాప, వైభవంబున నెంతయు వాఁడి మెఱసి. 84

క. ఈయధమపిశాచంబుల, బాయక వధియించు టేమి పార్థివ మని తా
గోయుచు భుజగేంద్రమహో, గ్రాయతకౌక్షేయకమున నబ్భూతములన్. 85

వ. తూర్ణంబ కర్ణనాసికాచ్ఛేదంబు గావించుటయు నత్యంత ఖేదంబును బొంది నిజాధీశ్వరుండగు భేతాళునకు నన్నియుఁ దెలియ విన్నవించుటయు నతండును భీషణరోషావేశంబున.
86

శా. ఎట్టెట్టూ మిము నొక్కమానవుఁడు దా నెంతే నహంకారియై
బిట్టుల్కుం దెగియింత చేసెనె కదున్ భీభత్సరూపంబుగాఁ

గట్టా యేగతి నింక వాఁడు నిలువంగా నేర్చు నాముందటన్
జట్టల్ చెదవఁ బొట్ట వ్రచ్చెద భుజాశౌర్యం బవార్యంబుగన్. 87

ఉ. వెఱ్ఱితనంబు గాక యగవింపజా కైనను జేరరానినా
ముట్టికెలంకున న్మనుజమాత్రునకు న్నిలువంగ వచ్చునే
యిట్టికి నుండ శక్యమగునే వివరింప నివంగిచెంగటన్
జుట్టెదవఁ దత్తనూపతిలశోణితధారలు పొట్టనిండఁగన్. 88

శా, ఇం దాశూలికినైన విచ్చలవిడిన్ హేలం జొరంగ రాదు ని
స్సందేహంబుగ నావటంబు నరుఁ డేవాడం బ్రవేశించెనో
యొందు న్నిక్కి కేలి యద్భుతంబు మది నూహింపఁగ వంటింటిలోఁ
గుందే ల్పొచ్చినచంద మయ్యె నిది పెక్కు ల్మాట లింకేటికిన్. 89

వ. అని భయంకరాటోపంబులు చేర్చి పెల్లార్చుచు భూతప్రేతపిశాచఢాకినీసంఘాతం
తంబులు గణనాతీతంబు లై సేవింపం బెంపు మిగిలి. 90

సీ. పరుసనిజాంజాలపల్లవెండ్రుకలజొం, పము మారుతమునఁ గంపంబు నొంద
విలయమేఘాకృతిఁ దలఁపింపగాఁ జేయు, నొడలిపైఁ జీఁకటి ముడివడంగ
జండ్రనిప్పులకంటె వేఁడ్రంబు లైట్టి, కన్నులఁ గోపాగ్నికణము లురులఁ
బేరువులు నరములుఁ బెనఁచినతలకాయ, పేగులు గళమునఁ బెనఁగొనంగ

గీ. నుడుగ కందంద త్రావుచో నురముమీఁద, వడద లై గోత్రనెత్తురు గిరికొనంగ
గత్తుముల నున్నకుణపంబులఁ బచికలచి, పలలకబళంబు మెసఁగుచు భయదభంగి.

తే. కాలసర్పంబులోడుత మేల మాడఁ, జాలుజాతత్రిశూలంబుఁ గేలఁ బూని
ప్రబలహుంకారఘోషంబు ప్రళయసమయ, మేఘగర్జాధ్వనులకు నామ్రేడితముగ

వ. దీర్ఘనిర్ఘాతపాతస్థూలచరణఘట్టనక్రియావిహ్వలీభూతపాతాళుండై యేతెంచు నవ్వే
తాళునిం గనుంగొని నిర్భయహృదయాంతరాళుండై భూపాలుం డప్రమితసమస్త
విరోధివరూధినీజాలం బగుకరవాలంబు జళిపించుచు. 93

తే. అభిముఖుంబుగఁ గొంతద వ్వరిగి వాని, కడ్డమై నిల్చి యిటరాక యరుగుమోరి
నిగిడి యరుగక వచ్చిన నీదుప్రాణ, వాయువులఁ గ్రోలు నాదుకౌక్షేయకాహి. 94

క. వావుడు నవ్వేతాళుఁడు, భూవల్లభుమోముఁ జూచి పొరిఁబొరి ఘనరో
షావేశం బొదవఁగ గను, గ్రేవల గడు నిప్పు లురుల గొగలుచు బలికెన్. 95

సీ. ఎవ్వఁడ వీవు నా కెదిరి భాషించెదు, శంక యింతయు లేక సాహసమున
బులి యున్నపొదరిల్లు అలి జింక చొచ్చిన, కతి జొచ్చితి మదీయగహనభూమి
నెక్కుడి యేగెద వింక నాముందఁగ, మ్రింగెద నహి కప్ప మ్రింగుకరణి
గీర్వాణగంధర్వకిన్నరపన్నగ, యక్షరాక్షసముఖ్యు లైన నన్ను

గీ. వెనక వెఱకుదు నీ విట్లు చెనక ననునె, నాపవిహంగచుమత్తే క్రిందనె వసించి
తివిరి తద్రక్షణఖ భూజనివహములకు, భంగపఱిచితి నామిత్రబాంధవులను. 96

క. శంకరుఁ డడ్డము వచ్చినఁ, గొంకక వారించి నాపురోభాగ్యనికి ని
శ్శంక నినుఁ బట్టుకొని యే, యంకిలియును లేక వేల్తు నాజ్యాహుతిగన్. 97

చ. అని భయదాట్టహాసములు నార్పులు బొబ్బలు హుంకృతిధ్వనుల్
గొనకొని పర్వ గర్వము నఖండతశౌర్యము నుప్పతిల్ల ను
బ్బున నిజకింకరోగ్ర బహుభూతచయంబులతోడఁ గూడి య
య్యనకులవల్లభుం బొదువ నిట్లని పల్కె నృపాలుఁ డల్కతోన్. 98

క. ఏనెక్కడ నీ వెక్కడ, మానవసామాన్యుఁ డనుచు మదమున నెఱుగం
గానేరక ననుఁ బొదివెద, హీనమతిం దొలఁగి యరుగు మెందుల కైనన్. 90

వ. అని పల్కిన నమ్మహీపతిని పైఁ గవిసి. 100

సీ. కినుకమై శూలంబు గేల నంకించు నై, చినఁ గలంగక దాని దునిమె నృపతి
మఱియును నత డొక్క మ్రాను పెఱికి త్రిప్పు, వంశజానుగము తీవ్రముగ గొట్టె
దద్ఘాత గదలక ధరణీరుహముతోడ, వానిహస్తము మహాజాని నఱికె
నందుచే గుందియు నతఁడు కొండవ చేత, దఱచుగా బాషాణతతులు పఱపె

గీ. నాశిలాతతు లన్నియు బాసి పోవ, బెడిద మగువాడియడిదంబు జట్టు త్రిప్పి
చేరి ఖండించె నానృపశేఖరుండు, చాలభీకర మైనబేతాళుశిరము. 101

వ. ఆసమయంబున మఱియును జలపట్టి యగ్గాఢివట్టి దయావిహీనస్వాంతుండై దుష్కరంబు లగు పుష్కలావర్తపయోధరచయంబుల భయంకరంబుగా వర్షంబు గురియ నియమించిన. 102

సీ. ఘుమఘుమాత్కారనిర్ఘోషభీషణమున, స్తోమసంఛాదితవ్యోమతలము
సంవర్తమృత్యుదంష్ట్రాకృతిప్రతిమాన, శంపాపరంపరాసంవృతంబు
కులసామమద్గుణకులమహాధ్వనిహేతు, పటుఘర్ఘరపాత్రపటల
మాశామదావళహస్తనీకాశవా:, పూరధారాసిక్తభూతలంబు

తే. తీవ్రతిమిరచ్ఛటాసక్తదిక్తటంబు, పృథులవర్షోపలానీకభీకరంబు
ఘనతరాభీలదుర్దమకర్దమంబు, కురిసె వర్షంబు ధర గుండ గూల్చినట్లు. 103

క. వేళ్ళకు బెదపెదమ్రాకులు, పెల్లగిలం గమ్మ నెల్ల పెళపెళ విఱుగన్
బల్లిదపుగాడ్పు లేదును, బెల్లుగ జెలరేగి వీచె భీకరభంగిన్. 104

ఉ. ఆసమయంబున న్నరవరాగ్రణి తా వటబీజమాత్రమున్
వేసట లేక ధైర్యము వివేకము సత్యవచోవిలాసముం

బాసటయై సుయోగతిని బాదుకొనంగ విపన్నరక్షకున్
వాసుకికంకణు న్మదనవైరి సుమార్గమణుం దలంచుచున్. 105

తే. వాన దడియుచు గజగజ వణకుచున్న, సుతసతీమానిభృత్యుల జూచి వగచి
తొడలపై నిడుకొని వాంఛ ముదుగ, నూఱడించుచు దలకక యుండుటయును.

క. సూర్యకులధర్మ్యమ్మానయ, స్థైర్యంబున కాత్మ గాధితనయుడు కడు నా
శ్చర్యమును బొంది యీనృప, వర్యుని బోలంగ గలరె వసుధాధీశుల్. 107

తే. తగిలి నాచేయుకపటకృత్యముల నొగిలి, చిక్క దయ్యె వృథాశ్రాంతి జెంది యకట
వేగ నై యీయరుంధతీవిభునితోడ, గలహ మేల యొనర్చితి దెలియ కేను. 108

మ. పురుహూతాదిమపర్వులున్ మునిజనంబు ల్భీతి బొందంగ నే
దురహంకారము రాజసంబు జలముం దోడ్తోన యుబ్బంగ దు
ష్కరసంధానవచనంబు లేమిటికి మాత్సర్యంబునం బల్కితిం
జీ కాలార్జిత మైనమత్తపము స క్షీణంబు గాకుండునే. 109

క. మానుగ గార్యాకార్యము, బూనిన మది దెలిసి యూడ కొగి పెద్దలతో
దా నూగక కలహమునకు, బూనెడువా డపజయంబు బొందకయున్నే. 110

తే. ఇంక విస్పంశయంబుగ ఋషివరేణ్య, డగువసిష్ఠుప్రతిజ్ఞాక్రియానిరూఢి
నెఱయు నీశేడుభువనపర్ణితము గాగ, ననుచు దనుదాన నిందించుకొనుచునుండె. 111

వ. అంత. 112

ఉ. సారెకు గూయ జొచ్చె బరుపధ్వని గుక్కుటరాజి మౌక్తిక
శ్రీరుచి వేగుజుక్క పొడిచెం దలచూపె ననూరురేఖ కా
సారతరంగిణీవిటపిసంతతి బ్బ్వ శకుంతనాదముల్
దూరము లయ్యె జీకటులు దూరుపు దెల్వి వహించె వేగవన్. 113

క. అరవిందవనం బింపెం, దిరముల కామెతలు పట్ట దిననాథుడు ప్రా
గ్ధరణీధర శిఖరంబున, నరుణచ్ఛవి బొలిచె జనుల కతిముద మొదవన్. 114

తే. సూర్యు డుదయింప నృపతియ దోచ్చటువాసి, యరిగి మురుంవఱనొకసరోవరము గాంచి
యందు సంధ్యాదినిత్యకృత్యములు దీర్చి, తాల్మికల్మి మనోవీధిం దలకక లొత్త.

క. నానాతటినితతులును, గానసములు బర్వతములు గ్రామములు మహా
స్థానీయంబులు గడచి య, హీనగతిం జనుచు నుండ నింతటిలోపన్. 116

వ. విశ్వామిత్రుండు వైశ్వానరుం బ్రియంబున నాకర్షించి యతనితో ని ట్లనియె. 117

మ. వసుధాధ్రింబుల నైన నీమభియదజ్వాలావళిం జెప్ప యే
ర్చుసమర్థత్వము గల్గునే కొఱలం జోప్యంబొకో మర్త్యులం

బస దూలించుట నీపరిభావము నుతింపన్ శక్యమే యెరికిం
బ్రసవాస్త్రుం బొంగఁటి పీవ పురజిత్ఫాలాగ్ని నేత్రక్రియన్. 118

క. తవిలి హరిశ్చంద్రమహీ, ధవు డరిగెడుమార్గభూమి దావకకీలా
నివహంబులచే నంతయు, నవగాఢ మొనర్పవలయు నత్యుగ్రముగన్. 119

వ. అనుటయు నట్ల కాక యని యక్కురుపతిచుట్టంబు మహీవల్లభుం డరుగుతెరువునం
బ్రబలి యత్యంతదుర్గమంబుగా నిరర్గళమారుతప్రచలితమహీరుహాన్యోన్యసంఘర్షణం
బులవలనం బ్రచండగతిం బ్రభవించి యెండి రాలిన కారాకుప్రోవుతండంబులం
దవిలి రవులుకొని భుగభుగాయమానంబులై పెల్లగయుచు నిబిడాంధకారవ్యో
మంబు లగుధూమంబులు జటవిటాయమానంబులై యభంగురంబు లగువిస్ఫులింగం
బులును ధగధగాయమానంబులై మింటి నంటు నెఱమంటలును బొంగి యొక్కమొ
గిం బిక్కటిల్లి చనుదెంచు దవానలంబు వీక్షించి మానవాధీశ్వరుండు మనంబున దుర
పిల్లుచుఁ జింతాక్రాంతుండై నిజకాంతామణిం గనుంగొని. 120

క. భీకరమై యెటుఁజూచినఁ, నీకాంత తెరంపరానిహుతభుక్కీలా
నీకము కడుఁ బ్రబలెను నా, లేకావిను వారింత గడవ లేరెవ్వారున్. 121

తే. తరళలోచన కాశికాపురముఁ జేరి, ఋషిశిఖామణి కౌశికు ఋణముఁదీర్చి
నిత్యసత్యవచఃకీర్తి నెగడకుండ, నిచట నంకిలి యయ్యె నింకేమి యనఁగ. 122

సీ. హరిణలోచన మన కగుసపాయమునకుఁ, జింతింప నాత్మ నొక్కింతయైనఁ
దాపసాత్మజునకుఁ బ్రాపించుచున్నప్రి, మాదంబునకుఁ జాల ఖేద మెదవు
గావున నొండుమార్గంబు లన్నియు మాని, చయ్యన నేఁ బ్రవేశం బొనర్ప
హవ్యవాహనుఁడు మత్ప్రాణాహుతుల నంత, నిల్లి నీయెడ దయ సేయుఁ బిదప

గీ. నముచు హృత్పంకజంబున నఖిలభక్త, గణవశంకరుఁ డైనశంకరుని నిలిపి
యతిభయంకర మైనకాగ్గి కెదురు, చనియెఁ దెగువ హరిశ్చంద్రజనవరుండు. 123

వ. ఇవ్విధంబునం జనుజీవితేశ్వరుఁ గనుంగొని శోకవ్యాకులితమతి యయ్యు సముద
ధైర్యవతి యై చంద్రమతి యిట్లనియె. 124

తే. ప్రాణనాయక ధైర్యంబు పాయఁబెట్టి, యివ్విధంబున నానతి యియ్యఁ దగునె
నిమిషమైనను నినుఁ బాసి నిల్వఁ జాల, నేన చొచ్చెద నీవహ్నిలోన మున్న. 125

ఉ. ఇందుకు నేమియుం బలుక కీచన వీఁదగు నాకు నావుడుం
గుంది దినేంద్రవంశజుఁడు కోమలి కిట్లను వో మృగాక్షి యో
చందనగంధి యోమతివిశారద నీకిటువంట తెంపు నే
యందగునే మదీయహృదయంబు గలంగఁ గురంగలోచనా. 126

వ. అని యశ్రుధారాపూజితనేత్రుండై యున్నయమ్మహీకళత్రునకుం జంద్రమతి వం
దనం బొనర్చి కరారవిందంబులు మొగిడ్చి. 12

ఉ. కావున నిత్యసత్యగుణగణ్యుఁడు పుణ్యుఁ డితండు భర్తయున్
దైవము గామితార్థఫలదాతయు నాఁగఁ దలంచి చూడనీ
భావజమూర్తి నెడఁ బాసి చరింపఁగ నెట్లు నేర్తు నే
నో వటువర్య యీయనుచితోక్తులు పల్కఁగ నీకు ధర్మమే. 165

క. గాధితనూజునిమూలముగాం, బోధక మద్భర్తయేల మునిఁగెడి గరిక
న్యాయము నేవాదోరిణిక, సాధనముగ నిస్తరించు సంశయ మేలా. 166

తే. ఇంద్రసన్నిభుఁ డగుహరిశ్చంద్రవిభుని, ధైర్యగాంభీర్యశౌర్యసుస్థైర్యవైభ
వంబు లెఱుఁగక విప్రలాపంబు లరసి, పలుకుచున్నాఁడ వో వెఱ్ఱిబ్రహ్మచారి.

సీ. అపరపద్మాసనుం డగుకౌశికుండును, దివ్యుని నింద్రాదిదేవతలును
మేలు మేలని చాల మెచ్చి నుతింప ని, శ్చలుఁడు హరిశ్చంద్రచక్రవర్తి
యార్తరక్షణశాలి వార్త కెక్కినమేటి, మార్తాండకులకర్త మర్దితారి
నిత్యసత్యస్ఫూర్తి నిర్మలతరకీర్తి, ప్రబలి హిమాద్రిజాభర్తకరుణ

గీ. బడసి కీర్తిమంతుఁ బాలించుఁ బ్రాభవమున, వక్ర మేమియు లేక భూచక్ర మెల్ల
ననిన నదియంతయును నిక్కమనుచు మ్రోసె, నిగులనద్భుత మొదవంగ గగనవాణి

వ. అంత నమ్మహీకాంతుం డమ్మాత్రిద్విజుఁ గనుంగొని యుద్దికంబు మనకు నిచ్చోట నాతి
థ్యంబు సేయఁబనికాదు పురోభాగంబున దవ్వ్యాతిత్రిమాయాత్రింబునఁ గాశ్యాయనీ
కళత్రునివాసంబును గమనీయసంపద్విలాసంబును గలుషలతావితానశాతాసియు నగు
కాశీనగరంబు ప్రకాశించుచున్నయది యప్పురంబు ప్రవేశించి కౌశికుఋణవిమోచ
నోపాయం చింతింప వలయునని కాంతాసమేతుండై కొంతదవ్వరిగి ముందట. 169

సీ. జాహ్నవీనిర్మలజలపరిక్షాళిత, బహురోగభీకరపాతకంబు
విశ్వనాథకిరీటవిధుకళాకౌముదీ సముదయాచ్ఛాదితసౌధవీథి
కేశవస్వామ్యగ్రదేశప్రఫుల్లాబ్జవ, మాలికాగంధవాసితంబు
కాలభైరవభుజాకలితఘంటాభీల, ఢమఢమధ్వనుహితడంబరంబు

గీ. నిండుకలిమి డుండివిఘ్నేశుఁ డుండుభూమి, యన్నపూర్ణావిశాలాక్షు లాటపట్టు
శ్రీకరం బైనవారాణసీపురంబు, గనియె వేడ్క హరిశ్చంద్రజనవిభుండు. 170

వ. అనిన విని కౌంతేయాగ్రజుం డటమీఁదివృత్తాంతం బెఱింగింపు మనుటయు. 171

—♦ ఆశ్వాసాంతము. ♦—

మ. హిమచేతోజలజాతసప్తహయ సాహిత్యక్రియాభోజ సం
తతనిర్వక్రపరాక్రమక్రమణమంథగాత్రకస క్ష్మోభత

ప్రతిపక్షధ్వజినీధవప్రబలగర్వప్రాభవాంభోనిధా
న తనూవిభ్రమచంద్రికాదికచకాంతాలోచనేందీవరా.

క. కౌండిల్యగోత్రవర్ధన, పాండిత్యాభరణ దానపాటవనవమా
ర్తాండతనూభవవిభవా, ఖండల దుర్వారవైరిగర్వాద్రిపవీ. 172

మాలినీవృత్తము. ద్యుమణివిమలతేజా తోయజాక్షీమనోజా
శమితవిమతలోకా సాధురక్షావివేకా
కమలభవకులీలా కల్పవృక్షోపమాన
హిమగిరిసమధైర్యా యెల్లనామాత్యవర్యా.

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల సుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలంకారశంకరకవినామధేయ ప్రణీతం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

---



శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము



## చతుర్థాశ్వాసము



శ్రీచారువదన పదసే
వాచరణనితాంతనియమహర్షితనీహా
రాచలకన్యావల్లభ
భూచయయోల్లప్రధాన బంధునిధానా. 1

వ. ఆకర్ణింపు మప్పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె నట్లు హరిశ్చంద్రుండు కాశీకాపురంబుఁ గనుంగొని తదీయపరిసరంబున. 2

ఉ. గంగ దనేకనిర్మలతరంగఁ బ్రఫుల్లసరోరుహాభ్రమ
ద్భృంగఁ దటద్వయీప్రబలదీపితపుష్పలతాకుడుంగఁ బూ
తాంగఁ జగద్రథాంగకలహంసముఖాంబుపతంగ జాహ్నవీ
గంగఁ బ్రియాతిరేకమునఁ గన్గొనియెం బ్రమదాంతరంగుఁడై. 3

ఉ. వారిధికూర్మిరాణి రతివల్లభవైరికిరీటభాగమం
దారలతాంతమాలిక జనంబులపాలిటివేల్పుటావు భా
రతీరమణీకుచాగ్రతటదీపితమౌక్తికహారవల్లి భా
గీరథి చెప్పనొప్పెసఁగుఁ గిల్బిషభూజకుఠారధారయై. 4

వ. ఇత్తెఱంగునం బొల్చుచున్న యత్తరంగిణిం గనుంగొని నమస్కరించి. 5

శా. తల్లీ మిన్నక నిన్ను నాడినజనుల్ తా రర్థిఁ గైవల్యభా
స్వల్లక్ష్మిం దగఁ బట్టుగొందు రనిన న్వాంఛించి పేర్మిముల సం
ధిల్ల న్నిన్నొనియాడువారి కరుదే నిర్వాణసౌభాగ్యముల్
కల్లోలాపహృతాఘపంక త్రిజగత్కల్యాణి భాగీరథీ. 6

తే. జాహ్నవీ నీదుజలములు సదమలములు, లఘువులును శీతలములుం దలంపఁ గ్రింద
లిడినవారికి నల్లనౌ మెడలు, జడలు గట్టు లలాటంబు లుదుకు వరుదు. 7

వ. అని ప్రశంసించుచుం గదిసి భక్తితాత్పర్యవినయసంభ్రమంబులు మనంబునం బెనం
గొనుచుండ సుతసతీసమేతంబుగాఁ గృతస్నానుండై పరమధ్యానపూర్వకంబుగా

మధ్యాహ్నికక్రియాకలాపంబులు నిర్వర్తించి ముహూర్తమాత్రంబు తదీయసైకత క్షేత్రంబున వసియించి గమనాయాసంబు దొలంగుటయు నచ్చోటువాసివచ్చుచుం గాశీపుటభేదనప్రభావంబభివర్ణనాపూర్వకంబుగా వినిపింపఁదలంచి యిట్లనియె.

శా. ఏతత్పట్టణవైభవంబు లమరేశ హేలావతీ ధాతకున్
వాతాశప్రభు శారదాహితులకున్ వర్ణింపగా శక్యమే
చేతోజాతభయంకరుండు సుజనక్షేమంకరుం డిచ్చటం
బ్రీతిం గాపుర ముండు శంకరుఁ డుమాబింబాధరాయుక్తుఁడై. 9

క. పంచాస్యమధ్యమ యిచ్చటఁ, బంచత్వముఁ బొందె నేని పంకింపంగాఁ
బంచమహాపాతకుఁ డగు, పంచజనుం డైనఁ బంచబాణారియగున్. 10

సీ. క్ష్మాధరంబులు పాతు గదలంగ నేవేళ, నొలిని సప్తవాయువులు విసరు
ద్వాదశరూపము లార్చి యుగ్రమయూఖుఁ, డేవేళఁ బచరించు నెండఁ గరము
దుష్కరంబులుగాఁగ బుష్కలావర్తాభ్రి, జాల మేవేళ వర్షములు గురియ
భువనంబు లెల్ల నంభోమయంబులుగాఁగ, విషరాసు లేవేళ వెల్లివిరియు
గీ. జంతునివహంబు లేవేళ సమసి పోవు, నట్టిసర్వాంతభయదకల్పాంతవేళఁ
బొరయ దాపద యణుమాత్రమును గురంగ, నేత్రి యిక్కాశికాపురక్షేత్రమరయ

తే. ప్రసవకోమలి యీపురబాహ్యసీమఁ, గోర వసియించుచండాలకులజు లైనఁ
బోలఁ జాలఁడు నిర్జరపాలకుండుఁ, గలవు ధర్మార్థకామమోక్షంబు లిచట. 12

తే. వనజలోచన యుత్తరంబునను, దక్షిణమునఁ గొనిగూడఁ దగువరణయును నసియు
గ్రతుభుగీశ్వరదిశమణికర్ణికయును, బశ్చిమంబున డుంఢియుఁ బ్రణుతిఁ గాంచె. 13

క. వారాణసి వారాణసి, వారాణసి యనుచు భక్తిపరుఁడై నరుఁ డం
భోరుహమిత్రోదయవే, ళారంభంబునఁ దలంప నడఁగు నఘంబుల్. 14

తే. వనరుహానన వందారుజనమనోర, థార్థము లైనబహుపుణ్యతీర్థములకు
రాజు శ్రీకాశికానగరంబు సకల, వేదశాస్త్రపురాణార్థవిశ్రుతంబు. 15

క. కమలాయతాక్షి యిన్నగ, రమున పంచక్రోశములును రాజీవభవా
ద్యమరసదాసేవ్యంబులు, శమితాఖిలభయదకలుషసముదాయంబుల్. 16

ఉ. పాత్రమహామతీ ప్రతిభసాయక మర్త్యుఁడు కాశికాపురీ
యాత్రకుఁ బూని భక్తి నయిదాఱడుగుల్ గమనించినన్ మృగీ
నేత్ర యతండు గాంచుఁ దగ నిర్జరవల్లభ తృప్తిహేతు యా
గత్రయపుణ్యపూర్వకము గాఁగ విశేషయశోవిలాసముల్. 17

శా. సాత్త్వంబున జాహ్నవీజలములం దానంబు గావించి తా
హృత్పద్మంబున భక్తి నివ్వటిల విశ్వేశు న్మహాదేవునిం
బత్నిం దేజనతాపహారి గిరిసుతాప్రాణేశుఁ బూజించు సం
విత్సారంబున కబ్బు నెల్లపుడు తన్వీ ముక్తిసామ్రాజ్యముల్. 18

వ. అని కాశీకామహాత్మ్యం బవ్వరారోహకుం జెప్పుచుం జని చని. 19

సీ. కుముదనిభగోపురగోపురంబులచేత, విమలమహాప్రాకారవితతిచేత
మణికలితమహానీలమండపంబులచేత, బహువాతకుంభకుంభములచేతఁ
జాల దీపించు ముత్యాలముగ్గులచేతఁ, గనకపట్టుపట్టుమేల్కట్లచేతఁ
గమనీయపద్మరాగచ్ఛత్రములచేత, వృషరాజకేతనశ్రేణిచేత
గీ. మహితకర్పూరధూపధూమములచేత. నవ్యమాణిక్యనీరాజనములచేత
శంఖభేరీమృదంగఘోషములచేత, వెలయు నవ్విశ్వనాథుదేవళము గాంచె. 20

వ. కాంచి యాసార్వభౌముం డద్దేవసార్వభౌమునిం బ్రవిమలభక్తిపూర్వకంబుగా దర్శించి సాష్టాంగదండప్రణామంబు లనేకంబు లాచరించి చేదోయి మొగిడ్చి వేదోక్త ప్రకారంబున నిట్లని వినుతింపం దొడంగె. 21

సీ. క్షీరాబ్ధిసంభవక్ష్వేళానలోగ్రకీ, లావళీనీలకంఠాజిరాయ
పవనాశనాధీశపర్యకకంకణ, త్రస్తమితత్రిపురాసురాయ
మౌళీందుచంద్రికాజాలస్ఫురద్దేవ, నిమ్నగాకైరవేందీవరాయ
పావనాచారసద్భక్తలోకానీక, మానసాంభోజాతమధుకరాయ
గీ. వసుమతీధరకన్యకావక్త్రచంద్ర, సాంద్రకాశ్మీరసురభినోరంతదాయ
మందిరాయితకైలాసకందరాయ, హస్తిచర్మాంబరాయ తుభ్యం నమోస్తు. 22

క. సాదుమనోభ్రమరమునీ, పాదాబ్జమరందబిందుపానక్రియలన్
మోదం బందఁగఁ జేయుము, కోదండీకృతసువర్ణధర మహేశా. 23

ఉ. అనుచుం బ్రియంబు మీఱఁ గొనియాడి ప్రదక్షిణ మాచరించి యు
జ్జనము ధన్యతం బొగడెఁ జంద్రకళాధరు విశ్వనాథుఁ బా
వనముగఁ గాశికాపురనివాసునిఁ జూడఁగఁ గంటి మంటిఁ జ
య్యనఁ జెడఁబాపఁగంటి భవకల్మష సంచయంబులన్. 24

వ. అని పలుకుచు నచ్చోటు వాసి. 25

సీ. నీలవర్ణాంగుఁ ద్రిశూలహస్తుని కాల, భైరవుఁ జాల సద్భక్తిఁ గొలిచి
యన్నపూర్ణ విశాలాక్షి కాళికాదేవ, తాదేవతలకు వందన మొనర్చి
సిరిఁ బేరురంబునఁ జెలువొందఁజేర్చిన, కేశవస్వామికిఁ గేలు మొగిచి
ప్రత్యూహవార్వ్యూహపటలికాగంధ వా, హుని దండివిఘ్నేశు వినుతి చేసి

గీ. ప్రమదలీలల లోలార్కుఁ బ్రస్తుతించి, దండపాణికి సాష్టాంగదండ మొసఁగి
ఢూంఢి నాసవభాండేశ్వరుని భజించి, యపగతాఘంబు ముక్తిమండపముఁ గాంచి. 26

వ. వెండియుం గల్గు విశేషదేవతాస్థానంబులు దర్శించి కృతార్థుండ నైతి నని యొక్క రమ్యప్రదేశంబు చేరియున్న నాసమయంబున నపాంగంబున నంగారకణంబులు రాల నృపాలశిరోమణిం గనుంగొని కపటక్రియాదక్షుం డగు నక్షత్రకుం డిట్లనియె. 27

ఉ. ధరణిప నేఁడు వెళ్లియును దక్కువగా నెలనాళ్లు వచ్చె నే
నరసితి లెక్క బెట్టి మితి యాయుము లే దొకవీస పైన నే
వెరవున నింక మాఋణము వేగమె తీర్చెదొ కాక మన్న కే
నరిగెదవో వివేకగుణశూన్యత బొంది యసత్యవాదివై. 28

క. భూదయిత వినవె 'యాల, స్యా దమృత విష' మ్మటంచు నార్యజనంబుల్
మేదిని నెల్లెడఁ జెప్పఁ బ్ర, మాదము మిఱ గడచె నేని మానీందు్రనిచేన్. 29

తే. మనుజనాథ వృథాపరిహాసమునందుఁ, దెలియనేరక యూరక దినదినంబు
బొద్దు పుచ్చుచు మాయప్పునుద్దియెల్ల, మఱచియున్నాఁడ విది భావ్యమా తలంప.

చ. ఇక నొకమాట మార్మ నొకయించుక నిల్పక గ్రూరవృత్తిఁ గౌ
శికమునిమీద నాన యిడి చెచ్చెర నంగడి నడ్డపెట్టి పా
యక బహుబాధలం బొదలునట్లుగ జేయక మాధనంబు రా
దకట నృపాల యిట్లు తగవా నను నిష్ఠురుఁ జేయ నేటికిన్. 31

ఉ. ఎంతయు దోప మర్యో ముని యెప్పుడు వచ్చునో వచ్చినప్పుడే
గొంతయు స్వాపతేయ మిదె కొమ్మని యియ్యక యున్నదోషిత
స్వాంతు డగున్ మునీశ్వరుడు సంశయ మించుక యైన గల్గ దా
కంతువిరోధికిం దరముగా దణపంగ దదీయకోపమున్. 32

క. పీతజపహోమనియముఁడ, నై తిరిగియు నిన్ను గూడి యరకా నయినం
జేతికి వచ్చినయది లే, దీతుదకుం గినుక వొడమ కెట్లుందు మదిన్. 33

క. ఇదె యిచ్చెద నదె యిచ్చెద, బదపద డని యాస జూపి పలుదెఱగుల నా
హృదయము నొప్పించితి విక, గుది త్రోసెద నేడు నిన్ను గొంకక యిచటన్. 34

తే. అదనుపదననె కూర్చి మాయప్పు దీర్చి, పొమ్ము నీవన్న బోమె యాపోరు మాని
బడలి జీతము పెట్టినబంట నగుచు, వెఱచి నాకేల నీవెనువెంటఁ దిరుగ. 35

చ. నినుఁ గినియంగ జాల కవనీధవ గాధితనూజమానసం
బున కెడయై లఘుత్వమును బొందగ నేటికి నాకు నీవ నె
మ్మనమున బుద్ధి యాది యొకమార్గము జేసెదవంచు నుంటి మ
న్నన దొలగించి నీదొరతనం బుడుపం దడవా తలంపగన్. 36

వ. అని యిత్తెఱంగున నక్షత్రకుండు పలుకునిష్ఠురాలాపంబులు బాణంబులుం బోలె మనోఘాతంబు సేయుటయు నారాజన్యచూడారత్నంబు వ్రీడాదైన్యంబులు ముఖారవిందంబున సంపడింప నమందవ్యాకులత్వంబుం బొంది పుత్రుండును గళత్రంబునుం దక్క దక్కినవిత్తం బణుమాత్రంబునుం గల్గమికి జింతాఘనస్వాంతుండై చంద్రమతిం గనుంగొని యేమియుం బలుకనేరక యూరక బెట్టనిట్టూర్పులు నిగుడ్చుచు నావతశిరస్కుండై యుండుటయు నవ్విధంబు నిరీక్షించి యాపురంధ్రీశిరోమణి యింగితాకారభావజ్ఞతావిశేషగుణధుర్యయు వినయవివేకభాషాచాతుర్యయు నై జీవితేశ్వరుం గనుంగొని. 37

ఉ. నిండినవేడ్క లోకములు నిత్యము సన్నుతిసేయ ధారుణీ
మండల మెల్ల నేలినసమగ్రయశోవిభవుండ వీవు మా
ర్తాండకులేశ మాధునివిధంబున భ్రాంతి వహించి చింతమై
నుండుట పాటిగాదు ధృతి యుల్లము న్వెలసిల్ల జేయుమీ. 48

ఉ. మిక్కిలి దీనతం బొరయ మీ కిది యేటికి నేడు నెల్లియుం
దక్కువ చూచినన్ మితిదినంబు మహీరమణాగ్రగణ్య యీ
యక్కఱ కేయుపాయమున నైనను విత్తముఁగూర్చి కీర్తి సొం
పెక్కగ మౌనివర్యుఋణ మిప్పుడ తీర్చుట మంచి దారయన్. 39

తే. మోస మగు నప్పువీర్పక మున్న యొక్క. గడియ తడవైన మితి సరిగడిచెనేని
క్షితితలేశ్వర నిన్ను బొంకింప బూన, కంకణము గట్టుకొన్నాడు గాధిపట్టి. 40

చ. పలుకులు మిమ్ము నివ్వటువు బాయక యుగ్రతలుల్క విష్ణుగో
త్రులకు నొకింత యైన మది దుఃఖము బొందదు డీల డెన్నిభం
గుల గదుమానవీయుడు తగు న్మన కీతనిగూర్జ్ఞ సేయ నో
జలజసఖాన్వయాభరణ సత్యవచోవిభవప్రతిష్ఠకై.

ఆ. పార్థివేశ యడవి పాలు ద్రావించిన, చంద మీమునీంద్రనందనుండు
కినిసి ఋణమువీర్పుమని మిమ్ము మాటికి, బరుషభాషణములు పలుకుటెల్ల. 42

శా. కూపంబుల్ తగుతోటలుం జెఱువులుం గుళ్ళున్ ధర న్నిల్పగా
నేపుణ్యం బొనగూడు మర్త్యులకు ధాత్రీశాన్వయాగ్రమణీ
యాపుణ్యంబు రయంబ ప్రాప్త మగు నిత్యస్ఫూర్తిమై సత్యభా
షాపారీణులకున్ వివేకము మదిన్ సందిల్ల నూహించినన్. 43

ఉ. కావున సత్యవాక్యగుణగౌరవసంపద లేశమాత్రముం
బోవగనీక యెంతయు బ్రభుత్వము మీఱగ నిత్యకీర్తి హా

రాజులం దిశాజలరుహారిముఖీమణి యెదం భపాలికల్
శ్రీవిలసిల్లుచుండఁ గయి సేయుము రాజులు సన్నుతింపఁగన్. 44

తే. అర్థమున కిప్పు డొందుపాయంబు లేదు, విమమా ధీరతతో నను విక్రయించి
తీర్పు సగమైన నేఁడు గాధేయుఋణము, కడమకొక్కయుపాయంబు గలుగు నెల్లి

చ. అనవుడు నంతరంగమున సమ్మతిలం నాఁటినకంటె దుఃఖ ము
బ్బిన వెగ డొంది భూవిభుఁడు ప్రేయసి, జంద్రముఖీనతీమణిం
గనుఁగొని సల్కె నశ్రువులు కన్నులఁ గ్రమ్మఁగఁ బద్మగంధ యి
ట్లనుచితగోష్ఠభాషణము లక్కట పల్కఁగ నీకుఁ బాడియే. 46

క. దురితంబు గట్టుకొంటివి, హరహర విన రానియట్టి యతిపరుషవచ
స్స్ఫురదగ్నిశిఖలు వాక, ర్ణరంధ్రవిపినములఁ జొనిపి నళినదళాక్షీ. 47

చ. ఇల బరికించినం బతుల కెట్టిపరిత్యాగముఁ బొంది యైనఁ గాం
తలఁ దగుభంగిఁ బ్రోచుట యె ధర్మము లేమల విక్రయించి యో
జలరుహనేత్ర భర్తలపఁ జన్నె సుఖస్థితిఁ జెంది యుండఁగా
నలికులవేణి యిందులకు నందురకీర్తికి భోగహేతువుల్. 48

క. కులశీలరూపగుణములు, గలిగినసతి భార్యయగుచుఁ గనుసన్నల ని
చ్చలు మెలఁగ నందుపురుషుని, చెలువము చెలువమ్ము గంధసింధురగమనా. 49

క. సతి నమ్మి బ్రోవక బూనెదు, పతకంటెను దోసకారి పరికింపగ నీ
క్షితిలోన లేదు నావుడు, ధృతి మెఱయఁగ నప్పుడు సాధ్వి నృపునకు ననియెన్. 50

ఉ. అంచితసత్యవాగ్విభవ యాపదఁ జెందిన పత్తి నెల్ల న
ర్జించి కులాంగనం గరుణఁ జేకొనఁగా దగు భార్య నైన ని
ర్వంచన విక్రయించి యనివార్యవివేకకళాధురీణతా
భ్యంచితవృత్తి ధర్తకు నుపద్రవముం బెడబాయగా దగున్. 51

క. భూవర వివరింపగ భా, ర్యావిక్రయపాతకంబు నైనను బాయం
గా వచ్చు గాని మఱి మి, థ్యావాగ్దోషంబు బాయ దర మెవ్వరికిన్. 62

తే. అనృతభాషణుకంటె దోసాధికుండు, సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి
వెదకిచూచిన బొడమ డుర్వీశ లేశ, పవనభుజ్మానవామరభువనములను. 53

క. దారసుతాదులమోహము, గోరెడువారలకు దగదు కూడగ నవి ప
స్తారమతి సూరిజనములు, ధీరత దన్మోహలతల ద్రెంపుదు రనఘా. 54

మ. పరితకూలోక్తులు పల్కగా వలదు భూపాలాగ్రణీ యిత్తఱిన్
ధృతి జిత్తంబున నిల్పి దిగ్భరితకీర్తిస్ఫూర్తితో గూడి సూ
నృత వాక్సంపద బొందు భూజనులు వర్ణింపంగ నామీద మో

హతతమఃపుంజముఁ బాపు చిన్మయవివేకాదిత్యబింబంబు చేన్. 55

వ. అని దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగుడ్చుటయు నగ్గంధజగా
మినిం గనుంగొని వసుంధరావల్లభుం డుల్లంబున నొక్కింత ధైర్యం బవలంబించి
యి ట్లనియె.

తే. ప్రసవకోమలి విను నాఁడు భయద యగుచుఁ, బేర్చు కార్చిచ్చు చొరఁగ బంపినవిశేష
దోసకారికిఁ గఠినచిత్తునకు నాకు, నిప్పు డీతెంపు సేయుట యెంత పెద్ద. 57

శా. ఏణీలోచన నానిమిత్తమున నీ కీపాటు పాటిల్లెనే
క్షోణీనాథునిరాణివాసములు చక్షుఃకౌతుకాపాదిని
శ్రేణీలాలితహర్మ్యవాటికలలోఁ గ్రీడావిశేషంబులన్
బ్రాణేశాన్వితలై నిరంతరసుఖప్రాప్తిన్ వినోదింపఁగన్. 58

తే. సకలరాజన్యకన్యకాజనము లపుడు, నీకుఁ బరిచర్య చేయుచు నెమ్మిఁ గొలుతు
రుత్పలేక్షణ యిపుడు నిన్నొక్కరునికి, దాసిఁగా విక్రయింపఁగఁ జేసె నజుఁడు.

ఉ. తనుమధ్యన్ హరినీలవేణి బిసహస్తం బక్షిబింబోష్ఠిఁ జం
దనగంధిం బికవాణిఁ బీనకుచఁ గాంతామానగతినింబు నా
కనుసన్న న్మెలఁగంగ నేర్పు గలరాకాచంద్రబింబాస్యన్
నినుఁ బాపె న్విధి నేఁటితోఁ గలుషకంటే నిర్దయస్వాంతుఁడై. 60

తే. తరుణి నామాట కడుగు దాటవె యను, నలివ నామానసమునఁ బాయక వసింతు
వింతి నాకన్న పెన్నిధి వెన్నచూడ, లలన నాపూజ్యసామ్రాజ్యలక్ష్మి వీవు. 6

సీ. మందిరారామసీమంబులై విలసిల్లు, భయదాటవులు పద్మపత్రనయన
కనకహర్మ్యంబులై కనుపట్టు సాను మ, ద్గహ్వరాంతరములు సింహమధ్య
పట్టెమంచము మీఁద పఱపులై శోభిల్లుఁ, బూరిపానుపులు కర్పూరగంధి
శాల్యోదనంబులై చవులు పుట్టఁగఁ జేయు, శాకపాకాదులు పదమలాంగి
గీ. గరిమ నినుఁగూడి చరియించుకతన నాకు, నిందుబింబాస్య యిన్నాళ్ళ కిపుడు నేడు
పొగడదగు వాదు రాజ్యవిభూతులెల్ల, నెరియఁ నెడఁబాసిపోవుట యెఱుకపడియె

క. ఏణాక్షి విన్నుఁ బాసినఁ, బ్రాణంబులఁ బాసినట్ల భవదీయగుణా
క్షీణప్రతిభావిభవము, ద్రోణికిగా నేఁ దరింపుదున్ విపదబ్ధిన్. 64

వ. అని చింతాపరంపరాయత్తచిత్తుండై యున్న హేన్నృపోత్తముం గనుంగొని వెండియుఁ
బ్రచండకోపంబునం దాపసకుమారుం డిట్లనియె. 64

శా. ఆలస్యం బొనరింప నేటికి నృపాలా త్రెమ్ము మాసొమ్ము స
త్యాలాపంబులు నిల్పె దేవి మఱి మోహం బిస్యోడన్ మానుమీ
జాలిం బొందెద వాలి నమ్ముటకు సంసారంబుపై భ్రాంతివో

యీలాగు లున్నమెచ్చు గావు తుద నిన్నెంతైనఁ బోనిత్తునే. 65

క. ఇక్కలువకంటి నమ్మక, దక్కిన వేఱొండు గలదె తర్కింపఁగ నీ
యక్కఱకు ధనము గూర్పఁగ, గ్రక్కున నంగడికి రమ్ము కాంతయు నీవున్. 66

ఉ. పోయిన యంతివట్టునకుఁ బోకడ పెట్టుము శీఘ్రవృత్తిమై
నీయదురాజబింబముఖి నేటికి నూరక మాటిమాటికిన్
మాయలు చేయ నీకు నిది మానవనాయక హేయమైన గా
ధేయునితోడ నొక్కపతి తెంపున నాడు మసత్యవాక్యముల్. 67

వ. అని కేలు గేలం గీలించి తివియ నుద్యోగించుటయు నమ్మునికుమారుని నిష్ఠురవచనంబుల గలంగి యయ్యాదిమచక్రవర్తి తలాంగనావిక్రయార్థం బప్పట్టణవిపణిమార్గంబు నకుం జనుదేర నయ్యవసరంబునఁ బౌరజనసమాజంబు లత్యంతసంభ్రమంబునం జను దెంచి. 68

సీ. ఆజానుదీర్ఘ బాహాదండయుగళంబు, మేరుసానువుఁ బోలు పేరురంబు
ప్రాభాతజలజాతపత్రనేత్రంబులు, జాలవేడల్పైన ఫాలతలము
నాకాశమణిబింబనీకాశ తేజంబు, గంబుబిబ్బోకంబు గలగళంబు
బద్మరేఖాస్ఫూర్తిభాసిల్లుపదములు, సింహంబు తలసింప జేయుగతియు

గీ. గలిగియొప్పారి రెండవకైటభారిమాడ్కి నున్న హరిచ్చంద్రమనుజవిభుని
ననిమిషేక్షణముల విలోకించ మెనర్చి, యుల్లమున సమ్మదంబులు వెల్లివిరియ 69

ఆ. ఇమ్మహానుభావు డెవ్వడో యెఱుగంగ శోల దధికతుహినజాలవిహిత
కమలపక్షుఁడుపోలె గానంగ నయ్యోడు, నెచటినుండి యొక్కొ యితని రాక. 70

చ. శిరమున బూపచందురుడు చెన్నువహింపని మేరుధన్వియో
యురమున గౌస్తుభంబు చెలువొందనియిందిరప్రాణనాథుడో
కరమున శైలభేది యగుకైదువ లేనిశచీకళత్రుడో
తిరముగ నీత డంచు వినుతించిరి హంసకులావతంసమున్. 71

వ. ఇట్లు వినుతించి యతనివిఱుదం జనుదెంచునాత్రైలోక్యసుందరి యగుచంద్రమతిం గనుంగొని.

సీ. అరుణాబ్జచరణ కాహళజంఘ కదళికా స్తంభోరువు పులినతలనితంబ
యావర్తనాభి పంచాననమధ్య చక్రస్తని బిసహస్త కంబుకంఠి
బింబోష్ఠి దాడిమీ బీజరదనచారు, తిలపుష్పనాస యిందీవరాక్షి
గార్ముకభ్రూయుగ కైరవాప్తశకల, ఫాల పురందరనీలవేణి

గీ. మత్తగజయాన చంద్రికామందహాస, ప్రవిమలస్వర్ణ కేతకీప్రసవగర్భ
దళితనూవర్ణ పరిపూర్ణధవళకిరణ, వదన యీయింతిచెలువంబు వశమె పొగడ. 73

చ. అని కొనియాడుచుండ వినరయ్య కృపామతి పౌరులార స
జ్జనసుతకీర్తులార గుణసాగరులార మదీయమైనవ
ర్తనము సమస్తముం దెలియ దాచక జెప్పెద నంచు బల్కె ని
ట్లని జననాయకాగ్రిణి ముఖాంబురుహంబున దైన్యముబ్బగన్. 74

తే. జలహితవంశజా దనుదిశంకుధరణి, జానిసుతుండ హరిశ్చంద్రజనవిభుడను
ద్రిహీణవిభు డగుగాధిపుత్రునకు ధాత్రి, దానమిచ్చినవాడ నుదారమహిమ. 75

చ. అనిమిషలోకవర్ణితమహామహిమాస్పదమూర్తియైనయ
మ్మునికులచక్రవర్తి కట మున్న మఖార్థము పేర్మి నిత్తు నే
నని యెదబద్ధవిత్తమున కర్థి నుపాయము లేమి నీవధూ
జనమణి నమ్మ బూనితి ననత్వము బొంద దనంబు గొల్పమిన్.

ఉ. అత్రిసమానులు న్రవిసుధాంశుకులీనులు మన్మథద్విష
న్మిత్రనిభార్థవంతులుంని మేయబలాఢ్యులు నైనబ్రాహ్మణ
క్షత్రియ వైశ్యశూద్రకులసంభవులార మదీయభార్య స
త్పుత్రివితిక ధనార్థినయి పోకడ బెట్టెద రండు విల్వ గన్.

సీ. నిద్దంపుచునుమించుటద్దంబు బ్రహసించు, ముఖమండలము గలమోహనాంగి
వెలిదమ్మి రేకులవిభ్రమంబులగుల్పు, కన్నులు గలకలకంఠకంఠి
పూవుగుత్తులతోడి బోరాడ నోపువ, క్షోజలిల్లలమృగరాజమధ్య
గొదమతుమ్మెదలకు గొద ఘటించగ జాలు, కుంతలంబులు గలగురునితంబ

గీ. బచ్చిపగడంపు దీగకు, హెచ్చు జూపు, కెంపువాతెఱ గలరాజకీరవాణి
పరిణుతి గాంచిన నాపాలిభాగ్యలక్ష్మి, వికయించెద గొనరయ్య వేగ వచ్చి. 78

క. కులసతి నమ్మెదు వేడుము, గలడే యని పరిహసింప గా వలవదు నా
పలుకులు విని వను గృపతో, వెలయగ రక్షింపరయ్య వేడెద మిమ్మున్. 79

వ. అని యత్యంతదైన్యంబునం గులాంగనావిక్రయంబు గావించునాచక్రవర్తిం గనుంగొని
పౌరజనానీకంబులు శోకాతిరేకంబున. 80

చ. అకట వెడంగు గాడె ధర నారయ నీవరనాయకుడు కా
శికుకపటంపు వాగురల జిక్కి యొకింత యెఱుంగలేక క
ల్పకనిభదానవిస్ఫురణ బాయక సర్వమహీతలంబు నా
రక యొస గంగ నేటికి విరక్తి జనింపగ వేగిరించుచున్. 81

క. అదియును గాక కులాంగన, సుదతీరత్నంబు నమ్మ జూపుచు నున్నా
డిదె యాతనిబుణమునకై, వెదకిన ధరలోన నిట్టివేడుము గలడే. 82

తే. కొంతమాత్రపుటీవిగా కింత లేక, దలము తప్పినయీవులు తగునె యయ్య

నిచ్చి మఱికొలుకొన లేక యేపుదఱిఁగి, పోవఁ దెగడరె జనులు దుర్బుద్ధి యనుచు.
క. దారసుతయుక్తముగ సఁ, సారం బంతయును విడిచి చరియించు మహా
వైరాగ్యనిధియె యీవసు, ధారమణుఁడు ధరణి యెల్లఁ దపసికి నొసఁగన్. 84
ఉ. ఇంకొకనాటి మేలునకు నిప్పటిసౌఖ్యముఁ బాసి యింతయుం
బొంకము తూలియుండుటయు బుద్ధియొకో పరికించి చూచినన్
శంక యొకింత లేక యతిసాధ్వి సరోరుహపత్రనేత్రి నే
ణాంకముఖిన్ విలాసవతి నమ్మఁగఁ బూనె వివేకహీనతన్. 85
క. బాలిక యెట్లాడెనో యీ, నీలాలక విక్రయింప నృపతికి మోహం
బేలీల నడిగె ధైర్యం, బేలాగునఁ బాదుకొనియె హృదయములోనన్. 86
ఉ. ఈయెలదీఁగఁబోడిఁ గృప యించుక కల్గక విక్రయించు ట
న్యాయము మేదినీపతికి నారయ నక్కట యెంత కల్గినం
బాయక స్వాపతేయ మొకభంగి మహిం బడయంగ వచ్చుఁ గా
కేయెడ నైన నిట్టిశరదిందుముఖిం బడయంగ వచ్చునే. 87
వ. అని పలుకుచుండ వెండియుఁ గొందఱు 'లోకో భిన్నరుచి' యనువాక్యంబు నిక్కం
బుగా నిట్లనిరి.
ఉ. ఈరవివంశదీపకుని నేటికి నేరము లెన్న భూపతుల్
ధారుణిఁ దొల్లి విప్రులకు దానము లియ్యరొ విత్తముల్ మహో
దారతతో నొడంబడరొ దర్పమునం జలపట్టి యీగతిన్
ఘోరవిపత్పరంపరలఁ గుందఁగఁ జేయరు గాక క్రూరతన్. 89
క. కడుభక్తి మ్రొక్కఁ జనుచో, గుడిమీఁదం బడినయట్లు కువలయపతిన్
బడిపడి దానము లియ్యఁగ, దొడిపడఁ గౌశికునిచేత దోసఁగులు దగిలెన్. 90
సీ. కాపట్యమును దీర్ఘకోపంబు గర్వంబు, యతుల కేటికి మహీపతులయెడల
నలఘువివేకశూన్యులు భూమిదివిజులు, విపరీతములు వీరివృత్తు లెల్ల
విశ్వసింపఁగ రాదు వీరి నెయ్యైన న, త్యంతమాయావాదు లరసి చూడ
నుపకార మొనరించినపరమపుణ్యుల, కపకార మొనరింతు రదను వేచి
గీ. బలిదనుజుఁ జేరి వామనబ్రహ్మచారి, మును పదత్రయమాత్రంబు భూమి వేడి
పిదప నాతని బంధించి పెంపు డించి, పూని త్రోయఁడె పాతాళభువనమునకు. 91
చ. అరయఁగ గశ్యపాదివసుధామరవర్గము జామదగ్న్యుచే
ధరణితలంబు సర్వము నుదంచితలీల బరిగ్రహించి యా
నిరుపమదానకల్పకము నీఁధికోణమునందు నైన సు
గర మునినుండనీక యతిశీఘ్రముగన్ వెడలంగ ద్రోయరే. 92

ఉ. ఇన్నియు నేల కౌశికమునీంద్రుఁడు తొల్లి వసిష్ఠునింట ని
ష్టాన్నములన్ భుజించి తుది వానిని గర్హ్యవరించెఁ బూని నేఁ
డిన్నరనాయకోత్తము నహీనవితీర్ణనిధాను నిత్యస
త్యోన్నతుఁ జాల లాఘవము నొందఁగఁ జేయుచు నున్నవాఁ డొగిన్. 93

తే. అనుచుఁ బలుకుచు నుండఁగ నందులోన, నొక్కకొందఱు పాణితరోరుహములు
కర్ణపుటములఁ జేర్చి దుఃఖము జనింప, విశ్వనాథునిఁ గాశికావిభునిఁ దలచి. 94

క. విత్తము గల దని నరనా, థోత్తము గామిసులఁ గొనఁగ నుచితం బగునే
యొత్తిలి వారల నడిగపుఁ, దొత్తులఁగా వేలఁ జాలుదురె మనబోఁటుల్ 95

క. మన మెక్కడ నివ్వనజా, నన యెక్కడ గరమున ధనంబిడి తెగువం
గొను టెక్కడ నరవుడుగాక, బిలిఁగొను టెక్కడఁ దలంప భావ్యం బగునే. 96

ఉ. కోరి తలంప సింహమునకున్ మఱి సింహమె కాక దండ పెం
పారఁగ జంబుకం బవునె యద్విపరీతపమస్తధారుణీ
భారము పూని కీర్తిరమఁ బాయనియీతనిఁ గొందుఁ బ్రాపురా
శీరమణుండు దేవగణసేవ్యుఁడు శంభుఁడు గాక మర్త్యుఁడే. 97

వ. అని యుగ్గడించుచు మన కిచ్చెలువ విలువం గరత్వంబు లేదని పురజనంబులు నిజ
మందిరములకుం జనిరంత. 98

సీ. గాధినందనుని చే బోధితుండై కనై, క్రూరుఁ డటమున్న యప్పారికి నరిగి
వికృతమహీసురవేషంబు గైకొని, కపటవృత్తిక్రియానిపుణుఁ డగుచు
గణన చేయఁ దరంబు గానిసమగ్రసం, పద గల్గి యనుభవింపంగ లేక
పచ్చపైకం బైన వెచ్చంబు చేయుట, స్వప్నంబునను గానివాని గాఁగ

గీ. కడ్డికతమువెక్కసంబుగా నొడ్డి పెక్కు, చోటుల ఋణంబు లిచ్చి నిష్ఠురతఁ బూని
కాలకౌశికుఁ డనుపేరఁ జాలదీన, భావమెల్లను దనయందుఁ బాదుకొనఁగ. 99

ఉ. ఈభువిఁ బామకుం బలియు నీఁగకుఁ గాటువు నీక యెంతయున్
లోభపరాయణాత్మకులలోనఁ బ్రసిద్ధుఁ డితం డనంగ ని
ష్ప్రాభవవృత్తిఁ బూని కలుషంబున కోడక మానసంబునం
దాభయమేది యుగ్రతగదానము లోలిఁ బరిగ్రహించుచున్. 100

తే. మెలఁగువాఁ డంగడికి వచ్చి మేదినీశు, మాట లాలించి మిగుల సమ్మదము బొంది
దమ్మిడీక నేఁడు నాచేతఁ దగులువడియెఁ, గౌశికునిఁ బ్రీతిఁ బొందింపగలిగె నాకు

సీ. ఎదురయ్యె వాఁడఁబోయిన తీర్థ మద్భుత; మాపపిల్లలఁగ నీయవసరమునఁ
గపటకృత్యంబులు కల్పించి వెలపించి, బెదరి పోవంగఁ జేయుదు నృపాలుఁ
గా దేని మదిలోనఁ గరుణారసము పుట్టు, నుచితవాక్యంబుల నూఱడించి

వక్రించు కలశాల విక్రయించుతలంపు. సర్వంబు నుడుపుదు చతురలీల
గీ. వంశలో నేదు తెల్లియు వరిగెనేని, కడచుమితి బొంకుపారయు భూకాంతునుడువు
వనుచు గృతనిశ్చయుం డయి యాత్మణంబ, వృపశిఖామణిముందఱ నిల్చుటయును.
సీ. దేవురించుచు వాకిటిదే తెడు మొగమును, బడ బాఱుచుం డెడిబడుగుటొడలు
బొలు పేది మెడుకకొంపుతు నీనుసిగయును, బల్లమీసములును బిల్లికనులు
జంబోతుగడ్డంబు జెడ్డచూపులు జాల, జవికినకోలయు జంపిగొడుగు
బాతదోవతులును బంచాంగమును ఫాల, తలమున బట్టెవర్ధనము గలిగి
గీ. ముష్టి యెత్తిన ధాన్యము లమ్మడిచినట్టి, ముఱికిబట్టలు మూపుపై దఱచు వ్రేల
సేవ మొనరించుమాయామహీసుపర్వు, గాలకౌశికు జూచె భూపాలకుండు. 103
వ. చూచి యతనియఱుతం జెనంగొనియున్న యజ్ఞోపవీతంబులకతంబున మహీదేవునింగా
నెఱింగి కరారవిందంబులు మొగిడ్చి వందనంబు జేసిన మందహాసంబొనర్చి యారాజ
మందారునకు నతం డిట్లనియె. 104
తే. నీదువంశంబు నడకయు నిశ్చయముగ, దెలియునందాక నాశీర్వదింపరాదు
మాకు నెఱుగంగ జెప్పుమా నీకులంబు, వర్తనంబు నిజంబుగ వలయు దెలియ.
క. ఎవ్వండ వీవు నీవా, రెవ్వరు నీనామధేయ మెయ్యది మిగులన్
దివ్వటిలుచులుకడనమున, నివ్వనితన్ విక్రయించె దేయక్కఱకున్. 106
సీ. వివరింప బందికాడవు వలె నున్నాద, వవయవస్ఫురణచే నదటు గల్గి
కూలిపనులు చేయ హాలికవృత్తికి, నోపుదు వీకృత్య ముచిత మగునె
దూరదేశము పోయి ఘోరమార్గంబున, బలిమిమై దెచ్చినపరవధూటి
గలుషంబునకు దలంకక భార్య యని బొంకి, విక్రయించుట మాకు విశద మయ్యె
గీ. నారకులు చూచి రేని మహాప్రమాద, మీవిలాసిని విడిచి నీ వెచటి కయిన
వేగ మఱుగుము కాదేని విశ్వసించి, నాయుపదేశించుబుద్ధి వినుము. 107
ఉ. బాని సెగాగ నీవికచపద్మదళేక్షణ ధారపోసి స
న్మానము మీఱ నాకొసగుమా భవదీయకృతాగసముల్
పూనిక నేను గైకొని ప్రభుత్వము గానబడంగ నిల్చి యె
వ్వానికి లోగ కెంతతొర వచ్చిన గాచెద నిన్ను గూరిమిన్. 108
క. అని యీగతి బల్లఱపులు, గొనకొని యఱవంగ విప్రకులజులతో న
మ్మనుజేంద్రు డధికధైర్యం, బున నిట్లని పలికె శంక బొందక తెలివిన్. 109
మ. అవివేకంబున విప్రలాపము లేలా పల్కెదీలాగునన్
రవివంశుండ త్రిశంకునందనుడ నే రాజ్యంబు పాలించుచో
భువిలో నెన్నడు చోరశబ్దము వినన్ భూదేవ యిన్నాళ్ళకున్

చెవి సోకఁగ మదిలో నసహ్యముగ నీచేతన్ మహాదోషముల్. 110

ఉ. అతిశయరోషసంయుతమహాహిభయంకరమండలాగ్రఖం
డితరిపుదంతికుంభతటనిర్గళమౌక్తికరాజి బూవి యా
యతజయలక్ష్మికిన్ బరిణయాంగముగా దలఁబ్రాలు పోయుపా
త్రిత గలక్షత్రియవంశజాతరంబులు హాళికవృత్తి కోర్చునే. 111

చ. భయమును బొంది దైన్యమున బాఱదు వచ్చి మఱుంగు జొచ్చినం
దయ దలకొత్తగా నభయదాన మనూనము గాఁగ నిచ్చి ని
శ్చయమతితోడ బ్రోచు టది క్షత్రియధర్మము గాక నాకు ని
న్నియును బరిత్యజించి మహినిర్జరుచాటున నుండ బాడియే. 112

క. ఆలాగున జరియించిన, నేలా ధరియింప విల్లు నిషువుల పెల్లుఁగ
వాలుం గరవాలు నసువుం, గీలు ఘనశ్రీలు విమలకీర్తుల మేలున్. 113

క. చెట్ట దను మోవవచ్చిన, పట్టున ధైర్యంబు వదలి పలుమఱు మిగులన్
రట్టువడి తమికి మదిలో, నట్టిట్టనె నేని నర్వరా సరివారల్. 114

సీ. సర్వసర్వంసహాచక్రంబు గాధినం, దనునకు నేర్పడ ధారపోసి
యాజటిలోకబిడౌజున కటమున్న, యజ్ఞకారణము నెయ్యమునని య్య
కొనినవిత్తమునకు వనజాయతేక్షణ, విక్రయింపంగ నుపక్రమించి
నాద హరిశ్చంద్రనామధేయాంకుఁడ, నీలీల దుర్భాష లేల నీకు

గీ. మిన్నకుండుము కాకున్న మెలఁతగొనఁగ, జాలితివయేని హేమనిష్కములకోటి
జట్టిగా నిచ్చి మన్మనస్తాప మెల్ల, బాపి కొని పొమ్ము విప్ర యీపద్మముఖిని. 115

ఉ. నావుడు బ్రాహ్మణుండు నరనాథున కిట్లనుఁ గొంత సత్యనా
చావిభవంబు గానబడె జయ్యన నియ్యెడ మాకు గర్ణసౌ
ఖ్యావహ మయ్యె నీవచన మారయ నీకు నభీష్టసిద్ధియౌ
భూవర యింత దైన్యమును బొందఁగ నేటికి జక్రవర్తికిన్. 116

చ. విను మిక నొక్కబుద్ధి పృథివీతలనాయక నాదువాక్యముల్
మనమున వేఱె యొండుగఁ దలఁపకు పౌరులు గేలి సేయ నం
గన గొనరయ్య యంచు నధికం బగుదీనత వాదవాదలన్
గొనకొని పల్కుచుండు టిది కూళతనంబు తలంచి చూచినన్. 117

క. రేయును బగలును నయమున, బాయక నడియాస లాపి బ్రమయుంచుచు దా
నేయెడల నప్పుదీర్పక, ద్రోయుటయే జాణతనము తుది బరికింపన్
వేసరి పలుమఱు నడిగి ప్రి, యాసమునను నోడి తారు యతగుణు రెండున్. 118

క. చేర్పున నప్పులు గొని పుడిఁ, దీర్పక దక్కించుకొనెడి తెరువులు నే నీ
కేర్పడఁ జెప్పెదను విను మ, పార్వతికులతిలక మిగుల వనుభుపడంగన్. 120

సీ. తనభూమి వదలక ధనవంతు లగువారి, యిండ్లకు నెడతాకు చెల్లఁబొద్దు
జేరి మిథ్యానమస్కారము ల్చేయుచుఁ, బ్రియములు నయములు పెక్కు చూపి
విశ్వాస మొదవించి వృద్ధికి జడియక, తలుచు పూటలును బత్రిములఁ బెట్టి
యధికవిత్తముఁ గొని యరిగినపిదపఁ గొ, న్నాళ్ళకు వమవర్తనములు తెలిసి

గీ. యంగడికి దెచ్చి కోపించి యాన వోడిచి' యడ్డపెట్టిన దలకక యూసమీద
నిలిచి మానంబు విగ్గుచు నెలయవిడిచి, యాలికమిసిమింతుఁడుచు గాక యుండ వలదు

శా. ఈరీతిన్ దల ఱాయి చేసికొని వా శేమున్న మాకొమ్మటకున్
నూ రొక్కింతయు నెత్తుకున్న గని మందుం డీత డీష్టున్
కేరన్ విత్తము పోయెగాక మరలం జేగోరనే యింక నే
లా రోతల్ వల దంచు బోదురు నృపాలా తారె కొన్నాళ్ళకున్. 122

క. ఇమ్మహి నసత్యవాక్యం, బిమ్మెత్త తాకడినె తలవ దణుమాత్రింబున్
నెమ్మనమున శంకింపగ, బొమ్మా సతి నమ్మవలదు బొంకిన జాలున్. 123

ఉ. ఎంత పెనంగితన్ గృహిణి యిప్పటి కమ్ముడు పోదు నా కుపా
యాంతర మేమియుం బొడమ దర్థము కూడదు కల్ల లాడితిన్
బంతము తూలె నంచు మతి పల్కక మిన్నక యున్న నిన్ను భూ
కాంత వధింపగా జనునె కౌశికమౌనికి నింత యేటికిన్. 124

వ. అనుటయు దరహసితవదనుండై హరిశ్చంద్రుం డద్ధరిత్రీదేవునిం జూచి నీవంటిలోభ
గుణవర్తనులకు నేతత్ప్రకారంబు లుపన్యసింపం దగు గాక మాకు బొందుతదు నే
నీవింక నేమియుం బలుకక తలంగి చను మనిన నక్కాలకౌశికుం డమ్మహీపాలుని
సూనృతాలాపప్రభావంబునకు మనంబున నత్యాశ్చర్యంబు నొంది యసమీకనృపాలా
నీకు నీయపాయవిమోచనంబునకు నుపాయంబులు గఱపినం గోపించెదవనిమఱియును

శా. భార్యం బోకడ బెట్టి నీవు మది దాపం బేమియున్ లేక గాం
భీర్యం బొందగ నున్నవాడవట యోపృథ్వీశ మాకేటికిన్
ధైర్యం బెంతయు నీటిబుచ్చి వగవన్ దర్కించి నీమీదితా
త్పర్యస్ఫూర్తిని బుద్ధి జెప్పిన విరుద్ధం బయ్యె నీకింతయున్. 136

తే. అనుచు నడిగినవిత్తంబు నాత్మగాంబు, యింద మని పైడిటంకంబు లెన్ని పంక్తి
జాప్తవంశజునకు నిచ్చి యమ్మహీశు, రాధముడు మానసమ్మున గోర్కి మెసగ

క. ఆననపంకజసౌరభ, మూనెడియలు లనగ బొల్చునా చంద్రమతీ
మానవతికురులు తేగ న, హీనగతిం బట్టి తిగిచె నెంతయు బలిమిన్ 128

చ. పోరి పోరి నిష్ఠురక్రియలఁబూని పెనంగుచు నున్న దారుణో
సురమిథునంబుఁ జూచి ధృతి సొంపు దలిర్ప బతివ్రతాగుణ
స్ఫురణము గానుపింపగ వచోనిపుణత్వము మీఱ బల్కె నం
బరమణివంశభూషణుని పట్టపుదేవి వివేక మేర్పడన్. 170

చ. కలరు ధరిత్రి నాలును మగండును నీక్రియ దారుణోద్ధతిన్
గలహ మొనర్చువార లది కల్మషకృత్యము గాదె చూచినన్
గెలనికి మెచ్చుగాదు పరికింపగ సిగ్గొక లేశమాత్రముం
దలపరు వాడలోపలి జనంబులు సారెకు నవ్వుచుండగన్. 171

తే. మగఁడు దనుమొత్త దానును మాఱుమొత్త, రాజముఖి గ్రామసూకరమై జనించు
భర్త కోపించి మఱి యెన్ని పల్కె నేని, వలదు ప్రతిభాషణంబులు వనజముఖికి.

చ. కలశభవాత్రిగౌతముల కాంతలు భర్తృపదాబ్జసేవ ని
ర్మలతరభక్తి జేయుచు సమస్తజనంబులు బ్రస్తుతింపగా
వెలసిరి గాన భామలకు వేడ్క బతిప్రియహేతుకృత్యముల్
సలుపుచు నుండఁగా వలయు సంతతముం గడుఁ బ్రేమతోడుతన్. 173

సీ. కుసుమకోమలులకు గుజ్జుమామిడిపండు, ప్రాణనాయకు పాదపద్మసేవ
శాతోదరుల కఱచేతి మాణిక్యంబు, ప్రాణనాయకుపాదపద్మసేవ
కీరవాణులకు ముంగిటిపెన్నిధానంబు, ప్రాణనాయకుపాదపద్మసేవ
కుటిలకుంతలలకు కొంగుబంగారంబు, ప్రాణనాయకుపాదపద్మసేవ

గీ. వలవ జేనోములను నోమ వనరుహాక్షు, లకు మనోహరపదకమలంబు లెపుడు
మునుమతోడ భజించిన నదియె చాలుఁ, దలఁచి చూచిన నభిమతార్థంబు లొసగ.

తే. అనుచు జెక్కుటిదంబుల మనుజవిభుని, వనిత పల్కు సతీధర్మవాక్యములకుఁ
గన్ని మోమున నరుణిమ గ్రమ్మ విప్ర, వెలఁది భీషణగర్దభనిస్వనమున. 175

ఉ. మించినకాలకౌశికునివీఁడి మహాగ్రహ మెల్లగామిథ్వ
చ్చంచలనేత్రపై నిలిపి చాలగ నిష్ఠురభాషణంబులన్
గొంచక పల్కెఁ గన్గొనలఁ గోపహుతాశనకీల లుబ్బ న
క్త్రించిసోలెఁ జూపఱకు దారుణలీల భయంబు జూపుచున్. 176

తే. తగవు జెప్పంగ నిన్ను బ్రార్థన యొనర్చి, యెవ్వరిచటికి దెచ్చి రోచివ్వలాడి
నీవు చెప్పక యుండిన నేమెఱుంగమె, పుణ్యమి వర్తించుమగనాలివడత గొల్ల. 177

చ. పతిహితచర్య లీకరణిఁ బాయక నీవుపదేశ మియ్యఁగా
సతతము నింక నీవొడువుచందమున న్విహరించుచుయననే

యితరులయట్ల నైఁపు మొకయించుక సేపు సమస్త కార్యసం
గతులను లెస్స చెప్పదను గ్రుక్కన నేటికి వేగిరింపగన్. 178

తే. నన్ను జెప్పంగ నెఱుఁగవు మున్ను నీవు, మృత్యువైనను వెఱచు నాయెదుర నిల్వ
నిరుగుపొరుగులవాంఛ సెల్లఁజక్క, యెదురు నాయిల్లు వేయును నెల యింక. 179

చ. ననుఁ గనుఁగొన్న యప్పుడ ఘనం బగుభీతి వణంచుచుండ నా
పెనిమిటికిన్ భయం బుడిపి భీకము నెక్కొన మాఱు మొత్త నా
య్యన సమకట్టి తెచ్చి కలహంబునకుం బురికొల్ప లంచుభూ
జనమత పుణ్యశీలి యగుచంద్రమతిం జలపట్టి యీడ్చుచున్. 180

క. వ్రేసి పదతాడనంబుల, వాసిం దొలగించి నొంచి వదలక మఱియున్
గాసిం బెట్టుచు నుడిగపు, దాసింగా నేలుచుండె దయ లేక నృపా. 181

వ. అట హరిశ్చంద్రనరేంద్రుండు పురంధ్రీరత్నంబు విక్రయంబు గావించినవిత్తంబు
సమస్తంబును సమర్పించుటయుఁ గైకొని యమ్మునికుమారుఁ డత్యంతసమ్మదంబున
నాసార్వభౌము వాక్రువ్వదించి. 182

తే. కౌశికునియాజ్ఞ నీవెంట గడుబ్రయాస, మున జరించినవాసరంబులకు నెల్ల
బత్తె సెఱ వయ్య ధారుణీపాల యిపుడు, నీవు నాకిచ్చినధనంబు నేటితుదకు. 178

చ, ఇనకులవర్య కౌశికమునీంద్రుఋణంబును వేగఁ దీర్చి మ
మ్మనిచి సమగ్రసూనృతమహత్త్వముఁ జెందము నీవు నావుడున్
జనపతి నవ్వి యిట్లనియెఁ జయ్యన జూచి పల్కులున్
దనతల యూచుచున్ మిగులదైవము చేతకు నాత్మ దూఱుచున్. 184

తే. నిన్ను నామీఁద దరువుకానిగ నొనర్చి, యనుపుచో నీకు బత్తె మిమ్మనుచు గాధి
తనయు డేమియు నాతోడ ననగలేదు, పాడియే నీకు నను నేడు బత్తె మడుగ. 185

క. సారం బైనవివేకవి, చారం బింతయును లేక సారెకు నాపై
నూరక మిథ్యావాదము, లీరీతిం బలుక భావ్యమే మునితనయా. 186

క. నావుడు నక్షత్రకుఁడో, భూవర నీవెంట నన్ను బుత్తెంచుతఱిన్
భావించి నన్ను డగ్గఱి, రావించి రహస్యవాక్యరచన చెలంగన్ 187

క. దినమును నీచే బత్తెము, గొను మని కౌశికుఁడు చెప్ప గోపం బేలా
మనుజేశ యేను మిన్నక, పనివడి నీవెంట దిరుగ బంటనె చెపుమా. 188

ఉ. ఆతపశీతవాతముల జంకక నే నిను గూడి పర్వత
వ్రాతము లెక్కి వాహినులపారము దాటి మహాటవీస్థలుల్
భీతి దొలంగి చొచ్చి కడుబేలతనంబున డస్సితిన్ ధరి
త్రీతలనాథ నాకు బలదే దినబత్తెము మాత్ర మియ్యగన్. 189

ఉ. సంతతవేదపాఠము సంధ్యయు వహ్నిక్రియయు నుజ్జగించి నే
నెంతయు మోహవృత్తి ధరణీశ్వర చాపము గట్టుకొంటి నీ
చెంత వసించి కౌశికునిశిష్యులలోపల నేటిదాక ని
శ్చింతమతిన్ యథావిధిగ జేయుదు దప్పక నిత్యకృత్యములు. 190

సీ. విను నృపాలక యూళ్ళవెంబడి దేవర, గుళ్ళపంచల జేరి కుతిల గుడిచి
యడిగి తెచ్చిననీచాన్నముల్ భుజియించి, బదలిక నెంతయుఁ బడను తివిసి
రొయించంగ నేటి కామంచితసౌంబీవ, మెఱుఁగెద వని యుంటి నిచ్చలోన
నే నొందినపరిపూప మెఱుఁగంగ లేవైతి, వించుకంతయును నిం కేమి యనఁగ

గీ. దాల్మి దిగనాడి యలుకనై తడవు గాని, చేత లన్నియుఁ బలుమాఱుఁ జేసి నీకు
వాసి యొడుపక మెఱగమోటవలనికూర్మి, నూరకుండిన నపరాధ మొదవె నాకు.

ఉ. నావుడు భూమిపాలుఁడు మనంబునఁ గోపము సంధవింపఁగా
నావటుధూర్తుఁ జూచి వసుధావర యీగతి నిష్ఠురోక్తు లే
లా వచియింప నీకు మొదలన్ దినబత్తెము నేనొడంబడన్
నీవు గురుప్రయోజనము నెమ్మి నొసర్పఁగ వచ్చితిమ్మెయిన్. 192

క. ఎల్లెడఁ బరదేసులకును, గుళ్ళుం బంచలును గచ్చకొట్టంబులు నం
గళ్ళును గాక తలంపఁగ, జల్లనిసున్నంపుమల్లసాలలు గలవే. 193

ఉ. నీ కిటు నన్ను దూఱఁ జను నే పలుచోటుల నీరసాన్నముల్
గాక సుభిక్షకాలమునఁ గల్గఁగ నేర్చునె పాయసాన్నముల్
చేకొని యిండ్లవెంట నిరపింపఁగ బిచ్చము లెత్తువారి క
య్యో కరుణింపఁగా వలదె యోపిక గల్గి మనంబులోపలన్. 194

క. అమృతము ద్రావిన నూరనె, దమకంబునఁ గినిసి విషముఁ ద్రావినకీతిన్
మమత మును మేలు గావిం, చిన కేమిటి కిప్పు డెగ్గు చేసెద వనఘా. 195

సీ. పరుషభాషణములు పలుమాఱు పలుకక, యెల్లియు నేఁడు సహింపుమాత్మ
నరసి నే నేయుపాయంబున నైనను, మితిలోనఁ జెల్లింతు మీధనంబు
నిప్పు డిచ్చినవిత్త మప్పులోపలిదియు, కాఁగఁ గైకొనుము నిష్కపటబుద్ధి
ననఘ విత్తంబు వార్ధించుచుంటిగా, బత్తెంబు నిత్తు నేపాటిదైనఁ

గీ. దొలుతఁ గౌశికసంయమీంద్రునిఋణంబు, మొదలు ముట్టంగఁదీర్చియో మునికుమార
కీర్తిఁ బొందెదు ననుఁ గటాక్షింపవయ్య, కరుణ యుల్లంబులోపల నిరవుకొనఁగ.

వ. అనిన మందహాసంబు చేసి యమ్మునినందనుండు నృపసంక్రందనుం జూచి. 197

క. భూపాల యిపుడు రొక్కము, చేపడితే ధనంబు విడిచి దేశాంతరముల్
నీపజ్జఁ దిరుగుచుండఁగ, నాపాపమె యింత యేల నలి పెట్టంగన్. 198

తే. క్షితితలేశ్వర నన్ను నీచేతఁ బోలెఁ, బూని వధియించి మఱి కౌశికునిసొమ్ము ధనముఁ
బచ్చపైకంబు నిందులో వెచ్చపఱుప, నెన్ని చెప్పిన మాట లింతేటి కనిన. 199

ఉ. ఓపరమేశ్వరా యని పయోరుహబాంధవవంశవర్ధనుం
డాపదుపోక్తికిం గడు రయంబున వీనులు మూసి యాత్మ సం
తాపము నొంది యివ్వడుగు దానవిపాత్రుఁ డిట్టిట్టిడెం
జేపడె మున్నుగా ధనము చేరునె క్రమ్మఱ నాకు నేమియున్. 200

క. ఏపగిదిఁ దీర్తునిఁక నేఁ, దాపసవరుబుణము నిజము తప్పక యుండన్
నాపలికినమితదినముల, లోపలనె సమస్తజనములుం గొనియాడన్. 201

వ. అని చింతాక్రాంతుండై యున్నయమ్మహీకాంతునింగనుంగొని కపటక్రియానిపుణుం
డగునక్షత్రకుం డిట్లనియె. 202

క. ఊరక చింతించుచు నీ, వీకరణిఁ గదల కున్న నృప మాచిత్తం
బేరీతి వచ్చు వేగమ, రానమ్ము ధనమ్ము దమ్ము రసికత వెలయన్. 203

సీ. అనిన నిట్లని పల్కె నవనీకళత్రుండు, నక్షత్రకునియాననంబుఁ జూచి
మునిపుత్ర యే నొనర్చినయపరాధముల్, పెక్కుబు గల వేల పేర్కొనంగ
నరవిందలోచన నమ్మినవిత్తంబు, తోడంబడ సర్వంబు దొరకె నీకు
మునిబుణం బింకఁ దీర్చుకొనఁ దగు స్వాపతే, యంబున కొం డుపాయంబు లేదు

గీ. కాన వేగంబ నన్నుఁ గింకరునిఁ గాఁగ, వీటిలో నెవ్వానికైన విక్రయించి
నిరవశేషంబుగా నప్పు నేఁటితోడ, సంతయును దీఱునంత ద్రవ్యంబుఁ గొనుము.

వ. అనుటయు నట్లు కాక యని సమ్మతించి నక్షత్రకుం డప్పుడంధకారాధ్యక్షునిదక్షిణహ
స్తంబు నిజపుస్తకసూత్రంబున బంధించి. 205

తే. నమ్ము నీ వని కొంపోయి నెమ్మనమున, శంక యేమియు లేక యాసార్వభౌము
బట్టణములోన విక్రయింపంగ దొడఁగె, పౌరజనహాహారవంబులు ప్రబలుచుండ. 206

సీ. క్ష్మాచక్రమెల్ల విశ్వామిత్రమునిశిఖా, మణికి నర్పించిన మంచిదాత
నేఁడుదీవులను విజృంభించి బహుజయ, స్తంభముల్ నిల్పినశౌర్యశాలి
భేతాళుఁ డను పేరుభూతంబుఁ జెనటార్చి, మునులభయంబు మాన్పినమహాత్ము
నిత్యసత్యవ్రతస్తుత్యుఁడై కీర్తివి, స్ఫూర్తిచే వెలసినపుణ్యమూర్తి

గీ. సకలకులవార్ధిపూర్ణేందుఁ డగుత్రిశంకు, కూర్మిపట్టి హరిశ్చంద్రకువలయేశు
విక్రయించెద నడిగినవిత్త మొసఁగి, గరిమ గొన రండు పౌరలోకంబులార. 207

వ. అని యిప్పగిది నప్పట్టణవిపణిమార్గంబుల నమ్మసమయంబున నటమున్న నిజతపస్సా
మర్థ్యంబున విశ్వామిత్రుండు మణికర్ణికానికటంబునం దొక్కపితృవనంబు నిర్మించి
సమవర్తిం దలంచిన. 208

ఉ. దండము కేలఁ బూని జలదప్రతిమానతమప్రభావళుల్
మెండుకొనంగఁ గింకరులు మిక్కిలి భక్తి భజింపఁగాఁ గృతాం
తుం డరుదెంచి తత్పరత ధూర్జటిసన్నిభుఁ డైనమౌనిమా
ర్తాండున కెంతయున్ దృఢతతం బగుభక్తి నమస్కరించినన్. 209
క. కౌశికముని వైవస్వతు, నాశీర్వాదం బొనర్చి యాదరమోదా
వేశం బొదవఁగ నిట్లను, వైశారద్యానవద్యవాచాగరిమన్. 210
సీ. మార్తాండనందన మన్మనఃప్రీతిగా, నీవు మహాద్భుతం బావహిల్ల
మాయాశ్వపచవేషివై యతివేగ నీ, ప్రేతవననికేతనమునకు నాధి
పత్యంబు గైకొని నిత్యసత్యమునకై, నా కొడంబడిన ధనంబు లేమి
నమ్ముడు వోయెదు నాదిత్యకులవార్ధి, చంద్రు హరిశ్చంద్రసార్వభౌము
గీ. పిలిచి హుంకార మెల్లను వీటఁ బుచ్చి, కింకరునిఁగాగ వేలి నిశ్శంకలీల
ననుదినంబును హేయంబులైనపనులు, చేయ నియమింపు దైన్యంబు చెదర నందు.
వ. అనిన నట్లకాక యని యాత్మణంబ. 212
సీ. నడునెత్తిఁ గొప్పుఁ గర్ణములఁ గీలించిన, తెల్లనిముడుసుఁ జెందిరపుబొట్టు
మొలఁ గాసెఁ గోసినముతికిపాతయు నందు, నడుము బిగించిననరపవాలు
దలనిట్టునట్టుగా నలసి యొల్లమిగాగ, బెనచిచుట్టినకావిపేరిలికయును
బైఁ ద్రిప్పి కప్పినపాత్రవోలుపాయము, జే నున్ననీలయష్టియును గలిగి
గీ. కోరి పసరపునంజాటిగుదియు గల్లు, బుంగయును బూని తనమేనిపొలుసుకంపు
లలముకొన వీరబాహునామ్నాయమున, గపటచండాలవేషసంకలితు డగుచు. 213
మ. మదిరాపానవికారచేష్టల గడున్ మత్తిల్లి రక్తాక్షుఁడై
యెదురుం దన్ను నెఱుంగలేక మిగులన్ హేయంబు వాటిల్లగా
బదముల్ తొట్రుపడంగ జొక్కుచు మతిభ్రాంతిన్ బడం దాలుచున్
గుది గొంచున్ వెడపాటఁ బాడుచు దురుక్తుల్ ప్రేలుచున్ సోలుచున్. 214
తే. మొగముపైఁ జిమ్మచీకటి ముడివడంగ, మాటిమాటికి మీసాలు దీటుకొనుచు
జనియె సంబళి సంబళి యనుచు బొక, జాప్తకులపుంగవుఁడు వచ్చువంగడికిని. 215
వ. ఇట్లు చని యయ్యంత్యజుం డత్యంతహేయంబుగా మొగంబున గల్లుకంపు వెల్లుబ్బ
తబ్బిబ్బు అగుపలుకుల నిట్లనియె. 216
తే. ఓరియోరంతపొద్దునా యొద్దఁగదల, కుండియుడిగంపుపనులు సేయుచు బ్రియంబు
చెలఁగ మెలగెదవేని యాచించుత బాప, డడగినంతధనంబు నే దడయకిత్తు. 217
వ. అనుటయు గోపారుణితలోచనుండై భూపాలుం డాచండాలుం జూచి. 218

శా. ఓరీ మాల దురాత్మ నీమనములో నొక్కింతయున్ శంక లే
కీరీతిన్ దురహంకృతిన్ బలుక నోరెట్లాడెరా నీకు నా
హా రాజీవసఖాన్వయున్ విలువ నీ వర్హుండవే పొమ్మికన్
జేరన్ రాకుము మద్యపానకృతదుశ్చేష్టావికారంబునన్. 219

క. ఏ నెక్కుడ నీ వెక్కుడ, మానిసమారునకు నిష్టమతి కడుఁ బొదలం
గా నొసఁగెడుధన మెక్కుడ, హీనకులుండ తొలఁగు మనిన నట్లను వాడున్. 220

సీ. దండహస్తుండనై తప్పు లారసి మను, ష్యుల నెల్ల శిక్షింతు వలసినట్ల
యనిమిషులకు నైనఁ గినియంగ రాదు నా, యెడ నీకు నిట్టేల హేయపడఁగ
జండాలుఁ డని సారసాక్షు నన్ను నీ, వీసడించుట పాటియే తలంప
ధర నుతిఁ గన్నమీతండ్రివంశమునకు, నాదువంశమునకు భేద మెద్ది
గీ. మునిశిఖామణిబుణ మెల్ల మొదలుముట్ట, నెనె తీర్చెద నెవ్వండ నైన నేమి
దురభిమానంబు మాని యీదొసఁగు వెడలఁ, గోరి నాచేత విత్తంబు గొనుము వేగ

క. ఇంతదొరవరుసవాఁడవు, పంతంబున నుండ నేల పార్థివ మెదలన్
వంతం బొందుచు నోభూ, కాంతా యివ్వడుగుచేత గాసిం బడఁగన్. 222

క. పలుమఱు నీతో నాకున్, గలహింపఁగ నేల ధనము గలవారికి దా
సులు లేరె యరసి పిలిచినఁ, దొలఁగుము చెప్పకుము నీదుదొడ్డతనంబుల్. 223

వ. అని హరిశ్చంద్రనృపుండును నాచండాలుండును బట్టి కూడ నట్టియెడం గదిసి
నక్షత్రకుండు. 224

మ. మును నాతోడుత నీవుపల్కినక్రమంబుం గాదె భూపాల యొ
వ్వని నైనన్ నను విక్రయింపు మని గర్వస్ఫూర్తి వర్జించి నీ
వనవే యీగతి నేటికిన్ దిరుగ సత్యప్రాప్తిఁ బోనాడి యీ
తని హీనుం డని మాటిమాటికిని నిందల్పల్కు నీ కేటికిన్. 225

క. ఇతఁ డెవ్వఁ డైన నేమగు, క్షితినాయక ధనము మాకుఁ జెల్లించినవాఁ
డ తగినమాన్యుఁడు తలఁపఁగ, నతివేగమ విత్తమునకు హరు వికఁ జెపుమా. 226

శా. ఈచండాలునిచేత మాధనము నేఁ డిప్పించెదో కాక నీ
వాచాడంబర మెల్ల మాని యనృతవ్యాపారశీలుండ వై
యాచంద్రార్కము ధాత్రిపై నిలుచుసత్యస్ఫూర్తి వర్జించెదో
ధీచాతుర్యము మీఱ నిం దొకటి నర్థిం బూనుమా చెచ్చెరన్. 227

మ. వినుమీ నాదుప్రతిజ్ఞ యింకొకటి యీవిత్తంబుకై నట్టి యి
చ్చిన నొండొక్కని కమ్మ నీతనికి నిన్ శీఘ్రంబ నే నమ్ముదున్

బెనఁగొన్నట్టిచలంబుతోడ ననుచున్ బృథ్వీశ్వరుం బల్కఁగా
విని చండాలుఁడు సంతసిల్లి పలికెన్ విప్రోత్తమున్ జూచుచున్. 228

తే. అవుర మెచ్చితి నోబాపనయ్య నిన్ను, దిరుగ నీమాట నీమదిఁ దిరము సేయు
హీనకులుఁడని యితఁడు నన్నేవగించి, పలికె నాయాత్మ కిది యింపములికియయ్యె

ఉ. నీబుణ మెల్లఁ దీర్చి యవనీపతి గింకరుఁడాఁగ నేలుదున్
గోరుము నీదుచిత్తమునకున్ మితి యెయ్యది యున్న సమ్మదం
బారగ నిచ్చె మానిసుతు దంత్యజు గన్గొని యింతవట్టు నీ
వేఱుగ జేసి నామదికిఁ బ్రీతి యొనర్పుము నీవు దాతవై. 230

తే. జనుడు దంతావళము నెక్కి చాల నిక్కి, గగనతలమునకై రత్న మెగిరి పోవ
నైచినంతయు బొడవు ద్రవ్యంబు దెచ్చి, రాశిగా బోసి మాకిమ్ము రాజ గొనుము.

క. నావుడు నంత్యజుఁ డిట్లను, నీ వడిగినవిత్త మెల్ల నే నిత్తున్
వేవేగ యడుగు తిరుగక, యోపదుగ జనించె శంక యొక్కటి నాకున్. 232

క. తనదేశం బెడఁబాయక, జను లెఱుఁగగ నాలు బిడ్డ సంసారము గ
ల్గినవానిఁ గాక యొంటరి, ననుమానము లేక నమ్మ నగునే నాకున్. 233

చ. పగలును రేయు దత్పరత బాయక నాకుడిగంబు సేయుచున్
దగవరివై మదాజ్ఞ గుఱి దాఁటక నుండగ బూట యెద్ది నె
వ్వగ బొరలంగ నోప నొకవంక కితండు తొలంగి పోయినన్
మిగుల బ్రమాద మా బిదప మిన్నక యేగతి విశ్వసింపుదున్. 234

వ. అనిన దాపసకుమారుం డమ్మహీపాలుం గనుంగొని నీ విమ్మాత్రంగునకు సమ్మతంబగు నట్లుగా నమ్మ బలికి మాధనంబు సమస్తంబును ద్వరితంబ తెప్పించి యిప్పింపవలయు నని బహువిధంబుల మనంబు నొవ్వం బలికి నెవ్వగం బెట్టు నవ్వడుగునిష్ఠురకృత్యం బులకుం గలంగి హరిశ్చంద్రుం డెవ్విధంబున నైనఁ బూని యీతనివిత్తం బొక్క చిన్నంబునుం గడమ కాక యుండ సమర్పించి నేటితోడన కౌశికుని మాయాపయో రాశి యుత్తరింతు నని చిత్తంబున నిశ్చయించి వీరబాహుం జూచి యిట్లనియె. 235

క. నామీఁద నవిశ్వాసం, బేమిటి కనుమాన ముడుగు మే సూనృతవా
చామహిమ నిల్ప గోరి ధ, రామరునకు దక్కినాడ నమ్ముడు పోవన్. 236

క. జననీజనకులు సత్యం, బును సుజ్ఞానంబు వినయమును ధైర్యంబున్
దనయుడు మిత్రుఁడును నా, కనఁ జూడు సుకృతంబు శాంతి యాలు దలంపన్. 237

ఉ. వాసరవల్లభాన్వయుడ వర్జితదోషుడ సార్వభౌముడన్
భాసురసూనృతవ్రతిభ బాయగ జాలక చేరి నీకు నే

దాసుడ నయ్యెదన్ వినుము తప్పనిమాటయ నాకు బూట యీ
భూసురబాలకాగ్రణికి బొందుగ నిమ్ము ధనమ్ము సర్వమున్. 238

చ. హృదయములోపలన్ గపట మించుక యేనియు నిల్ప కెంతయున్
సదమలభక్తి యుక్తి ననిశంబును బాయక నీకు సేవ సే
యుదు మఱి సేయకుండిన మహోగ్రత నాదుశిరంబు ద్రుంచి నీ
పదములమీద నిల్పెదను బాలసుధాకరమాళి సాక్షిగన్. 239

వ. అని యమ్మహీపతి యతులప్రతిజ్ఞావచనంబులు పలుకుటయు విశ్వసించి వీరబాహుండు నిజానుచరవ్యూహంబుచేత నగణితం బగుధనంబు దెప్పించి యమ్మునికుమారు సమ్ముఖంబున. 240

ఆ. కొండపొడవు గాగ గొనకొని ప్రోగు వో, యించి ప్రియ మెలర్ప నిచ్చి వినతుం
డగుచు నరుగు డనిన నగుగాక యనుచునై, కొని మునీంద్రసుతుడు సుతుక మొదవ.

వ. సంకల్పసిద్ధియగుంగాక యని ప్రియపూర్వకంబుగా నాశీర్వదించి చనియె ననిన, గాంగేయాగ్రజుం డటమీదివృత్తాంతం బెఱింగింపుమనుటయు. 242

—♦ ఆశ్వాసాంతము. ♦—

శా. సాధుస్తుత్యచరిత్ర బంధుజనతాస్వామ్యాబ్జ గాంభీర్యవా
ర్జ్యామధుర్యభరితామృతాంబునిధినైర్మల్యోర్మి సంఘాత ది
క్సాథవ్రాతనుతధాయితోజ్జ్వలయశస్సౌభాగ్య యోగ్యక్రియా
బోధానందమయాంతరంగ పురజిత్పూజాకళాకుంభజా. 243

క. ప్రియయిత జనసంరక్షా, చతురమునీశావిశేష సాగరతనయా
సతతాసాపీకృతదృ, క్ఛతసత్ర యమిత్రజైత్ర శౌర్యాటోపా. 244

మనమయూరవృత్తము. ఉల్లసితకీర్తిమహిమోన్నత దివౌక
స్తల్లజమహావిభవ ధర్మగుణభాషా
వల్లభ సుధామధురవాక్చతుర యీడూ
రెల్లన నృపాలసచివేంద్ర రుచిచంద్రా. 245

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్య మునిచక్రవర్తి గోత్ర సకలసుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలంకార శంకరకవినామధేయ ప్రణీతంబయిన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.

—:♦:—

శ్రీ ర స్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

—

## పంచమాశ్వాసము.

---

శ్రీరూపస్ఫుటనిర్జి
తాస్తోకవారిరుహనాథశంబరవిద్వి
ట్స్మేరనిశావల్లభలా
వణ్యాల్లామాత్య బుధపయోజాదిత్యా. 1

వ. ఆకర్ణింపుము పుణ్యాండవాగ్విజానకు మార్కండేయుం డిట్లనియె నట్లాశీర్వదించి నక్ష
త్రకుం డమ్మహీకళత్రునిం జూచి. 2

తే. ఇనకులాధీశ నీవు మా కియ్యకొనిన, విత్త మంతయు నేఁడు ప్రవేశ మయ్యె
శంకరుఁడు విశ్వనాథుఁడు సాక్షిగాఁగ, నిలుపుకొంటివి సత్యంబు నిత్యముగను. 3

క. అని హస్తాహస్తం బొ, ప్పన చేసె మహీశువీరబాహునకుఁ దనూ
జనితాతి హేయ కారణ, ఘనదుర్గంధాత్తమక్షికాపూర్యాహునకున్. 4

సీ. ఆసమయమునం దాకాశపథమున, వసియించి సర్వగీర్వాణవరులు
కరుణాకటాక్షవీక్షణములఁ జూచుచు, నత్యంతవాత్సల్య మంకురింప
చండాలగృహమున నుండునన్నాళ్లకు, నాకలి దప్పులు లేకయుండ
శీఘ్రంబ చండాలసేవానివృత్తిగా, వరము లిచ్చిరి మహీవల్లభునకు

గీ. నంత నిజమందిరమ్ముఁ కరుగఁ దలఁచి, వీరబాహుఁడు కడునహంకారలీల
మదము కన్నులనిండారఁ బొదువుకొనఁగ, క్షత్రియకులపుంగవుం డని శంక లేక. 5

క. తనచేత మాసభారం, బును ముదిగాఁ పూర్ణకలశమును జతనమునం
గొని రమ్మని యదలించుచుఁ, గనుగొని ధరణీకళత్రుకరమున కిచ్చెన్. 6

వ. ఇచ్చినం బుచ్చుకొని పాపపొచ్చెంబు లేనిమచ్చికం ధరణీకులపుంగవుం డంతరంగం
బున నొక్కింత హేయతం బొందక లజ్జపడక వానిపజ్జ తదీయపూర్వకింకరులం
గూడి చని ముందట. 7

సీ. బహువిధపశుకళేబరసమాకీర్ణంబు, దుర్గంధబహుదిశాసర్గళంబు
పలలభక్షణకుతూహలసారమేయంబు, కాకగృధ్రానీకకలకలంబు

మక్షికాచ్ఛాదితమాంసవ్రణరాజి, చత్వరాస్తీర్ణార్ద్రచర్మపటలి
ప్రబలవిట్పు సుఘుర్ఘరధ్వానపూర్ణంబు, సవిధశునాభాగసంస్పృశాస్థి

గీ. వారుణీపానకృద్యదుర్వాగ్జనతతి, మదభరాలసచండాలమండపౌత
రేతి రాసర్థకలహాసంజాతరవము, గలిగె మాతంగవాటము మనుజవిభుడు. 8

చ. కమగొని చొచ్చి దైన్యగుణగౌరవము ల్పొదగంగ నీక నె
మ్మనమున నేవగింపక క్రమంబున నంత్యజునింటి కేగి వా
డనుదినము న్మదోద్ధతి నహంకృతి జెప్పెడు నష్టకష్టపుం
బను లొనరగూడ జేయుచును బార్థివసత్తము డుండె భృత్యుడై 9

వ. వీరబాహుండును బ్రతిదినంబును గృతాపరాధంబులెన్నుచు నొక్కనాడు పాయంబుం గాంచి నూత్నతేజాంబు వదల వీని ప్రతిజ్ఞాభంగంబు గావించి సాధనందమునకు మన స్సంతోషంబు వొసర్తునని నిశ్చయించి యొక్కనాటి నిశాసమయంబున వారుణీపతి యూరుపీఠంబున జరణంబులు చేర్చిన నతం దంతఃకరణంబున భక్తి నివ్వటిల్ల బదంబు లొత్తుచున్న ముదంబునం గనుంగొని. 10

తే. ఓరి నీమీద విశ్వాస మొదవె నాకు, నే నొసర్చుపరిచోజనం బీవు జేయు
నేడు మొదలుగ శాస్త్రాజ్ఞనా వసుచు, వినుము చెప్పెద నీకు దత్ప్రధము దెలియ.

క. ఈపీటిపరేతక్షితి, నావశమై యుండు గొన్ననాళ్ళకు బ్రీతి
నీ వచటి యాధిపత్యము, లేవంగైకొనము సంఘునికకార్యడవై. 12

గీ. వినుము నీనామధేయంబు నీకదాను, వదల కేగాచ నీ ముందరిగుదియ బూను
మనుచు దనచేతి కిచ్చిన నాదగమున బుచ్చుకొని వేడ్క రంజిల్ల వచ్చి యెదుర.13

వ. అత్యంతభయంకరం బగుపరేతవనిపేనంబు వీక్షించి కించిన్మాత్రంబును జిత్తంబున భీతిల్లక ప్రవేశించి యమ్మహీవల్లభుం డహీనధైర్యంబున నిజకృపాణప్రభావిభాసమానుండై నానాభూతవారంబులం గూతలిడం బట్టి కొట్టి యిట్లనియె. 14

సీ. అనుదినంబును మీర అత్యంతసభ్రమంబున నేగి వీరబాహునిగృహమునం
బగ లెల్ల నుడిగపుంబనులు చేయుచు రాత్రి, గడక నీధవభూమి గాచుచుండు
దస్మదీయుం బైన యాజ్ఞ నుల్లంఘించి, నడచితిరేని దండన మొనర్తు
నిన్నాళ్లవలెను గాదింతటనుండియు, మీకు విచ్చలవిడి మెలగ రాదు

గీ. హీనకులుండని యనక మదీశ్వరునకు, నాయురారోగ్యభోగ్యప్రతాపాభివృద్ధి
మించునట్లుగ నాశీర్వదించి రండు, మోదమున బ్రహ్మరాక్షససముఖ్యులార. 15

వ. అని యిత్తెఱంగున భూతసంచయంబుల నియమించి సమీపవర్తియు సమున్నతమూర్తియు నగు నొక్కబేతాళునిం బిలిచి నీ వింక మదీయకింకరుండ వై యచ్చోట నొక్కమంచె పెట్టించు మనుటయు నట్ల కాక యని కృతనమస్కారుండై యతం

బ్రాహ్మణుఁడు కోరి చెప్పినపనులకెల్లఁ, బూని వేగంబ యరుగక మాననాఁడు. 22

వ. అని యత్యంతచింతాభరంబును జెంది యప్పుడు ధాత్రీకళత్రుండు బరిపరియున్నంబున సకల దేవతా ప్రార్థనంబుం జేసి వియచ్చరనిశాటపన్నగభూతదుష్టమృగపక్షివ్రాతంబుల వలనం గుమారునకుఁ బ్రాణభయంబు వొడమకుండునట్లుగా నాశీర్వదించి యభిమంత్రించి దక్షిణకరంబున నొక్కరక్షాబంధనంబు వొనర్చి యనుపుటయుఁ గాననంబునకు సమ్మాన వతీసూనుం డరుగ నుద్యోగించు సమయంబున. 23

సీ. చలము కోపము మానసంబులో దళముగా, గాధినందనుఁ డహంకారలీలఁ
దనమంత్రిసామర్థ్యమునఁ దక్షకాఖ్యప, న్నగరాజు నాకర్షణంబు చేసి
దక్షుఁడవై నీవు తక్షక మా కొక్క, హితకార్య మొనరింపు మతిశయముగ
సార్వభౌముఁడు హరిశ్చంద్రుఁ డరుంధతీ పతిపూనిక యీశ్వర మతిఁ దలంచి
గీ. విదితసత్యంబు నిర్వహించెద నటంచుఁ, బ్రతిన తాఁ బూని యున్నాఁడు ధృతిదలిర్ప
నతని సత్యంబు లాడింప ననువుపడక. వెరవు వెదకుచు నున్నాఁడ వినుము నేను.

చ. బహువిధమాయ లెల్లెడలఁ బన్ని యనూనవిపత్పరంపరా
సహితునిఁ జేసి ధైర్యగుణసాహసము ల్తొలగంగ జేసి యా
మిహిరకులేంద్రువాక్యములు మిథ్యలు చేయఁగఁ జాలినాఁడ నో
యహివర నాకు నిప్పుడు సహాయము గావలయుం బ్రియంబునన్. 25

క. భవదీయవిషాగ్నులచే, నవనీంద్రియు లైన బగులు నాని చూడన్
భువిలోపల దక్కినవా, నవులకు నిలువంగ వశమె నాగకులేంద్రా. 26

ఉ. కావున నామనఃప్రియముగా నతివేగమ నీవు పోయి త
మ్మాభవరపుత్రుని న్విపినభూమికి బోయినలోహితాస్యునిన్
జీవము పోవునట్లుగ నశేషవిషానలస్ఫూర్తిసుస్ఫుటా
రావమహోగ్రతం గఱచి రమ్మని పంచిన దక్షకాహియున్. 27

సీ. పనిపూని యప్పుడ చని యల్లసిన్నవన, సీమాసమీప ముచెలువుపాత
వటమహీరుహమున వల్మీకరంధ్రంబు, శీఘ్రంబ తాఁ బ్రవేశించియుండ
దదనుకూలముగాగ దనశిష్యవితతుల, బోధించి పలికె నగ్గాధిసుతుఁడు
వటుశిఖామణులార వారక మీరేగి, నృపకుమారుని గూడి విపినభూమి
గీ. గలయ జరియించి వాని నేకరణి నైన, బూని ప్రేరేచి తోడ్కొనిపోయి తక్షకా
హివల్లభకూరకవిషాగ్నిశిఖలఁ, బాలుగా ద్రోచి రండని పనుచుటయును. 28

వ. అత్యంతరయంబునం జని లోహితాస్యునిం గనుంగొని. 29

ఉ. ఓ నృపపుత్ర మద్గురువియోగమునం జని యేము నిత్యముం
గాననభూముల న్వలయు కాయలు పండ్లును దర్భ లిధ్మముల్

బుత్రుని డించి దండహస్తాంబులై శుష్కకాష్ఠంబులు కొన్ని గూర్చి పుత్రునకు నిడి యింగలంబు తగుల్పం బూని పూనలేక శోకావేశంబున నిట్లనియె. 65

సీ. మాతామహుండును మాతామహియుఁ జేయు, గారాము గైకొనఁ గాన నైతి
వానందమున నెత్తి యక్కలి ముద్దాడు, మేనమామల మేలు గాన నైతి
గరిమ నక్కునఁ జేర్చి శిరము మూర్కొనుతండ్రి, కౌఁగిట మెలఁగంగఁ గాన నైతి
పుత్త్రసంగము మించి వాత్సల్యమున దాది, గైసేయు మోహంబు గాన నైతి

గీ. పరిజనంబులు సఖులును బ్రియమదమెసఁగ, బూని యొనరించు ప్రియములు గాన నైతి
చుట్టముల కెల్ల వెలవడి కట్టుపడిన, నాకు జనియించి యిట్లైతివే కుమార. 66

తే. ఇవ్వసుంధరఁ గోపల నెన్నఁదగిన, భాగ్యసౌభాగ్యవంతులైనపడఁతు లుండ
సకలదుర్లక్షణములకు సదనమైన, నాకు నేటికిఁ బుట్టితివో కుమార. 67

వ. అని యిత్తెఱంగున. 68

ఉ. పంచమనాదయుక్తిఁ బికభామిని కూయు తెఱంగు దోఁప నా
చంచలనేత్రి హస్తజలజంబులు మోమునఁ జేర్చి యేడ్చె నే
త్రాంచలబాష్పబిందునివహంబుల దోఁగు నురోజకుంభము
ల్మంచునఁ దోఁగుపద్మముకుళంబులతోడుతఁ జెల్మి సేయఁగన్. 68

వ. అయ్యార్తరవంబు విని హరిశ్చంద్రుండు మహాశ్చర్యంబును బొంది యీయర్ధరాత్రిం బిచ్చట నేకతంబ శోకించు వనితానిస్వనంబు వినంబడియె నిస్సందేహంబుగాఁ గనుంగొనవలయు నని ముద్రికుదియ భుజంబునం బూసి ఖరఖడ్గంబు కటిబద్ధాంబరంబున గీలించి కులగుధరశిఖరంబుననుండి మహీమండలంబునకు లంఘించుపంచాననంబునుంబోలె నాగరాజపంచాననం బామంచెపైనుండి వసుంధర కవతరించి మెల్లన చనుదెంచి. 70

సీ. నిబిడశోకారుణనేత్రకోణంబులఁ, బలుమాఱు దొరఁగెడు బాష్పములను
జెక్కుపైఁ జేర్చనచిగురుఁగెంగేలును, కట్టిపోయినయట్టి వాతెఱయును
వేడిమై బలుమాఱు వెడలు నిట్టూర్పులు, గదకొని వెక్కుదుంకత్తుకయును
గడు జిక్కుచీఱుగాఁ విడినకొప్పుముడియును, శవనీగజోలిప్తమైనమేనుఁ

గీ. దొలఁగి పోయినచనుకప్పు మలినపటము, మిగుల వాడినమోమును భిన్నగమియును గల్గి
దీనదశ నున్నచంద్రమతీపురంధ్రి, కట్టెదుర నిల్చె నత్యంతకరుణ పొడల. 71

చ. నిలిచిన భీతియు న్వడకు నివ్వెఱపాటును భూరిలజ్జయుం
గళవళము న్జనింప నధికం బగుశోకముఁ బొందినుంచుచుం
దొలఁగినపయ్యెద న్వలుదతోరపుఁజన్నులు కప్పుచున్న యా
నళినదళాక్షిఁ జూచి నరనాయకవంశలలాముఁ డిట్లనున్. 72

సీ. ఈనట్టఁడు రేయి నీరువర్తిస్వామిలో, నీపెనుచేఁటి సహధమున
నొక్కింత శంకింప కున్నసాహసురాల, వేటిక వెఱపు నిం త్రుఱఁగున
నేకారణమున నీకట్టిస్థితి వచ్చె, నెఱిఁగింప వలయు మా కిప్పుడంబు
నీభర్త యెవ్వఁడు నీనామ మెయ్యది, యెక్కోట వసియించు నెపుడు నీవు
గీ. బాలుఁడేటికి మృతిఁబొందె వాలుగంటి, యనిన వదనాంబుజము వంచి యశ్రుధార
లొలుక గద్గదకంఠి యై పలికె ధరణి, కాంతుమానసమున కనుకంప వొడమ. 73
ఉ. ఓనరలోకవంద్య విను ముజ్జ్వలభూరికృపాపయోధి నే
నీనగరంబులో నొకమహీసురపుంగవు మందిరంబునన్
బానిసనై వసింతు నను భర్త ఋణంబునకై ధనార్థియై
మానితసత్యవాక్ప్రియతి మానక పోకడ వెట్టెఁ దావినన్. 74
తే. నాదునామంబు విను మనఘాత్మ ముఖ్య, మానిఁ దీఁడు స్వామిబృందారకుండు
కోరి పుత్రేష్టి గా సమిత్కుశఫలార్థ, మడవి కంపించి ఫణిదష్టుఁ డగుచు సత్తె. 75
క. వీనికి వ్యాధి నగ సత్కృప, నా గని నాదుఃఖ మెల్ల దుర్వోలఁ
గోరి ప్రియంబు జనింపఁగ, జేరం జనుదెంచునట్టి సిద్ధఁ గ్రిణవో. 76
తే. కాక బహుసూతసవహము లక్కడఁ జని కొలువ, ఫేఁక బుట్టించు సేతిప్పరేతభూమిఁ
బ్రీతి విహరించుచుండెడుమాఁపతివో, గూఁపతియ్యంగ వలయు దయానిధాన. 77
చ. త్వరితము మత్కుమారున కవార్యకృప స్విష వైద్య మిచ్చి యో
చిరతరపుణ్య కీర్తి మ్రొక్కి సంపురిఁ జేసి మదీయమానసాం
బురుహము సమ్మదస్ఫూర్తిఁ బొందఁగఁ జేయు మహానుభావ త
త్పరమతిఁ బుత్రిదానసుకృతంబు సమస్తము నీకుఁ గల్గెడిన్. 78
వ. అనుటయు సమ్మదగమన ప్రియవచోవిశేషంబులవలనఁ దనకులాంగన యనుట
నిక్కంబుగా మనంబునం దెలియక సందేహంబున నారాజపుంగవుండు వెండియుం
జంద్రమతిం జూచి. 79
తే. పంకజానన నేభూతపత్ని గాను, దుఃతహారుఁ డైనయట్టిసిద్ధుఁ డఁగాను
దగనవిష వైద్యమంత్రతంత్రముల నెఱుఁగ, బాలుప్రాణంబు మఱుడింపఁ జాల నేను
సీ. వనజాక్షి యిప్పరేతనికేతనక్షోణి, తనగుత్తగాఁ జేసికొని వసించు
చండాలకులపాలకుండు నాయేలిక, వీరబాహుం డనఁ బేరువాఁడు
కడయుఁడైయీ మదగ్గుడియ నాచేతికి, నిచ్చి యాఁడు నన్ను నిచట నుండఁ
బనిచిన నుండుదు భక్తి మీఱంగ దద్దా, జ్ఞానువర్తితుండ నగుచు నెపుడు
గీ. వినుము నానామధేయంబు వీరదాసు, నే నెఱుంగక యుండంగ నీకు నీవ
నట్టఁడురేయి వచ్చి యీపట్టి దెచ్చి, యిచట నునుపంగఁ బాడియె యిగురుబోఁడి.

దిగఁచికొని నిశ్చయంబుగ నెఱుఁగ కిత్తెఱంగునం దలం పేల పుట్టెనో యని పశ్చా
త్తాపంబును బొంది యమ్మందగమనం గనుంగొని మఱియును. 91

చ. హరపదపూజకుం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభిమానముల్
సరగున వెచ్చపెట్టి హరిచందనగంధులు వీటిబుచ్చి దు
ష్కర మగువల్లకాటి కధికారము వచ్చినదృష్టబుద్ధికిం
గరుణ దలంప నెక్కడిది గంధగజేంద్రసమానగామినీ. 92

చ. అలికులవేణి నీఁడు చతురబ్ధిపరీతమహీతలేశుఁడై
యలరునృపాలశేఖరుని యాత్మజుఁ డంటివి మున్ను నీవు త
త్కులపతి వీతదైన్యమునకుం బనిలేదొ కమాడమాత్రమున్
గలుగదె నీకు నిట్లు పలుకం దగునే విపరీతవాక్యముల్. 93

క. మాడకు మిక్కిలి యడుగము, చేడియ మాస్వామి మున్ను చేసినమేరల్
జూడగ నడపగ దగు మొగ, మోడంగారాదు మాకు మొగి నెవ్వంకిన్. 94

తే. నీకు మఱియొం డుపాయంబు లేకయున్న, నెలఁత మాకిచ్చుమాడకు సెలవు గాఁగ
నెమ్మి గైకొని యొద నిమ్ము నీదుకంఠ, సూత్రమున నున్నమిను కైన శోక ముడిగి.

చ. సగసిజనేత్ర జీవితము సత్యము గాదు శరీరధారికిన్
మరణము నిశ్చయంబు పలుమాఱుఁ గుమారునిఁ జూచి యేడ్చిన
న్మరలునె వీనిప్రాణము మంగళసూత్ర మవర్ణ మిచ్చి నీ
వగనుతునిం దహించు మగువా యనినన్ మూర్ఛిలి శోకమగ్నయై. 96

వ. అప్పిరికి యప్పలుకుల కులికిపడి యమ్మత్తకాశిని చిత్తంబున మత్పాతివ్రత్యవిశేషంబునం జేసి మదీయగళంబున నున్నమంగళసూత్రంబు మిన్నక పరపురుషులకెన్నండును లోచనగోచరంబు గాదు గావున నిమ్మహానుభావుండు హంసకులావతంసం బగుహరిశ్చంద్రనరేంద్రుండు సందేహంబు బొందవల దని యారాజపురందరుం డున్నదురవస్థకుం దనయంతరంగంబునం గలంగి యుక్కరంగనయున తన్నుఁ దా నెఱుంగకమహీతలంబునకు వ్రాలి యొక్కించుక ధైర్యంబున నెట్టకేలకుం దెలివి నొంది. 97

తే. ఓహరిశ్చంద్ర నీపుత్రు లోహితాస్యుఁ, జేరి చూడుము మున్ను నీసూరుపీఠి
నిద్రఁ జెందినకైవడి నేఁడు దీర్ఘ, నిద్ర వోవుచు నున్ననిర్నిద్రతేజ. 98

వ. అని పలికి ప్రాణేశ్వరుచరణకమలంబులకు నమస్కరించి కరంబు శోకంబున నిట్లనియె

సీ. పృథుశిలాస్తంభసంభృత మైనయీమంచె, నవరత్నసింహాసనంబె నీకు
నరశిరఃకలితబంధురకపాలంబులు, మంగళాచారకుంభములె నీకు
శూలాగ్రమానస్థూవరకేశంబులు, రమణీయమగు చామరములె నీకు
భూతబేతాళజంబుకనినాదంబులు, కవిగాయకప్రసంగములె నీకు

గీ. సురుచిరత్రిమహాశ్మశానోపకంఠ, శాకినీలోకభయదశ్మశానభూమి
సకలరాజ్యరమానివాసంబె నీకు, సత్యగుణసంపదభిరామ సార్వభౌమ. 100

సీ. గుమిగూడి యున్నయీకోడిదయ్యంబులు, పంజాలవారలె పార్థివేంద్ర
గారుణఘేవధ్వని కంచుకవ్రాత, సాంద్రహుంగారమే సార్వభౌమ
ప్రీతి జేరి భుజించుబేతాళనివహంబు, మంత్రిసందోహమే మనుజనాథ
సందడి చేయుపిశాచులు నడిగంపు, టలిపలె భానుకులావతంస

గీ. భద్రభూమి యయోధ్యయే భద్రమూర్తి, మంచె సింహాసనమె జగన్మాన్యవీర్య
తోడరి దైవంబు నేమని దూఱుదాన, గటకటా యోహరిశ్చంద్ర కాంతిచంద్ర.

శా. ఆభాగ్యోన్నతి యాసమగ్రవిభవం బారాజసం బాతనూ
శోభాడంబర మాభుజాక్షస్తోమంబు లాప్రాభవం
బో భూమీశ్వర యేచుబోయె నిది దా నోహో మహాశ్చర్య మిం
కెభంగిని దరియింతు వెల్లిగొని పెల్లైతెంచుశోకాంబుధిన్. 102

క. వైణికకరనఖముఖరిత, వీణానాదములు వేడ్క వినియెదు నీ వో
ప్రాణేశ యెట్లు వినెద. క్షీణశివారవము చెవులు చిందఱ వోవన్. 103

వ. అని బహుప్రకారంబుల శోకించునాతలిరాకుబోడిం గనుంగొని యమ్మహీకాం
తుడు మూర్ఛాగతుండై కొండొకసేపునకుం దెలిసి ధైర్యంబు తూల బుత్రశోకం
బునం గుంది కుమారునియశేషవయోరూపగుణవిశేషంబు లంకించుచున్న జీవితేశ్వ
రునిం జూచి వివేకంబు మీఱ నూఱడించి చంద్రమతి యిట్లనియె. 104

చ. ఇనకులసార్వభౌమ మన మిద్దఱము న్ధృతి దూలి యాగఁగన్
ఘనతరశోకవహ్నిఁ బడి క్రాగుచు నుండుట బుద్ధిగాదు నె
మ్మనమున దాల్మి నిల్పి యిక మానుడు దుఃఖము వేగు వయ్యెఁ బ్రొ
ద్దును బసలేదు కుక్కుటతతు ల్వెస గూయఁగ జొచ్చె నెల్లెడన్. 105

తే. ఇచట దడయంగ రాదు నాకినుడు పూర్వ, గిరికి నేతేకమున్న సత్వరమ యరిగి
సమయసముచితకృత్యము ల్సలుపకున్న, నలుగు నామీద మిగులబ్రాహ్మణునిగృహిణి

తే. తనయుపై బర్వుమోహలతావితాన, మాత్మసుజ్ఞానమయనిశితాసి గోసి
యానతిం డింక నేమి సేయంగ నుచిత, నూహించి తగవరి యగుచు నృపుడు.

సీ. ఆకాంతతోడ నిట్లనియె నోరాకేందు, ముఖి స్వామికార్యంబు ముఖ్య మరయ
నేలిక మనమున కెడసీ సత్యముదప్పి. యిప్పని కొడబడ నెట్లు వచ్చు
నికనొండు మాని నిన్నేలినయట్టిధా, త్రీదేవు నడిగి యేరీతి నైన
మాడయొక్కటి దెమ్ము మసలక వేగంబ, తగవు నౌచిత్యంబు దలపు మనిన

గీ. ప్రాణవల్లభుసత్యప్రభావమునకు, మిగుల నచ్చెరువంది యమ్మానినయన

యాత్మజుని భర్తకడ నిడి యప్పగించి, యధికభక్తిప్రణామంబు లాచరించి. 108
తే. మఱచి పురవీథి నేగెడుతఱి నెఱింగి, కపటకృత్యధురీణుండు గాధిసుతుండు
నృపవధూటిని వధియింప నుపమ యొకటి, యాత్మలోపల యోచించె నద్భుతముగ
ఉ. లక్ష్మణుండు యొక్కతస్కరు గల్పించి, యాస్యవినుతశీల యైనట్టి
జనవరేణ్యుదేవి సమయింప దగునుపాయంబు గఱపి యరుగు మనిన వాడు. 110
క. మొల నీలికాసెయును బద, ముల సోరచ్చులు ధరించి ముదము దలిర్పన్
సెలగోలయు ములుబంతియు, బలపముం గత్తియును బూని పటుసాహసియై. 131
సీ. అవారణాసిపురాధీశునగరిలో, భీకరంబుగ గన్నంబు వెట్టి చొచ్చి
ధర్మహర్మ్యాంతరనిర్మితమణిమయ, డోలాగ్రమున సుఖవీల దాది
ప్రక్కనిద్రించు దైవగారామరుని జే, బిగియార గత్తుక పిసికి కడపి
తత్కర్ణకంఠహస్తన్యస్తమణిమయా, భరణము లెకొని భయము లేక
గీ. వెడలి చని చంద్రమతి కడువేగ వచ్చు, పథమునం దడ్డమై నిల్చె పార్థివంబు
గర్వమును మీఱ బల్కె దస్కరుడు కపట, మృదులగంభీరవాచాసమేతు డగుచు
క. ఎట వేగెద వీవెనఁచీ, కటినొంటి మెయి న్నెఱింగి కలతెఱ గెల్లం
దటుకున జెప్పుము నావుడు, గుటిలాలక వాని జూచి గురుతరభీతిన్. 113
తే. వంత బొందుచు దనవృత్తాంత మెల్ల, నెఱుగ జెప్పటయును మృషాకృపదలిర్ప
నాసహోదరివీవు కాంతాలలామ, యేవ్వగా నేమిటికి నీకు నివ్విధమున. 114
సీ. అని పల్కి తనచేతిమనుజేంద్రసుతుసొమ్ము, లన్నియు ముడి గట్టియుంచి యిచ్చె
నాసమయంబున భయంకరాకారులు, యమకింకరులమించునట్టివారగ
లర్పితలవరు లత్యుగ్రకవాల, హస్తులై పదపదం డనుచు నిగిడి
చేదివియలు పూని చెచ్చెర నేతేర, వారికం టెదు ముచ్చు చోరకుండు
గీ. దొంగ బట్టి రండని సంగతిగను, దలవరులలోన గలసి యత్తలిరుబోడి
బట్టికొని భూాంతరముప్పిసుట్టనమిల, పాలు వఱుచుచు నత్యంత భయదభంగి. 115
క. కొని చని వేగమ భీషణుం, డనుతలవరి మోల బెట్టి యద్భుత మడగం
కనుగొను డని తోడవులు ద, క్కనముగ నిడి దొంగ చనియె సాహసలీలన్. 116
ఉ. అంతట భీషణుండు హృదయంబున రోషకృశానులీల ల
త్యంతసమగ్రమై పెరుగ నక్షుల గెంపు జనింప మేదినీ
కాంతునిరాణివాసము నకల్మషపావనశీల జూచి యో
యింతి నృపాత్మజు న్నిశుపు నెట్లు వధించితి సాహసంబునన్. 117
తే. కాంత యిటువంటిబిడ్డల గన్నకడుపు, కాదె నీవ నొకింతయు గరుణలేక
యిట్టిపాతకమున కొడిగట్టితేల, చిత్ర మయ్యెడు మాకు నీచేత దలప. 118

వ. అని పలుకుచు నమ్మహీకాంతునిసమ్ముఖంబునం బెట్టిన నతండు. 119

చ. కలుషవిహీన చంద్రమతి గన్గొని యిట్లని పల్కె నక్కటా
నెలత మహాదురాత్మకుఁడు నిర్దయుఁ డెవ్వఁడు నిన్ను బంపె ని
ట్లలుకను బాలు జంపు మనె యాభరణంబులవాంఛ నీమదిం
గలిగిన నిత్తు నందుకయి గాదిలిపుత్త్రు వధింప నేటికిన్. 120

ఉ. పున్నమచందమామ సరిపోలెడుచక్కనిపట్టి బట్టి సం
పన్నమఘోరసాహసము పర్వఁగ జంపఁగ జేతులాడెనే
యెన్నఁడు నిట్టిపాతకము లెచ్చట నేము ధరిత్రి మున్ను గ
న్గొన్నది లేదు నీకటిన కొత్తలు పుట్టె మహోగ్రకర్మముల్. 121

క. పురుషులకంటెను సాహస, మిరుమూఁడుగుణంబు లగయ నెక్కుడు బింబా
ధరలకు ననియెడువాక్యము, తరుణీ వివరింప నేఁడు తథ్యంబయ్యెన్. 122

ఉ. అని ధరణీశ్వరుండు హృదయంబున శోకము పొంగ భీషణుర
గనుఁగొని దీని జూచిన నఘం బొదవుం గడువేగ బాలఘా
తిని దల ద్రవ్వ నేయు మని తెంపున జెప్పుము వీరబాహుతో
గనికర మింతయు న్నిలుపగా వల దియ్యెడ వేయు నేటికిన్. 123

తే. ఇంక బ్రత్యుత్తరంబు నీ వెద్దియైన, బూని చెప్పితి వేని నాయాన నీక
నిదియ ముమ్మాటికిని నెల వేగు మనిన, నట్లకా కని భీషణుం డనుతించె. 124

తే. అపుడు చంద్రమతీదేవి యాత్మలోన, లేశమాత్రంబు చలనంబు లేక దైవ
మెల్లవగపులు సాయంగ నిచ్చె వరము, తగదు చింతింప నింక డెందమున ననుచు.

చ. తెలివి ఘటిల్ల నెంతయును ధీరతతో దల వంచి యేమియుం
బలుకక మై వడంకగను బల్మరు మిన్నక నేల వ్రాయుచున్
నిలచి కృతాపరాధకగణి న్ధరణీపతిమ్రోల నుండె హృ
జ్జలజమునం దిరిలోకసుతు సత్యధనుం బ్రియునిం దలంచుచున్. 126

వ. అంతట ప్రభాతసమయం బగుటయు. 127

శా. సత్యశ్రీనిధి నేడు ప్రమ్మఱ హరిశ్చంద్రక్షమానాయకుం
డత్యంతస్థిరరాజ్యపేతము ముదం బందంగ నీకీతి నా
చిత్యం బొప్పగ నెక్కునన్నగతి నక్షీణప్రభాస్ఫూర్తి నా
దిత్యుం డయ్యుదయాద్రి నెక్కె ధరణీదేవోత్తము ల్మ్రొక్కఁగన్. 128

వ. అంతట నాభీషణుం డత్యంతరోషంబున గాంతాశిరోమణి యగుచంద్రమతిం
దోడ్కొని పోవం గదిసి రాజవీథిం బౌరకాంతాజనంబులు గనుంగొని. 129

తే. కటకటా చిన్ని నెత్తురుఁగందు రాచ; పట్టి చక్కని పాపని ఖట్టి చంప
నేటిమృత్యుస్వరూపవయ్యె యెచటినుండి, వచ్చె నీపదుచులతిండి యిచ్చటికిని. 130

క. పాదిగిళ్ళలోన బిడ్డల, ముదమున నిడి యూద వలచి ముందటిరీతిం
గొదకొని నిద్రింపఁగ రా, దిది మిగులఁ బ్రమాద మయ్యె నిఁక నివ్వీటన్. 131

క. ధరమీఁద నాఁడుదొంగలు, పరికింపఁగ లేరు తొల్లి పన్నిదమునకుం
గర మాశ్చర్యముగా నీ, పురిలోనం గలిగి రిట్టిబూమెలు గలవే. 132

చ. కలుషము బాలఘాతకము గాదని యాత్మ నొకించుకేనియుం
దలఁకక యిట్టిసాహసము దారుణశీల నొనర్చె నిఁక నీ
యిల నిటువంటిపారలకు నెల్ల భయంబుగ దీని నిర్దయన్
వలయును వధింప దోషము లవంబును జెందదు భూమిభర్తకున్. 133

వ. అని పలికిన వెండియుఁ గొందఱు దమలో నిట్లనిరి. 134

క. ఎంతయపరాధ మొదవిన, నింతిం జంపంగఁ బాడియే పరికింపం
గొంతదయ చూపఁదగు భూ, కాంతునకు వివేకబుద్ధి కలిమి దలిర్పన్. 135

క. సొమ్మొకచో నుండఁగ నప, నమ్మిక యొకచోట నుండు నరులకు నెపుడు
న్నెమ్మదిఁ బరికించి వివే, కమ్మునఁ దెలియంగ వలయుఁ గల్లయు నిజమున్. 136

మ. జలజాతాక్షికి శక్యమే మనమునం జర్చింప నిశ్చితిఁ గో
టలు లంఘించి కవాటము ల్దెఱచి చండస్ఫూర్తిమై నుండుకు
క్కల వాకట్టి నృపావరోధగృహభాగంబు ల్ప్రవేశించి ని
శ్చలత న్సాహసలీల రాకొమరు నాశ్చర్యంబుగాఁ జంపఁగన్. 137

సీ. కపటమార్గమునఁ దస్కరుఁ డెవ్వఁడో దోష, కారి యొక్కఁడు తెంపు గానిపింప
శిశువుఁ జంపి తదీయచిత్రభూషణరాజిఁ, గొనిపోవఁ దలవరు ల్గూడఁ దఱుమఁ
బోదవిన భయమున ముదితపై మచ్చంబు, గాఁగ నాతొడవులు కట్టివైచి
చొప్పునప్పక వాఁడు మరిఁగిన నపరాధ, మెల్లను దాన వహించి యాత్మ

గీ. సిగ్గుపడి రాజసభల భాషింప నోడి, లేనిదొంగతనంబు దాఁ బూని యాత్మ
లోన నొక్కింతయును శంక నూన నీక; పోవుచున్నది కాంబోలు బువ్వుబోఁడి.

వ. అని యనేకు లనేకప్రకారంబులం బలుక నక్కరవాణి వీరబాహుపాలికిం గొని
పోయి మహీనాయకుం డానతిచ్చినవిధంబు తెలియం జెప్పి యప్పడంతి నొప్పనంబు
చేసి భీషణుండు తలవరులుం దానును నిజగృహంబున కరిగె నిట వీరబాహుండును
నిజాధీశ్వరు నాజ్ఞోల్లంఘనంబు చేయం దలంకి రయంబున నత్యంతక్రూరవృత్తులును
భయంకరకరవాలహస్తులు నగునిజకింకరులం గనుంగొని మీర లిందఱుం గూడి
మందగమన నమందగమనంబున బరేతనికేతంబునకుం గొని చని యచ్చటం గలవ

యున్న వీరదాసునిచేతి కమ్మచ్చుకంటి నిచ్చి చంపింపుం డనుటయు వారును బనిపూని
చంద్రమతిం దోడ్కొని పోయి వీరదాసునిముందఱం బెట్టి. 139

క. క్షితిపతినానతియును దమ, పతి యగు నవ్వీరబాహుపంపును గడు న
ద్భుతముగ జెప్పిన నది విని, ధృతి దూలి కలంగి యులికి దీనాననయై. 140

క. మిగుల నెఱఁగంది హా హా, జగమున నెవ్వార లిక శక్తులు విధిచేఁ
త గడవ ధైర్యము నిలుపంగ, దగు నుల్లములోన ననవఁ దగ దించుకయున్. 141

చ. అరసి రణాంగణంబునఁ దృణాంకురప గతవక్త్రిల బ్భయా
కరమతుల న్నిరాయుధుల గర్వము సర్వము నుజ్జగించుచున్
శరణము వేడు వైరులను సారకృపామతిఁ బ్రోచు నేను ని
ష్కరుణఁ గృపాణధారఁ గులకాంత వధింపఁగ నెట్లు పూనుదున్. 142

క. ఈహారిణనయనఁ గెడపిన, స్త్రీహత్యయుఁ గెడపకున్నఁ జెచ్చెర స్వామి
ద్రోహంబును బాటిల్లెడు, నూహించిన నాకు నెద్ది యుచితము చేయన్. 143

వ. అని బాష్పపూరితనేత్రుండై మొగంబు వంచి యున్నయన్నరేంద్రునకుం జంద్ర
మతి యిట్లనియె. 144

క. ఓ వసుధాధిపశేఖర, యీ వెఱఁగని ధర్మమార్గ మెఱుఁగుదు గలదే
భావింప ధైర్య మెడలకఁ, గావింపఁగవలయు స్వామికార్యం బెపుడున్. 145

క. ఊహించి చూడ స్వామి, ద్రోహ మమితభార మనుచుఁ దొల్లి గరుత్మ
ద్వాహనితోడ నిన్నుఁ, దేహంబునఁ బలికె ధరణిదేవి ప్రియేశా. 146

చ. అదియును గాక నా కొమరు నర్భకుఁ జంపె మహోదుశాత్మురా
లిది యనునిందఁ బొందితి నరేశ్వర కావున నింక నవ్వధిం
పఁదగుఁ దలంచి చూడ నణుమాత్రము నొందు దలంపు మానుఁడీ
హృదయములోపలం గరుణ యేటికి నిల్చెద రిట్టిపట్టునన్. 147

తే. మానవులు దేవతలును విస్మయము లొదవ, నిచట నచటను బొగడ మహితలేశ
శంకఁ బొందక మిగుల నిశ్చలత నిలిచి, త్రెంపు మీఱఁగ ద్రెంపు మదీయశిరము. 148

వ. అని యమందధైర్యంబునం జంద్రమతి ప్రాణేశ్వరుపదంబుల కెఱఁగి ముదంబునఁ
గృతప్రదక్షిణ యై కరకమలంబులు మొగిడ్చి దరహాసవికాసంబులు వదనంబునం బ్ర
కాశింప నిరంతరరక్తపంకసంసిక్తంబై చూపట్టు వధ్యశిలోపరిభాగంబునం బద్మాస
నంబునం గూర్చుండి మార్తాండమండలంబుపైఁ జూడ్కి నిలిపి. 149

తే. నిఖిలలోకైకవంద్య యో నీరజాప్త, నాకుఁ గృపతోడ జన్మజన్మములయందు
సత్యసంశీలుఁ డగుహరిశ్చంద్రనృపతిఁ, బ్రాణనాయకుగా నొనర్పంగవలయు. 150

వ. అని యత్యంతతాత్పర్యంబున నాదిత్యుం బ్రార్థించి ప్రాణవల్లభు నుల్లంబునం జేర్చియుం



దుటయు నవ్వాలుగంటిం గనుంగొని మహీపాలుండు తదీయధైర్యవివేకంబులకుమనం
బున విస్మయంబును బొంది సకలజగదాశ్చర్యంబుగా నిశ్చలత్వంబునం గదిసి సింధు
వేలావలయితవసుంధరాభారభరణసామర్థ్యంబున నొప్పు వామేతరభుజాదండంబున
బ్రచండరిపుశిరఃఖండనోగ్రం బగుమండలాగ్రం బమర్చి చంద్రమతీకంఠభాగంబునం
గదియించి యున్నసమయంబున. 151

తే. భానుబింబసముజ్జ్వలప్రభలు ప్రబ్బ, గదిసి గ్రక్కున నెడ జొచ్చి గాధిపట్టి
చేతిఖడ్గంబు పట్టి ధాత్రీతలేశు, బలికె రోషాతిరేకసంభాషణములు. 152

ఉ. చాలు బురే నరేశ్వర ప్రచండతరం బగునిట్టిసాహసం
బేల యొనర్చెదీవు, నిను నీక్షణ సేయఁగఁ బాతకంబు చం
డాలున కైనఁ గొంత కరుణారస ముబ్బు మనంబులోన
బాలికఁ జూచినం గినిసి పాయకఁ జంపుతలంపు పుట్టునే. 153

క. దానవుఁడవు గా కరయగ, మానవుఁడవె నీవు నిన్ను మగువఁ జంపం
గా నియమించె నె మీగురు, వైనవసిష్ఠుఁడు కడునురాత్ముఁడ వెఁదున్. 154

క. బలవద్గర్వితవైరుల, గళములు దునుమంగ శక్తిఁగలనీఖడ్గం
బెలతీగబోడులను బి, ట్టులుక వధింపంగఁ దొడఁగెనా యిటు దగునే. 155

తే. సరవి ధర్మార్థకామమోక్షములు నాల్గు, నీకు నొసఁగంగఁ జాలు వర్ణితచరిత్ర
నీపురంధ్రీశిరోమణి నెట్లు చంపఁ, బూనినాఁడవు నీబుద్ధిపోఁడి మిదియె. 156

ఉ. పావనమై నుతింపఁ దగుభానుకులంబున నుద్భవించి ధా
త్రీవర వర్తనం బుడిగి దీనగతిన్ వెలివాడవానికిన్
సేవ యొనర్చి ప్రేతవనసీమ వసించుట నీకు ధర్మమే
భావములోఁ దలంచిన నపాత్రము నీదుచరిత్ర మెంతయున్. 156

చ. కులసతిఁ గ్రూరఖడ్గహతిఁ గూలిచి పొందెడుసౌఖ్య మెల్ల ని
ష్ఫలము దలంచి చూడ నరపాలక భార్యకు నైమహోగ్రతం
దొలఁగక దక్షునిం గినుకతో వధియించినశూలపాణికిన్
వెలయఁగ నీకుఁ గల్గినవివేకము బుద్ధియు లేక యుండెనే. 157

ఉ. కావున నిట్టియుగ్రతరకర్మము సాహసవృత్తిఁ జేయ ధా
త్రీవర నీతి గాదు భవదీయవివేకవిశేష మిట్టిదే
భూవలయంబులోన నినుఁ బుణ్యచరిత్రుఁడ వంచు బూని నా
నావనినాథపుంగవసభాంతరనూనజను ల్నుతింపఁగన్. 159

మత్తకోకిల. నాకుమారికలం దిరిలోకజనస్తుతోజ్జ్వలరూపరే
ఖాకళానిధు లైనయంత్యశచ్యల న్వరియించినన్

నీకుమారునిప్రాణము లత్రతి నీసముజ్జ్వలరాజ్యము
నీకులాంగనతోడఁ బాసినను నీకు నిప్పుడె కల్గెడిన్. 160

వ. అని బహువిధంబులం బోధించు నగ్గాధినందనుం గనుంగొని యమ్మానవాధీశ్వరుండు
దరహసితాననుండై. 161

క. ఓఋషినాయక యీసంసారపయోరాశి నీఁగ సంప్రాప్తునిగాఁ
జేంచి యీకాశీపురి గౌరీపతి నన్నుఁ బ్రోవఁ గరుణఁ దలంచెన్. 162

చ. ఇతరునిఁ బోలె బల్కులు మునీశ్వర భ్రమియింప నేల యీ
గతి బహుభంగులం గమలగర్భునకైనను బూని నిల్ప స
మ్మతి భయ మేది మీ కెదిరి మాఱ్పలుకంగ దరంబు గాదు దు
ష్కృతనిబిడాంధకారసరసీరుహబాంధవ నాకు శక్యమే. 163

క. అనఘాత్మ మీరు మును నుడి, విన బుద్ధులె కాక నేడు వింతలు వివరిం
చిన నిందులోన లే విక, యను దేమియు బలుక వలదు సారెకు నన్నున్. 164

తే. పలుమఱును మీకు నిన్ని చెప్పంగ నేల, చేతిఖడ్గంబు విడువు కౌశికమునీంద్ర
యిట్టితఱి నుండ జనదు మీ కిచట నిట్లు, వేగ విచ్చేయు డిది నాదువిన్నపంబు.

వ. అనుటయు నాహరిశ్చంద్ర నరేంద్రునినిత్యసత్యప్రభావంబునకు నత్యాశ్చర్యంబును
బొంది మృషావాదిం జేయుదు ననుతలంపు ముదిరించి విశ్వామిత్రుండు తపోవనంబు
నకుం జనియె నప్పు డంబరంబునం బ్రమోదంబునం జెలంగి నిజాంగనాసమేత ఖచర
వ్రాతంబు లసమానంబు లగు విమానంబు లెక్కి క్రిక్కిఱిసి విస్మయంబు వొడవం
గనుంగొనుచుండ నఖండసాహసంబున నమ్మహీమండలేశ్వరుం డాఖండలకరవజ్ర
ప్రచండం బగుకరవాలంబున నాగోలంబవేణి కంఠనాళంబు వ్రేయుటయు నవ్వేటు
ప్రసూనదామకంబుగతి నభిరామం బగుచు బురంధ్రీశిరోమణిగళంబునం గీలుకొనిన
శిరఃకంపంబు జేసి మహీవల్లభుండు. 166

క. కలహంసగమన త్రివ్వని, గళము నిరీక్షించి వివిధగర్వితరిపుభూ
తలపతులమెడలు మునుమునఁ, గలకరిఖడ్గంబు చూచి కడువిస్మితుడై. 167

తే. దారి తప్పెనో గెంటి యీతమ్మికంటి, శిల మెట్టెనో కాక కౌశికమునీంద్ర
జాలమో మద్భుజాశక్తి దూలిచెనో, పొంగి యింకొక్కమాటు వ్రేయంగవలయు

క. అనిపోవఁగ వచ్చెనె నా, యసి పోవక యుండుచు మిగుల నాగ్రహలీలం
గొసరక మఱియును హమ్మని, యసమగతిం బూని వ్రేయు నాసమయమునన్. 168

శా. పక్షీంద్రధ్వజపద్మజప్రముఖు లాబర్హిర్ముఖుల్ గొల్వగా
నుక్షాధీశ్వరు నెక్కి శైలతనయాయుక్తుంబుగా భక్తసం
రక్షాదక్షుండు విశ్వనాథుడు సువర్ణగ్రావకోదండి దా

సాక్షాత్కారముఁ బొందె సత్కృప హరిశ్చంద్రక్షమాభర్త కన్. 170

సీ. ఆకాశగంగతో నమృతాంశురేఖతోఁ, బల్లవారుణజటాభరముతోడ
ఫాలలోచనముతో ఫణికుండలములతో, గాలకూటవినీలగళముతోడ
హరిణడింభంబుతో నజగవధనువుతో, డమరుశాతత్రిశూలములతోడ
నజశిరోమాలికాగజచర్మములతోడ, భసితాంగరాగవిభ్రమముతోడ

గీ. సౌరభోజ్జ్వలపుష్పవర్షంబుతోడ, దివిజసందోహరణితవాదిత్రశబ్ద
సహితనారదవల్లకీస్వనముతోడ, శివుడు గిరిరాజకన్యకాధవుడు పొలిచె. 171

వ. ఇవ్విధంబున జంద్రశేఖరుండు ప్రత్యక్షం బగుటయు నవ్వసుంధరాధ్యక్షుం డత్యంత భక్తితాత్పర్యంబును సంభ్రమంబును బ్రియంబును భయంబును వినయంబును విస్మయంబును నయంబును నుల్లంబున నొక్కమొగిం బిక్కటిల్ల దేహంబునం బులకాంకురసమూహంబు లసమానంబులై జనియింప నానందబాష్పబిందుబృందంబులు నయనారవిందంబులం దొరుంగ సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి నిలిచి ముకుళితకరకమలుండై. 172

సీ. జయ పార్వతీమనోజలజాతమార్తాండ, జయ రసాతలవిభూషణకరండ
జయ గజాసురగర్వజలదజగత్ప్రాణ, జయ భక్తలోకరక్షాధురీణ
జయ ఫాలలోచనజ్వలనజితానంగ, జయ పాణిసంభృతోజ్జ్వలకురంగ
జయ వియద్వాహినీశశికలాకోటీర, జయ కుందచందనసమశరీర

గీ. జయ రమాధీశభారతీప్రియపురంద, రాజగీర్వాణముకుటవిన్యస్తరత్న
పటలశోభావిభాసితపాదపద్మ, జయ మనోహరకలధౌతశైలసదన. 173

క. అని బహువిధముల భక్తిని, వినుతించుచు నున్నభూమివిభు జూచి కృపా
ఘనరాశి భక్తజనశో, ధనదాయి మహానురాగభరితాత్ముండై. 174

ఉ. భూతకులాగ్రగణ్య నిను బోలునృపాలురు లేరు చూడగా
నీపదునాల్గులోకముల నెంతయు మేలు నితాంతసూనృతా
లాపవిశేషధైర్యగుణలక్షణసాహసవైభవశ్రీ గా
దీపిత మయ్యె నీనడత దివ్యమునీశ్వరవర్ణనీయమై. 175

క. అచ్చముగ మాదుమెచ్చులు, మెచ్చితి జిత్తమున గరుణ మిక్కుటమయ్యెన్
నిచ్చలముగ నడుగుము నీ, కిచ్చెద వలసినవరంబు లెయ్యవి యైనన్. 176

తే. అనుచు డాయంగ రమ్మని యాదరించి, మృదులకరపంకజంబున మేను నిమిరి
గారవం బొప్ప దాపలికంటిచూపు, పరగ నిగిడించుటయు మహీపాలవరుఁడు 177

వ. లజ్జావనతవదనుండై యేమియుం బలుక నేరకయున్నం దదీయమనోభావం బెఱింగి యచ్ఛావజారాతి సెలవి బాఱఁగ నవ్వి యిట్లనియె. 178

చ. వలముగ మేన నెల్ల భసితం బెసలార నలంది చర్మమి
మ్ముల మొల గట్టి భూతగణము ల్భజియింపగ ప్రేతభూ
ముల వసియించుచుంటి నను బోటివాడవు నీవు నీకు నో
నలినహితాన్వయాభరణ నాన వహింపగ నేటికి న్మెయిన్. 179

మ. ఇది గాధేయము పొందద్రిజాలము ధరిత్రీశా సమస్తంబు ప
స్మన మొప్ప న్వినిపించెద న్వినుము యుష్మత్పూర్వతాలాపపం
పద యెల్లం దెలియంగ గోర చలముం బంతంబు రెట్టింప ని
ట్టివశం గుందగ జేసె మౌని తనకౌటిల్యం బు పాటిల్లగన్, 180

సీ. ఇది ప్రేతభూమి గా దినకులేశ్వర పావనం బగుయజ్ఞవాటంబు గాని
యస్థిపోత్రులును గా పమితసూనృతవచ, స్సౌభాగ్యబహుసమిత్సమితి గాని
ఘనకపాలములు గా వనవద్యసాహస, విమలోపకరణపాత్రములు గాని
యస్థిపోత్రులును గా విమితసూనృతవచ, స్సౌభాగ్యబహుసమిత్సమితి గాని
ఘనకపాలములు గావనవద్యసాహస, విమలోపకరణపాత్రములు గాని
రక్తపూర్వము గాదు రాజన్యలోకైక. నాథహయ్యంగవీనంబు గాని
గీ. కడిందికొఱ్ఱులు గావు సంగరజయాంక, పాదుకొల్పిన భూతియూపములు గాని
చికురజాలంబు గాదు శిక్షితసమస్త, విమతనరపాల నవకుశవితతి గాని. 181

క. ఓలి నిను భృత్యునిం గా. నేలినయవీరబాహు డిలలోపల జం
డాలుడు గాడు కృతాంకుడు, నాళీకహితాన్వయాబ్ధివత్సుత్రేశా. 182

క. నీసతి బిలిచి తలంకక, దాసింగా నేలునతడు తక్కంగంగా
భూసురుడు గాడు మారూ. పేసపు గిలిరాజు గాని విమలచరిత్రా. 183

తే. నీకు డెందంబులోన సందేహ మేల, చేరి విశ్వాస మొదవ వీక్షింపు మనుచు
శుద్ధమతి దివ్యదృష్టి యిచ్చుటయు సర్వ. ముసుగనుంగొని వెఱగందె మనుజవిభుడు.

వ. ఆనందకందళితహృదయారవిందుండై చంద్రమతియుం దాను నమ్మౌనిమౌళికి
బునఃప్రణామం బాచరించి వినయవినమితోత్తమాంగుండై. 185

ఉ. శ్రీగంగేశ మీకరుణ జేసి మదీయము లైనయట్టియ
జ్ఞానమహాంధకారములు సర్వము నాకు దొలంగి పోయె సు
జ్ఞానదివాకరోదయము చాలగ సొంపు వహించె నీభవాం
భోనిధి నేటితోడ నను బూని తరింపగ జేయుమీ దయన్. 186

క. మీపదపంకజసేవా, నైపుణమానసుని జేసి నను సత్కరుణం
జేపట్టి ప్రోవు భూసుర. చాప జగద్భరితరూప చంద్రికలాపా. 187

తే. నిన్ను హృదయాంబుజంబున నిండు వేడ్క, గొలల సద్భక్తి నిల్ప గల్గుటయె దక్క
వరము లొండెవ్వియును నొల్ల వరమునీంద్ర, సముదయార్చిత నీదుపాదములయాన

వ. అని పలుక నప్పు డమ్మహాదేవు వామాంగంబున నున్నసర్వమంగళ చంద్రమతిం గనుం
గొని. 180

ఉ. ఓపికవాణి నీకుఁ గలయోపిక వాణికి లేదు వాక్ప్రవే
లాపవిశిష్టితక్షితితలంబున నీసరి లేరు భామినుల్
నీపతిభక్తియు న్యుక్తియును నీమతిశుద్ధియు నీవివేకవా
గ్నైపుణము న్భుజంగధరలనాథున కైన నుతింప శక్యమే. 190

క. గళమున నొప్పెడు నీమం, గళసూత్రము పెంపె గాదె గణుతింపఁగ బె
క్కులు భయదోపద్రవములు. దొలఁగించె భవత్ప్రియునకుఁ దోయజగంధీ. 191

మ. చిరకాలంబు సమగ్రరాజ్యవిభవశ్రీఁ జెంది వర్ధిల్లి యీ
ధరణీమండల మేలు నీకుఁ బ్రియభర్తం గూడి యెంచి సుం
దరి మాయొద్దనె యుండు మంతయుఁ గృతార్థత్వంబు మై నిప్పుడే
వర మైనం దగ వేఁడు మిచ్చెద గడు న్వాత్సల్య ముప్పొంగఁగన్. 192

వ. అనుటయుం జంద్రమతి యగ్రేంద్రనందనచరణారవిందంబులకుం బ్రణమిల్లి యో
తల్లీ యిప్పటి భేదనం బేలుమహీవల్లభకుమారుని సజీవునిం జేసి నాకుం బ్రాపించిన
నింద తొలంగం జేయు మనిన నమందసంతోషితస్వాంత యై యమ్మహీపాలబాలుం
డింతకుమున్న బ్రతుకుం భవత్తనూజుప్రాణంబు లిచ్చితి బరమహర్షంబునం బొందు
మను సమయంబున. 193

చ. పొలుపుగ నిద్ర మేల్కనినపోలిక నల్లన లేచి వచ్చె గో
మలపదపద్మసంఘటితమంజులనూపురకింకిణీరవం
బులు గడుఁ బర్వ లేనగవు ముద్దులచెక్కులఁ దొంగలింప న
జ్జ్వలమతి లోహితాస్యుఁడు నిశాకరతుల్యుఁడు సంభ్రమంబునన్. 184

తే. ఇట్లు వచ్చునందను నెలమి దొలక, జంద్రమతి చూచి యానందజనితబాష్ప
కణము లుప్పొంగ నక్కున గదియ నొత్తి, యమరఁ గౌఁగిటఁ జేర్చి ముద్దాడుచుండె.

క. ఆవేళ గౌశికుఁడు నల, జావనతశిరస్కుఁ డగుచు నాగ్రహ మెల్లం
బోవంగ విడిచి యతిదై, న్యావహముగ జింత నొంది యద్భుత మదరన్. 196

క. చిరకాలార్జిత మగుమ, త్పరమతపోధనము గంటి వడి కడు ఖతిగన్
దురహంకృతి నే బలికిన, నిరుపమఘోరప్రతిజ్ఞ నెపమున నకటా. 197

ఉ. పాకనిరోధి యేమిటికి బ్రశ్న మొనర్చె సమస్తతాపసా
నీకము నూరకుండ నతినిగ్రహగర్వము పూని జేలవై
తో కొని యవ్వసిష్ఠమునితోడుత నేటికి నాగ్రహించితిన్
నాకు వివేకహీనత మనంబున నేటికి బుట్టె నయ్యెడన్. 198

ఉ. నలినసుహృత్కులీన పదునాల్గుమహాయుగము ల్వసుంధరా
స్థలికి నధీశుగా నిను ముదంబున నిల్పెద నంచుఁ బూని నేఁ
బలికినవాఁడ నాప్రతిన ప్రోదిగ వహింపఁగ నంతకాలమున్
జలధిపరీతభూతలము సర్వము నేలు ప్రజానురాగివై. 211

కం. ధరమీఁదఁ బాకశాసను, సరిగద్దియ నొగిఁ జతుర్దశమహామన్వం
తరములు నిలిపెద ననుచుం, దిరముగ నేఁ బల్కినాఁడఁ ద్రిదశులు వినఁగన్.

కం. అరిదాక నుండు మధికా, నందంబును బొంది నీవు నాకంబున సం
క్రందనుమూఁటగద్దియ, నిందుక శార్ఙ్గధరునియాన యిఁక నేమనినన్. 213

ఆ. అనిన నొండు పలుక నాత్మలోఁ శంకించి యినకులాధినాథుఁ డేమి యనఁగ
నేమి యగునొ యనుచు నెంతయుఁ జింతించు, చున్నయంత శిష్యు లోలిఁ గొలువ.

ఉ. తోయజగర్భసన్నిభుఁడు దుష్కృతపర్వతవజ్రపాణి యా
మ్నాయరహస్యవేది యసమానతపోవిభవప్రభావధా
రేయుఁడు శైవమార్గసుచరిత్రుఁడు పాత్రు దరుంధతీసతీ
నాయకు డవ్వసిష్ఠమునినాథుఁడు వేడుక వచ్చె జెచ్చెరన్. 215

గీ. వచ్చి రాజీవబాంధవవంశతిలకుఁ డెదుర నిలుచుటయును జూచి హృదయ మలర
మ్రొక్కి యిట్లని పలికె సోమునివరేణ్య, మిగుల బుణ్యుండనైతి నే మీకతమున.

చ. పరుసముతోడ మోపి సులభంబుగ లోహముఁ గాంచనంబుగాఁ
బరువడఁ జేసినట్లు నిరపాయతపోమహిమానుభావబం
ధురుఁ డగుగాధినందనునితోడుత నన్నెనయించి సత్యసు
స్థిరతరకీర్తిమంతునిగ జేసితి రెంతయు సత్కృపారతిన్. 217

కం. భూతలనాథులలోపల, నాతత మగుకీర్తి నేఁ గృతార్థుఁడ నైతిన్
మీతలఁ పొనరి యిం డిక, నేతెఱఁగున నడతు నుచిత మెయ్యది యనినన్. 218

ఉ. శ్రీకరసత్యవైభవవశీకృతచంద్రకళావతంస యి
క్ష్వాకులకీర్తి నీకతన వన్నియ మించె ధరిత్రిమీఁద సు
శ్లోకుఁడ వీవు నీవు గలసూనృతధైర్యవివేక దానరే
ఖాకలితప్రతాపములు గన్గొన మెవ్వరియందు నెచ్చటన్. 219

కం. అనఘాత్మ నాపురోహితుఁ, డని యెంతయు నాదరించి యరుదుగ నాచే
సినప్రతిన దప్పకుండఁగ, నను గెలిపించితివి త్రిభువనంబు లెఱుంగన్. 220

కం. ఈకౌశికమునిపుంగవు, డేకరణి న్మెలఁగు మనియె నేపారంగా
నాకరణిన మెలఁగం దగు, నాకాధిపసదృశ యిదియ నాదుతలంపున్. 221

కం. నావుడు గురువాక్యంబులు, దోవక గాధేయునాజ్ఞ తోఁ బృథుభక్తిన్

గావింప నియమతించె మ, హీవల్లభుఁ డంత నిర్జరేంద్రుఁడు కడఁకన్. 222

సీ. సుదినాంబు పుష్పుర మణిసుధము లియ, న్నదివాని బ్వించి ననవరేణ్యు
జానొంద మంగళస్నానంబు చేయించి, పావస్త్రబహువిభాభరణగంధ
మాల్యాదివస్తుసామగ్రిచే నెంతయు, శ్రీలు మీఱఁగ నలంకృతుఁ జేసి
చంద్రికాంతశిలావిశాలవితర్దికో, పంభాగమునఁ జాల బ్రియత మీఱ

గీ. మేరుశిఖరంబుతోడుత మేల మాను, భద్రపీఠంబు సంబునఁ బరఁగ నునిచి
యగ్రజన్ముల నుచితదానాదివిధుల, బ్రీతచిత్తుల గావించి ప్రియము వెలయ. 223

వ. ఇందుశేఖరుండు పాపిశేషంబున నవ్విశ్వంభరామండలంబు సమస్తంబును మాన్యంబున నేలు మని సమగ్రవైభవంబున బట్టంబు గట్టె నాసమయంబునం గమలాసనాది గీర్వాణులు వసిష్ఠవిశ్వామిత్రసంయమిజనంబులు ననేకప్రకారంబుల నాశీర్వదించి మంత్రాక్షతంబు లిడి రప్పుడు. 224

సీ. దివి నాదితేయవాదిత్రము ల్ఘోషించెఁ, గురిసెను గుప్పగా విరులవాన
గంధర్వకామినీగానము ల్వెలసిల్లె, నప్సరస స్త్రీలనాట్యములు చెలఁగె
నత్యంతసౌరభశైత్యమాంద్యంబుల, మలయానిలము వీచెఁ గలయ దిశల
దహనుఁ డొప్పారె బ్రదక్షిణార్చులచేత, నిశిచంద్రుని బోలు లేపు చూపె

గీ. భుజగపతిశాధినాథదిగ్గజవరాహ, కూర్మకులపర్వతంబులు కుతలభార
మెడల విశ్రాంతి వహించె నెలమి బోలక, సకలజీవులు బొందిరి సమ్మదముల.

వ. తదనంతరంబ. 226

తే. చంద్రశేఖరుఁ డాహరిశ్చంద్రు జూచి, యీవు సాకేతపురమున కేగుమనుచు
హావింపఁ పురందరాద్యమరవరులఁ గొలువ వేంచేసె గైలాసనగరమునకు. 227

క. అంతట దక్షప్రతిష్ఠింబు, నంతయు నారదమునివలన నమరగ విని య
త్యంతప్రమోదభరంత, స్వాంతుండై సత్యకీర్తి సంభ్రమ మొప్పన్. 228

క. క్ష్మాకాంతమాళిరత్నము, రాక పురంబు జాటఁ బంచె రయమునఁ దద్రా
రాకర్ణనసంజనితమ, హాకౌతుకములఁ జెలంగి యప్పుడు పౌరుల్. 229

వ. ఒహుప్రకారంబుల నత్యంత రమ్యంబుగా పురం బలంకరించి రాసమయంబున నప్ర మితకరిహయరథపదాతిసమేతుండై మంగళతూర్యరవంబులు చెలంగ నుష్ణాంశుసమగ్రవైభవంబున. 230

ఉ. పున్నమనాటి రేయిపరిపూర్ణసుధాకరు రాక గాంచి సం
పన్నకుతూహలస్ఫురణ పర్వగ నంబుధిరాజు దా నెదు
ర్కొన్న విధంబునన్ నృపశిరోమణి రాకకు సత్యకీర్తి య
త్యున్నతభక్తియుక్తి చెలు వొంద నెదుర్కొనినం బ్రియంబునన్. 231

తే. ఎదురుకొని వచ్చినంత నమ్మునిశేఖరు, నంఘ్రిపంకజములకు సాష్టాంగ మెఱఁగి
కేలుదమ్ములు శిరముపైఁ గీలుకొలిపి, పలికె నిట్లని వినయసంభాషణముల. 232

ఉ. సౌందర్యయశోనిధాన సత్యవచోమణిహార యోహరి
శ్చంద్రనరేంద్ర వంశవనచైత్ర యమిత్రజయప్రతాపని
స్తంద్ర పురందరాదివిబుధప్రజపూజితపట్టభద్ర భో
గీంద్రున కైన శక్య మగునే నుతియింప భవత్ప్రభావముల్. 233

మ. అనఘుం డైనవసిష్ఠుతో నొఱసి లోకాశ్చర్యధుర్యంబుగాఁ
దనయక్షీణతపోవిశేషగరిమ న్దర్పించి బ్రహ్మర్షి యై
వినుతిం బొందినవేదమూర్తి త్రిజగద్విఖ్యాతుఁ డగ్గాధినం
దనుఁ డెంతే వెఱఁగందఁ నిల్పితివి నిత్యం బైనసత్యం బిలన్. 234

తే. మహిమతో నింకఁ బూజ్యసామ్రాజ్యలక్ష్మి, వెలయఁ గైకొని భూప్రజావితతిఁ బ్రోవ
వేగ విచ్చేయుఁ డని విన్నవించుటయును, హర్ష మొదవంగ దరహసితాస్యుఁ డగుచు

చ. సముచితవాగ్విశేషముల సంతస మొందఁగ సత్యకీర్తిను
త్తమసచివాగ్రణిన్ నిజహితస్థితికార్యరహస్యవేదిదు
ర్విమతసమూహసంహరణవిక్రము నిం దగ నాదరించి ర
త్నమయవినూత్నకాంచనరథంబు ముదంబున నెక్కె నున్నతిన్. 236

సీ. అమలంబు లగుచతురంగబలంబులు, గ్రమ్మి సేవించి నల్గడల గొలువ
హృద్యంబులై బహువాద్యరవంబులు, మ్రోయ మాగధగానములు చెలంగ
గంకణఝణఝణత్కారము ల్చెలరేగ, రమణులు వింజామరములు వీవఁ

గీ. గలికికన్నులవారకాంతులు వసించు, పళ్లెరంబుల రత్నదీపములు నించి
నిండువేడ్క నివాళింప నిజపురంబు, మంచిశుభలగ్నమునఁ బ్రవేశించె నృపతి. 237

వ. ఇవ్విధంబునం బురంబు ప్రవేశించి రాజమార్గంబునం జనుదెంచునప్పుడు. 238

సీ. అరవిందనాభుఁ డీయవనీతలేశ్వరుఁ, డిందిర యీశరదిందువదన
పాకశాసను డీదివాకరాన్వయభర్త, పౌలోమి యీపురంధ్రీలలామ
నీహారకిరణుఁ డీనిత్యసత్యధనుండు, రోహిణి యీపంకరుహదళాక్షి
ప్రసవకోదండు డీరాజదేవేంద్రుండు, రతిదేవి యీలోకనుతచరిత్ర

గీ. యని హరిశ్చంద్రసార్వభౌమాగ్రగణ్యుఁ, జంద్రమతిఁ జూచి యానందజలధిఁ దేలి
పౌరజనబృందములు సుధాసారమధుర, చిత్రవాగ్వైఖరుల బ్రశంసించి రలమి.

వ. ఇవ్విధంబునం బౌరజననికాయసంస్తూయమానుండై హరిశ్చంద్రుండు మహానందంబు
ను బొంది నిజమందిరంబు దఱిసి సముచితవర్తనంబునం బ్రవర్తించుచున యమార్గ

బున ప్రజాపరిపాలనాశీలుండై పూజ్యం బగు రాజ్యంబు సేయుచుండెనని. 240

మునిపసమాఖ్యుం డేయుం, దన యందు యథోక్తగుణకు ననురాగ మునన్
వినిపించె హరిశ్చంద్రా, వనినాథుకథాక్రమం బవార్యప్రౌఢిన్. 241

శా. వాగ్గోభీంద్రసుపర్వసింధుశరదభ్రాభ్రాహతానుధా
రుగ్భద్రాచలచాపగోపరుచక్షత్రోత్పీతచ్ఛటామల్లికా
ప్రస్తాభప్రథమాక్షుభ్రకీర్తిరుచిరశ్రేణికాపుష్ప
ద్దిగ్భామాకుచమండలాగ్ర వివిధార్థివ్రాతచింతామణీ. 242

క. అలఘుప్రతాపస్ఫురణ బ, మలకేంద్రకృపాసమగ్రమహిమాన్విత లో
ర్కాలనిగ్రామణి కేతన, జలసీమారక్షణైకచాతుర్యనిధీ. 243

ఉత్సాహ. రాట్సభాంతరాళధీధురంధరప్రశస్తపా
వృట్సమాగమాంబుభృత్సుపీనదానగర్వితా
ద్విట్సమాజదంతిసింహ ధీరతాసురాచలా
షట్సహస్రవంశదుగ్ధసాగరక్షపాధిపా. 244

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకలసుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార రావినయవివేకవిద్యాలంకారశంకరకవినామధేయ ప్రణీతం బయినహరిశ్చంద్రోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

హరిశ్చంద్రోపాఖ్యానము సంపూర్ణము.



దేశీయవిద్యాలయ ముద్రాశాలమున ముద్రింపబడినది. రాజమండ్రి

# దండకరత్నములు

ఆంజనేయుదండకము, సూర్యనారాయణదండకము, నూకాలమ్మ దండకము, సోమాలమ్మదండకము, గంగాలమ్మదండకము, మహాశక్తి దండకము. ఈమొదలగు యిరువది దండకములు హిందూదేశములో తరుచుగా వ్యాపించెడి మతాచారిలో నుపయోగించుటకు మహాశక్తిదండకము మొదలగునవి పనికివచ్చును. వెల 0—6—0

# హాస్యపుపాటలు

గుంజడానికి పనికిరాని యింజరంపాట. లంకణాలు చేయుచున్న రాధాకీబోటు పాట, గుమ్మగు బల్ముస్తులగుమ్మసుద్దులపాట, వస్త్రాదుల కైనను యెత్తరాని బస్తాలమోత. తమాషాకు తమాషాపాట. అచ్చటచ్చటగల కోట్టుముచ్చట్లు, రండలందరిలో సీముండపాట, చిత్రమగు విచిత్రవివాహము. కంగారులేకుండా కంన్లుపోవుటకు క్రొత్తమొక్కుబడులు. లౌకికమెరుగని వైదికసరసము. చంచలమగు దాంపత్యపుపాట. జగమంతయు వ్యాపించిన సిరిసిరిమువ్వపాట. వలదన్నన యొసగేవల్లమాలిన కల్లబహుమతులు. వాసివసులేని జోలపాట. బత్తెములేని ముత్తిపాట. బాలుల తమాషాకు బండిపాట. చిత్తకార్తిలోగత్తిగిలేకుండానే జగేగోగుబాకపాట. యెల్లరనేడ్పించు కల్లుపాట. కుండపాట. నారాయణమ్మ, నాయుడుబావపాట యిల్లిల్లుగుల్లజేసి కల్లనిపించు జూదము. పొడుముకాయ, చేతగాని నామగడ వేడుబడదామురాపాట. నిరసనభావముగలిగించు వల్లమాలిన సరసముతో 26 పాటలు గలవు గ్రామఫోను వరుసలతో నూతనముగా తయారు కాబడినవి. వెల 0—6—0

---

కొండపల్లి వీరవెంకయ్య, బుక్సెల్లరు, రాజమండ్రి.

BCI

# అదృష్టదీపిక.

సోదరా! నీయదృష్టము నొక్కసారి చూచుకొనుము.

“అవసానకు అందని అప్పుల”వలె నీయదృష్టమును ఎవ రెన్ని విధములఁ జెప్పినను, తప్పో, ఒప్పో, కాకపోదు. మొగమాటమునకు కలలెరుంగుంటయు తెలుపక నిన్ను చీకాకుపరచు నవసరములేకుండ దురదృష్ట గ్రహశాంతికొరకు నీ “అదృష్ట దీపిక” కరదీపికగా నుండ గలదనునమ్మకముతోఁ నెక్కుసంగతులు జేర్చి, ముహూర్తభాగము, జాతకభాగము, సాముద్రికభాగము, వాస్తుప్రకరణము, ప్రశ్నభాగము గౌళీశాస్త్రము, సాముద్రికభాగమును పదుభాగములు గలిపి ఒకే పుస్తకముగా బయిండు చేసియున్నాము. సర్వజనులకు నుపకరించునది గనుక వెల 0—10—0 మాత్రమే.

# సాముద్రికశాస్త్రము.

భాంటయు సోదరా?

నీచేతిని నిజముగాను యితరుల యెదుట చెప్పనవసరములేదు. భారతభూమియందలి పాశ్చాత్యమికాది వృత్తాంతములు ప్రాచీనశాస్త్ర గ్రంథములు సంపాదించునటకు సాముద్రికశాస్త్రమును నపుస్తకరూపముగా వ్రాసినాము. దీనిని [illegible] సర్వభాగములు [illegible] రేఖలయొక్క [illegible] నాయ [illegible] కొందువు. సర్వజనాదరంబున బడసిన యీగ్రంథము [illegible] ధ్యాలు [illegible] రేఖల, గము [illegible] త్వర్యసహితంబుగ [illegible] యీ [illegible] తిమి. పండితులకంట [illegible] చూచు [illegible]

---

కొండపల్లి పిచ్చివానయ్య, బుక్సెల్లరు [illegible]

8c

# శివానందలహరి

వేదాంతమంతయు కలియుగాంతమువఱకు నిలుచునట్లు—ముక్తి యంతయు తన శక్తిపైననే నిలిచినట్లు—దైవబలమే తమబలమని సన్యసించిన సాధువులు వాకొనునట్లు—దుర్బలమగు నీకాయ మేగిన పిదప అంతయు వమ్మనినట్లు—జగద్గురుని శాసనవాక్యులు అర్థములతో సహా చక్కగ ముద్రించి, సరసమగు వెలతో బయల్వెడినది. కాన ఆంధ్రులెల్లరు ఆదరణముచూపి, పఠనజేయవలసిన యీతరుణమును వ్యర్థాగానీయకుడని హెచ్చరించుచున్నాము.

వెల 0—8—0

## ఆశాపిశాచము

అద్భుతములచే నిండిన అపరాధ పరిశోధక నవల.

కుందనలాలు నావహించిన ఆశాపిశాచము మాధవలాలు మరణమునకు కారణమైనది. భిక్ష—భిక్షలో—కక్ష—కక్షలో—లక్ష-లక్షతో-శిక్ష. శిక్షింపబడవలసిన పాతూరి వీరన్నను పట్ట పగ్గములులేక రక్షకభటులు కిక్కురుమనలేదు. వీరేంద్రి కేసరి చర్యలలో అంతయు నిరాశ—రాఘవుల నడతలో పేరాశ—కుందనలాలు కుదింపులో అంతయు దురాశ—ఆఖరు కంతయు నిరాశ—రజాకు రంగు-సీత సిగ్గు-కాంతమ్మ కెగ్గు-కుందనలాలుకు వెగ్గు-ఈయెగ్గు పెగ్గులన్నియు కలిసి కుం
...లున కఠినశిక్ష చెప్పించినవి. విశ్వాసరావు విశ్వాసములో-రజాకు
...చదువరు లందరు నోలలాడవలసినదే? రాక్షసుడుగా నటిం
...? వీరన్నై పోరులలో సహితము వుద్యోగస్థుల రక్షిం
...న్నారు? చదివిన గాని తెలియదు.

300 పేజీలు. వెల 1—8—0

---

...య్య, బుక్సెల్లరు, రాజమండ్రి.

# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B158 |
| పుస్తకం పేరు | హరిశ్చంద్రోపాఖ్యానము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | 65TO68 |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |